# అధ్యాత్మరామాయణకీర్తనలు

సుబ్రహ్మణ్యకవికృతము.

ప్రకాశకులు

కె. యల్. యన్. సోమయాజులుగారు,

గోదావరీ బుక్కుడిపో

రాజమండ్రి.




అడ్డేపల్లి లక్ష్మణస్వామినాయడుగారిచే

సరస్వతీపవర్ ప్రెస్‌నందు

ముద్రితము.

రాజమహేంద్రవరము.

1924.

శ్రీ రస్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు.

## బాలకాండము.

### ౧. ధన్యాసిరాగము- ఆదితాళము.

పల్లవి.—నమశ్శివాయ తే నమో భవాయ.

అనుపల్లవి.—సమానాధికరహితాయ, శాంతాయ-స్వప్రకాశాయ, పరిమోదపూర్ణాయ, భక్తౌఘ-పాలనాయ॥నమ॥

చరణములు.—గర్విత దానవలోక-ఖండనాయ, శ్రీరజత। పర్వతాగ్రనిలయాయ- పావనాయ । సర్వలోకపాపపుంజ-నిర్వాపణాయ- శర్వాయ । దర్వీకరభూషణాయ- సర్వోత్తమాయ॥ నమ ॥ ౧

అండజాధిపవాహన-కాండాయ మేరుశైలకో। దండాయ శితికంఠాయ-పండితాయ। మండితత్రిపురజయో- ద్దండతాండవాయబ్ర। హ్మాండనిలయాయమహా- మాయాతీతాయ॥న॥

మందహాసవదనార-విందసుందరాయయోగి। బృందానందదాయశత్రు-భీకరాయ।ఇందుసూర్యాగ్నినేత్రాయ- నందితప్రమథగణాయ।నందివాహనాయపోషిత-బృందారకాయ॥న॥

నిరుపమానందఘన-నిశ్చితాయ శాశ్వతాయ। వరదాభయాకరాయ- గిరీశాయ । తరుణేందుశేఖరాయ- పరమపురు

పాయభవ। హరణాయ శ్రీకాళ-హస్తీశ్వరాయః నమ ॥ ౪
గంగాభంగతరంగసం-గతజటాజూటాయ। సంగీతలో
లాయశుభ-సంగతాయ। అంగజాంతరంగమద-భంగాయస్ఫ
టికోప। మాంగాయ శేషశై-లాధీశమిత్రాయ॥ నమ ॥ ౫

౨. రేగుప్తి- అటతాళము

పల్లవి.—ఈసంశయమువారింపవేపర-మేశనన్నుమన్నింపవే

అను.—శ్రీసదాశివప్రశ్న-చేసెదవివరింపు। వాసుదేవత-
త్త్వమహత్త్వము। భాసమానవిలాస నేనిదె- నీసత్కృపావ
లోకనమున। నీసమయమునఁ దెలియవలసిన - దేసమస్త
మిదేప్రశస్తము॥ ఈసం॥

చరణములు.—జ్ఞానవిజ్ఞానని-శ్చలభక్తివైరా। గ్యానంద
ములకుని-ధానమైనవిన్న। శ్రీనిలయమైవెన్నవలె- మృదువై
యస। మానమైనతిగన్న-మార్గమునిన్న। యైనబహుగోప్య
తర-మైనననూనముగ సెలవిమ్ము చంచల ॥ లేనితంబినులనకు
నేసీదానదానవ-వైరిమ్రొక్కెద॥ ఈసంశయము ॥ ౧

వారిజాక్షుజగదా ధారమూర్తియైన। రాముని రుందు-
సారసద్భక్తి। కామార్థమైముక్తి-కారణమైయుల। రారునొక్క-
యుక్తినాదిశక్తి। మీరారసిధీరసికాళికి సారకళలూరఁబలుకుము
భవ। నీరధికి తారకము భక్తి-మీఅనుజనులు వేఱెలేరని॥ ఈసం॥

దేవశ్రీరాముని దేవదేవుఁగాప- ద్మభవాతీతునిగాసుధీవరు
లెల్ల భావమునఁజెల్లఁబల్కుదురతని - భావింతురదియెల్లఁ గల్ల
గాదె: గావునను శ్రీవిభుఁడు ముక్తికి- కేవలము తావలమునైనను।

శ్రీ వెలయు భూవలయమునఁ దను-భావుఁడై-జీవుఁడైన దేవి॥
ఈసంశ॥

మాయావృతుఁడై రామస్వామినన్నర్తి-దాయకునిగను
తనుఁదాఁ దెలియలేఁడు। వేయేలనతఁడు చూఁడు ఆత్మనుతత్త్వ
వేత్తలకేనేఁడు దెలిసినాఁడు। మాయకుండటందురొకకొంద
ఱ-దేయథార్థము సేయు సుజన। ధ్యేయుఁ డెటులగునైన జానకి-
కాయెడలఁ దానడలనేటికి॥ నీసంశయము॥ ౪

ఈవాక్యముల కర్థమీవు గాకితరులు-భావించిపలుక నేర్ప
రులెవరులేరు। దేవుఁడవై చెలువుబూఅు-నిన్నుఁ జేరు-ధీరాత్ము
లుగోరు-కోర్కెలీడేరు। నీవసుధ శేషశైలాధిపుఁ - డై వెలుఁగు
రాఘువుచరితము సుధావర్షమై చెవులపండువు-గావించు సే
వించుజనులకు॥ నీసంశయము॥ ౫

3. భైరవి-ఆటతాళము,

పల్లవి.—వినవే సత్యవాణి శర్వాణి అలివేణి నీరజపాణి.

అను.—ననుఁగోరిభజియిం చి-ననుమదిలో నెంచి। నను, వరదు
డనౌదు-సంశయములేదు। మునుపు ఇటులిదియనుగ రెవ్వ
రును మహాయోగి వరసంభా। వనము జీవనమమృతసే-వ
నము జన్మపావనము॥ వినవే॥

చరణము.—శ్రీరామునకునమస్కారము - చేసియనివార
ణనాత్మ-తత్త్వమునీకువివరింతు । నారాఘువుఁడు శౌరి- యాజ్ఞా
నహారిజ। తారిశ్రీవిహారి-మాయాధారి । తారకకీర్తిన-త్యజ్ఞాన
స్ఫూర్తివి। దారితార్తిదేవతాచక్రవర్తి చి-దానందమూర్తి

ధై రాజిలుశ్రీ-హరిమాయకెల్లనాధారమైనందువల్ల- మోహా
ముకల్ల। శౌరిప్రకృతికినాదినిజమా-యారూఢిగజగములుసృజిం
చియు। నారతమునభముగతివెలిలోను పూ-ర్తనుబూను॥ విన॥ ౧

వితతమాయచేని-ర్మితమైనజగమువి। స్మృతిసూచిచుంబిత
శిలచేఁబరిణమించు। గతియొక కర్తృత్వము-అతనికిలేదుదు। ర్మతు
లెఱుఁగరీదారికోర్కులమీఱి। మతిహీనులైరియే-మనవచ్చు
వారిసం। స్మృతియొకోరియందుచేబద్ధులైరి యామధుకైటభా
రి। అతిశుద్ధచిద్ఘనుఁ- డనతెలియకజ్ఞాన- మతనికిఁగలదందురి
భువిలోఁగొండఱు। తతవసుద్యుతిలసన్మాలిక-నుతగళాన్వితము
య్యుమఱచిన। గతిమనస్థితుఁడౌజగద్గురుని-ఖిలులెఱుంగరని॥

అకటాసూర్యునియందు నప్రకాశత్వము। ఒకనాఁటికై
నను-ఉన్న దేయటువలెనే। ప్రకటమైజ్యోతిస్స్వ-భావమాత్మ
నియందు। పనిలేదుమాయనా-థునిసీవిఁకమీఁదఁ। అకలంక
గనవేని-త్యమునమ్మమున వేర। ఉకుఁడనవేశేష-శైలేశుఁగన
వేభక్తియుఁ జేకొనవే। అకుటిలనయనచాంచ-ల్యముచెప్పాట
లుచలదృ। ష్టికిచూడనునికికిపట్లు- భ్రాంతమైనట్లు। సకలకాల
ములనుప్రభామా-లికిఁబగల్రాత్రిలేనటులా। త్మకుసుజ్ఞానాజ్ఞాన
ములు-రెండులేనినైయుండు॥ విన॥ ౩

౪. కేదారగౌళ- ఆదితాళము.

పల్లవి.—సీతారామమారుతిసంవాదము-చేరివినవేశ్రీదము.

అను.—సీతాంశుముఖియాచరితమునందలి। చాతుర్యము
చూడు,సంశయమువీడు। ఖ్యాతిగమునుదశ-కంఠుని రవికుల।

జాతుఁడై నరఘురాముఁడు సబల । వ్రాతముగనుఁజంపి సాప్తుఁడై సా । కేతపురి జేరియున్న తత్తినినడచిన .సీతా.

చరణములు.—హాటకసింహాసనమున రాముఁడు కోటిసూర్యసమకాంతిని వెలుఁగుచు । పాటలాధరధరాసుతతోడను-పరగవసిష్ఠాదిగురుబుధమిత్రి । కోటిసేవింపనాదినారాయణుఁడై- మేటిభక్తానుమోదికమలావినోది । దీటులేకకొలువుండిహనుమంతుమనసు-దెలిసిసీతనుఁబలుకుమునముద్దుఁబలుక। మాటికిభక్తాగ్రణికిఁగృతమతి- సాటిలేనిశౌర్యధైర్యఘనుఁడును । మేటిమైనయనిలసూనుఁగనుఁగొని- తేటముగనులోకమోహినిపలికెను ॥సీతా॥ ౧

రాముఁడు పరమానందమయుఁడుస- ర్వచరాచరపరిపూర్ణుఁడవ్యయుఁడు । సామగానలోలుఁడచలుఁడాద్యుఁడు-సర్వసాక్షియమ్మవినిర్ముక్త । రాముఁడిది నిజమ్మసు పరమాత్ముఁడనుచువేమాఱుదెలిసికొమ్ముభక్తులసామ్ము । సామీరిసంశయమెల్లనుపోఁజిమ్ము- నామాటదినమ్ము ధీనిధివిగమ్మువమ నవలెనేమూలప్రకృతిని ఈమహాత్ముసన్నిధానమా । త్రనుఈ మహాద్భుతములొనర్చుమూఢులు- స్వామియందునారోపణసేయుదురనె ॥సీతా॥ ౨

ఈకోసలపురిలో రాముఁడై దశరథునకు-నితఁడుపుట్టుటయు విశ్వామిత్రుయాగము । సాకల్యముసేయుటయు సహల్యకు-శాపముఁబాపుటయువిల్లువిఱిచిసన్నుఁ । జేకొనిచెలఁగుటయు పరశురాముని-ఢాకయడంచుటయుఁ బురిఁజేరుటయు । కైక

పనుప దండకాటవికేఁగుట । ప్రాకటమాయాసీతహృతి యం
దుచేత । శ్రీకరరవిసుతుఁ-జేరివాలినటు-జేరివారినిధిగట్టి రావ
ణుని । భీకరాజిదునిమిననున్నఁగైకొని-సాకేతముఁజేరుటెల్లమ
త్ప్రతియనె ॥సీతా॥ ౩

ఆ రాఘవునియందీవిధమజ్ఞాను-లారోపణసేయుదురుమధు
కైటభారి నిర్వికారుఁడఖిలాత్మకుఁడు- పరిణామరహితుఁడు
బ్రహ్మమేయుతుఁడు । సూరిబృందనుతుఁడుఆనందయుతుఁడు-
భూరిభువనహితుఁడుసకలసమ్మతుఁడు । కారుణ్యనైర్ఘృణ్యహే
యోపాదేయ సుఖదుఃఖగమనాగమనాదిద్వంద్వములు లేవీ।
శ్రీరమణీయుని విభునెఱిఁగిన-వారిఁజేరవెఱచిమాయపరువిడు।
దారితారిశేషశైలశిఖరవి-హారిఁజేరికడతేరుదారియిది॥సీతా

౫. సావేరి-ఆదితాళము

పల్ల.——వినుమని శ్రీరాముఁడు తాఁబలికెను-విశదముగను జేరి॥
అనుపల్లవి.——జనకజచే విన్న యనిలజునికి జ్ఞాన।
జనకమౌనట్లుగాను మోదముతోను ॥విను॥

చరణములు.——సమతను ఆత్మానాత్మపరాత్మల-జాడలు
త్రివిధములు పవనజ। మమతాహంకార కర్తృత్వములన-
మరినయది యాత్మ। రమణననృతజడదుఃఖమువలను నీరసమ
యినదియనాత్మ-నిత్యము। విమలముసత్యజ్ఞానానందా- త్మక
మిదియెపరాత్మమహాత్మ ॥విను॥

ఆకాశము త్రివిధంబయినట్లు ప-రాత్మ త్రివిధమౌనోఁ
దెలియఁగ। నైకముగానుపరాకాశముజ-లాశయబింబితము

నఁ జేకొనితడ వచ్చినాన్నకాశము - చెలఁగిభిత్తి యందు నెంతయు।
ప్రకటముగనీటు ప్రతిబింబితమై - ప్రబలినదీచాయ శ్రీయాంజ
నేయ ॥విను॥ ౩

చాతురిమీఱి యఖండాద్వితీయ - చైతన్యమువలనబింబ
భూతుఁడై త్రివిధాహంకారవిరా - ట్పురుషుఁడు చూపట్టె।
అతనియందాభాసరూపమయి - భూతేంద్రియమనోవృతమ
యి। ఖ్యాతిగాంచిజీవాత్మయనఁదనరెఁ గనుఁగొనుమీజాడ
క్రమముతోడ ॥విను॥

గుణమయమాయాకృతయనపాసం - గినజీవత్వాదిమలి
నములు। గాంతింపనవిచ్ఛిన్నమైనయవి - యాపరాత్మయందు।
ననయములనునారోపణసేయుదు - రజ్ఞానులుభువిలో నెఱుఁగక।
యనిశముశుక్తి రజతమనిభ్రమయుటే - యాభాసమనఁదగును
దెలియనగును ॥విను॥ ౪

చెలఁగునవిచ్ఛిన్నతబ్రహ్మమువి - చ్ఛేదముకల్పితము గా
వున నలభిన్నునకుపూర్ణాత్మకు నైక్యము - నలననుసుజనులచే।
నలఘుతత్త్వమస్యాదిమహావా - క్యములచేఁ బ్రకటమైయుల
రెను। వెలయఁగనైక్యజ్ఞానము గల్గన - విద్య మాయమాను
గుణములతోను ॥విను॥ ౫

పావనులై యీక్రియ మెఱిఁగినమ - ద్భక్తులుమత్పదముఁ
జెందుదు। రీవసుధనుభక్తివిహీనులుగ - ర్వితులై। దుర్మతులై
కేవలమును శాస్త్రగర్తములఁబడి - కెరలిభవశతములనొందుచు
భావముచెడి సుజ్ఞానదూరులయి - పోవుట నిశ్చయమునీకేమి

భయము ॥వినుః॥ ౬

పరమమైనయీయుపదేశముగో - ప్యమిదిభక్తిలేనివారి ।
కరయనింద్రరాజ్యమొసంగిననీ-య్యకుమిదిభవహరము । గరి
మనఖిలవేదాంతసారసం-గ్రహముఃశుభావహముకనుఁగొను ।
సురుచిరశేషాచలశిఖరనివా - సుఁడనై భువిలోను వెలసినాను॥

౭. కాంభోజి-ఆదితాళము

పల్లవి.— నేధన్యనైతినే జగత్ప్రభూ-సాధులోకవిభూ-
అను-మాధవచరణారవింద-మకరందముగ్రోలఁగల్గెనేధన్య.

చర.—మునుమిడిసంశయమను- ముడివీడనీయనుగ్రహ।
మున రామతత్త్వముసంక్షేప - ముగవిఁటిఁగడతేరఁగంటి ।
మనసుతనివిదీరదాయె.- మన్నింపవేదైవరాయ । అనవంద
నినుఁజేరమాయ-యతిదూరమై తొలగిపోయె. నేధన్య.

అద్వితీయాఖండపరిపూ - ర్ణానందవారిధిలో । చిద్విలా
సోల్లాసినినైరం-జిల్లఁజేసినన్నుఁజూసి । హృద్వికాసమొసరించి
హితవాక్యములుపదేశించుటచే । విధ్వస్తశోకరవి - శ్వేశ
శంభూమహాదేవ . నేధన్య. ౨

స్వామీనేనీచేవిన్న యీ-చరితము నవరసభరితము। వేమా
ఱుదీనివినఁబల్కు-వీనుల కమృతముఁజల్కు । శ్రీమహీశాభి
రాముఁడైన శ్రీ - రాముని దేవతాసార్వభౌముని నీవలనఁ
దెలిసి . నేధన్య. 3

౮. గౌళిపంతు-ఆదితాళము,

పల్లవి.—వినుముధరాధరవరతనయా ధృత వినయాసరస

గుణాతిశయా.

అనుపల్లవి.—చనవుమీఱ అనన్న డిగినయీశుభ-
చరితముహతదురితము మది నిరతము .విను.

చర.—రావణాదిదుష్టాసురకోటుల మోపలేక భరపీడి
తయైభూ। దేవివిమలగోరూపముగై కొని శ్రీవిలసిలుబ్రహ్మ
లోకమునకును। కేవిగనేఁగివిరించిచరణరాజీవములకు ప్రణ
మ్మిలఁదడుపుచు।సావధానముగ మ్రొక్కివినతయై తావచ్చు
టవినిపించెవిశదముగ .విను. ౧

వనజభవుఁడొకముహూర్తమాత్రము మనమున నంతయు
నూహచేసిక్రొ।న్నవిల్తునితండ్రిని గనుఁగొనుటకు ముని
సురపరివృతుఁడై భూనహితము। గనుచనిక్షీరసముద్రతీరము
న ననుపమభక్తివినమ్రుఁడై హరిని। వినుతించెను వేదాంత
వాక్యముల ఘనవినయానందములుపురిగొన .విను. ౨

కోటిసహస్రాంశుసమప్రభచే ,మాటికిదిక్కులు తేటగఁజే
యుచు। హాటకాంబరముకటిపై వెలుఁగకి;రీటహారకేయూర
కాంతులుల। లాటకంఠ బాహువులనుదనరఁగ మేటికౌస్తుభ
శ్రీవత్సములకు। నాటపట్టయిచతుర్భుజుఁడగుచు నిశాటవైరి
గనుపట్టెమోదమున .విను. ౩

గరుడవాహనారూఢుఁడుకమలా ధరణీయువతీ యుగళ
యుతుఁడుశం। ఖరథాంగగదాపద్మవిరాజితుఁ డురుతరవన
మాలికాభిరాముఁడు। ధరనీరేజవిశాలలోచనుఁడు పరమా
మృతకరుణాలోకనుఁడగు।హరి చరణద్వయిశిరముసోఁకఁగ

ను సరసిజగర్భుఁడుప్రొక్కి పలికెనది .విను. ౪
తనువుమనసుప్రాణములింద్రియములు వినుతనిశ్చయాత్మ
కయగుమతితోఁ గొనగూర్చి భవత్పదవినతుఁడనై తినని సు
హృత్పుండరీకమునకును గోనినిరతానందానుభవంబున నెన
యువారుభవరహితులభవత్రిభు । వనముపుట్టిపెరిఁగి గెడయు
టిది నీ ఘనమాయగదా! యనె పితామహుఁడు .విను. ౫
సూరిజనులు వేదాంతమునందలి సారవిచారముచేసి ఘోర
స । సారరుక్షితులకౌషధంబుదారభక్తియనిపల్కిరి గాన
య నారతమదిదయచేయుమనినవిని శౌరియజుని కరుణార్ద్ర
దృష్టిచే నారసినీయభిమతములొసంగుదుఁ గోరుమనిననుత్సు
కుఁడై పలికెను. .వినుము. ౬
శ్రీలలనాధిప చిత్తగింపుమీ భూలోకమునను రావణు
డనఁగా పౌలస్త్యునిసుతుడొకఁడు గలఁడు సువి శాలమైతగు
మదీయవరంబున మేలుఁజెందసురకంటకుఁడై కడు-వాలియు
న్నవాఁడతనికిమర్త్యుని చేలయంబువిధియించితిదనుజుని- లీ
లామనుజుఁడవై వధియింపుమనె ॥వినుము॥ ౭
వనజోదరుఁడిట్లనియెను కశ్యప - మునిమునునదనయు
నిగమ్మని వేఁడిన నేసమ్మతిపడితిసిప్పుడతం డినకులమునదశరథు
డై నాఁడా ఘనునకుకౌశల్యకుపుత్రుఁడనై - జనియించెదనిజ
యోగమాయయె జనకునియింటనుసీతయగునుపో-ఁమ్మనిచ
క్రితిరోధానమునొందెను .వినుము. ౮
సురలకునిట్లనియెనుచతురాస్యుఁడు- హరివాక్యముతె

ల్లవింటికేవానరులసృజింపుఁడువిూయంశములను- పరమేశున
కుసహాయముసేయుఁడు। పరమసమ్మతంబగుననుచువసుం-ధర
నూరడించినిజనివాసమున। కంటెనలువశేషాచలవాసుని- శర
ణాగతవత్సలుఁడని పొగడను॥ వినుము॥

రా. కన్నడా- ఆదితాళము.

పల్లవి.—అందముగానీకథవినవే రజ-తాచలసదనా పరిహాసి
తవి।నిందితారవిందచంద్రవదనా- కుందబృందసుందరరదనా।

అనుపల్లవి.—మందయానదశరథవసుధేశుఁడు, మాన్యయశు
డయోధ్యాకాంతుఁడు। పొందుగఁదనయులు లేనందు
కువగఁ-జెంది వసిష్ఠునిఁ జేరి పల్కెనా॥ నంద॥

చరణములు.—మనవివినుముస్వామీనాకీఁక శ్రీ-మం
తులై నసుతులు వేవెర। పుత్రజనియించెదరాత్మజహీనునకు-
ధనంబుసుఖకరంబుగాదుగదా। అనినరాజుకనియె నావసిష్ఠుఁ
డు-జననాయక నీకుకొడుకులు। ఘనులమలయశోధనులున
ల్వురికఁ-గల్గెద రందుకుపాయము గలదనె॥ అంద॥ ౧

శాంతుఁడైన ఋశ్యశృంగమహాని- శ్వరునిబిలువనంపు
మీపుని। శాంత పుత్రికామేష్టినిరంతర- సంతోషస్వాంతుఁ
డవై యొనరింపు। మంత్రియుఁద్వరగా ననుడును శాంతా- కాం
తునిరావించిరపుడు। ధ్యాంతుఁడుమునిపరివృతుఁడై సరయు
వు-చెంతయజ్ఞదీక్ష చేకొని నిలిచె॥ నంద॥ ౨

వేదమంత్రములుపలుకుచుకుచియై - వెల్వఁగహుతవ
హుఁడుహవ్యము। సాదరమునఁగైకొని తగఁబ్రిదత్తి-నార్చ

లలర జ్వలియించెనుసుత్రిభుఁడై। ఖేదహారుఁడు యజ్ఞేశుఁడుద
శరథ-మేదినీశ్వరునకుశుభసం। పాదకమగు పాయసపాత్రి
మొసఁగి పరమాత్ముఁడు సుతుఁడగు నీకనిచనె॥ నంద॥ ౩

లలిసలరిరివహానులులబ్ధమనో-రథుఁడై దశరథుఁడుము
దమునఁ। జెలగుచుబుశ్యశృంగవసిష్ఠుల- చేననుజ్ఞగొనిహవి
స్సువేడుకను। కలితగుణుఁడుకౌసల్యకుసగముఁను- కైకకుసగ
మొసఁగవారలు। దెలిసినుమిత్రికుఁదమయంశముల౦ దెలమి
సగముసగ మొసఁగిరి నిరతా॥ నంద॥ ౪

పరమాన్నముభుజియించినమువ్వురు- తరుణులు గర్భి
ణులై వెలిఁగిరి। నిరతముసురకాంతలసేఁగఁవొమ్మిది-నెలలునిం
డకౌసల్యగనెనుసుతుని। పరఁగజైత్రశుద్ధనవమినిపున-ర్వసున
క్షత్రమునసుమనో। హరకర్కాటకలగ్నమునను శే- షాచలే
శుఁడగుహరిజనియించె సా॥ నంద॥ ౫

౯. శంకరాభరణము- ఆటతాళము.

పల్ల.—శ్రీరామునిగాంచెను పార్వతీవినవే - మనకౌసల్య
యాత్మారామునిగాంచెను॥

అనుపల్లవి.—శ్రీరమైహర్షాశ్రు-పూరముకన్నులః।జారభయ
సంభ్రమా-శ్చర్యముల్పనఁగొనఁగా॥ శ్రీరా॥

చరణములు—అలనల్లకలువరే-కులచాయమేనిచేఁజె
లఁగువానిపసిఁడిచేలఁగట్టినవాని। వెలయునాల్గుభుజములవాని
కనుగొ-బ్బులనరుణరేఖలుగలవాని స్వర్ణకుం। డలలనితగం
డమండలములవానిస-స్ఖలితరవికోటిప్రకాశునిరతోన్న। జ్వల

కిరీటమువాని నళినీలకుటిలకుంతలములచే ముద్దుగుల్కుచుం
డెడివాని॥ శ్రీరా॥ ౧

ఘనతరశంఖచక్రగదాబ్జములవాని - వనమాలికయు
ఉరఁదనరువానిచెలువ । వ్వనువెన్నెలలానన చంద్రుఁడుది
క్కులను వెదచల్లఁ జెల్వలరారెడువాని । ననుపమానకరుణా
మృతపూర్ణ నేత్రునిమంజీరాంగదశ్రీవత్సకటకకం । కణహార
కేయూర కౌస్తుభాదిభూ - షణభూషితునిఁజూచి తనివితీరక
తిరుగ॥ శ్రీరా॥ ౨

శరణాగతులనుకరుణరక్షించుశ్రీ-ధరనీకుబహువందనము
లొనర్చెద। శరణుగర్వితదనుజచయవిరామరామ-శరణుదేవ
తాసార్వభౌమనీవె। పరమాత్ముఁడవుజగత్పతివీశుఁడవుహరిని
వరయోగిబృందహృద్వనజకర్త్రికా । తరమున సురుచిరరాకా
జ్యోతివై - మెఱయునిన్నెన్ననాతరముగాదనితిరుగ॥ శ్రీరా॥

ఈశనీవునిఖిలేంద్రియసాక్షివి-శ్రీశుఁడవీవిశ్వసృష్టిసంరక్ష
ణానాశములొకటనుజేసిచేయకయున్న - వాసిచేఁ బోయిపోవని
వాఁడవై ప్రకృతిఁదాసిదాయనివాఁడవై శాశ్వతుఁడవై యాకా
శాదిభూత సంఘములకెల్లనవ। కాశమైనీవు ప్రకాశింతువిది
మాయాపాశబద్ధుల కెఱుగవశముగాదనితిరుగ॥ శ్రీరా॥ ౪

నీజఠరమునందనేకబ్రహ్మాండములీ- యోజంబరమాణువు
లై యున్నవిభుఁడునీవు । రాజిల్లునాయుదరమునఁబుట్టుటకల్ప
భూజముముంగిటమొలిచినట్లయ్యెనం। భోజాక్ష!పతిధనపుత్రా
డిసక్తనై -నేజెల్లసంసారనీరధింబడనొల్ల। శ్రీజానినీశరణుచెం

దితినామదిని- తేజరిల్లుచును సుస్థిరుఁడవు గమ్మని॥ శ్రీరా॥

ఈయఖిలమును మోహింపఁజేయునీదు- మాయకునగపడఁ జేయకుననుశేష। శాయియీహాపముసంహరింపఁగదోయి- కాయజజనకచక్రనిముద్దుపట్టివై। హాయిగానన్నలరఁజేయు మమితానందదాయివనినినుమునినిదలఁతురుఘనులెల్ల। మాయురే! యనుచు వేమాఱునువినుతించిశ్రీయుతమూర్తియౌ శేషాచలేశుఁడా॥ శ్రీరా॥

౧౦. ముఖారి- ఆదితాళము.

పల్లవి— రాముని సకలగుణాభి- రాముని నిఖిలరాక్షసవిరాముని వర్ణింపవశమా॥

అనుప.— వేమాఱు కౌసల్యనీ వే- మేమిగోరినావదియెల్ల। శ్రీ మీఱనొసంగితిననుచు- ప్రేమచేజననితోఁబలికిన. రా.

చర.— మున్ను బ్రహ్మనన్ను వేఁడు - కొన్నభూభారముదీర్ప నన్నెమీఱఁగనునేఁడు నీగర్భమునఁ- జెన్నలరఁ బుట్టితిఁ జూడ రావణాసురుఁ। డన్నిటగర్వించినాఁడు వానివధియించి। సన్నుతిగాంతునీరేడుజగములలోన- మున్నలదశరథుఁడునీవు నన్నుఁదపమున మెప్పించి। కన్నారఁ నీవదితివతఁడు-కశ్యపుఁడని కౌసల్యకుఁ దెలిపిన. రాముని.

అనుచుఁదల్లితోఁబలికి-హరిముద్దుబాలుఁడై కలికి। తనమున హరినీలగాత్రుఁడై వికసిత-వనజదళవిశాలనేత్రుఁడై చక్కనివాఁ। డనుచునుతియించఁ బాత్రుఁడై - అమలపవిత్రకాశమునకుఁజూడఁ దరుణమిత్రుఁడై- విలసిల్లెనంత। ఘనుఁడైన

తనయుఁడు గల్గెనని విని - దశరథుఁ డానందమునను గురునితోఁ
డఁ గూడి - చనుదెంచి కన్గొనెను శ్రీరఘు ॥రాముని॥ ౨

విరులవానలప్పుడుగురిసె - వేడ్క జయదుందుభులు మొర
సె। సురసుందరులెల్లమి నాడిరి - గంధర్వవరులు। సరసులై రా
గములుపాడిరి - హూనలుదోషా। చరులవలనిభయమువీడిరి -
పౌరులానందమ్ కరునిజూడ గుమిగూడిరి - దశదిశలయందు। పరి
మళమిళితములై తె - మ్మెరలువిసరెదివినిసురలు। వరవిమానా
రూఢులయి శ్రీ - హరియని మ్రొక్కి - రాత్మ ॥రాముని॥

ఘనవిభుఁడై నకోమరుని - గనెను కై కచంద్రబింబా। నను
లను సుమిత్ర - గనెసుతులనిర్వురను। మొనసినసంతోష - మున
ను దశరథుఁడు సకల। ధనములవిప్రులందన - పెనువసిష్ఠ మహా।
ముని యా బాలురకు క్రమము - నను రామభరతల। లక్ష్మణశ
త్రుఘ్నులనుచు నామకరణము - లొనరించెభరతుం। డను శ
త్రుఘ్నుఁడు జోడై రిలక్ష్మణుఁడు ననుసరించెను. దశరథ॥రా॥

చెలఁగి సౌమిత్రితోఁ గూడి - మెలఁగుచుఁ దేనియలొలుకఁ।
బలుకుసుతుని నృపుఁడు గాంచి భూషణజాల। ములతోడనలం
కరించి నిస్తు గస్తూరి - తిలకము నుదుట నుంచి గళమున రత్న। క
లితహారములుగీలించి ముద్దాడునప్పుడు - కలకలనవ్వుచు మద్ది -
కాయలల్లాడ నందియలు। ఘల్లు ఘల్లనుచు మ్రోయ - లలిత
గతులనటియించు శ్రీ ॥రాముని॥

చిన్నారి బొజ్జలోననున్న - గన్నవాఁడానాపాలిఁటి। పెన్ని
ధానమ రారా యోరినాచిన్ని। యన్న బూచివచ్చె రారా - ప

రుగత్తెవల । దన్ననాతో నలుగనేలా- పాటపాడుచు । నిన్ను లాలియూచెదరా- లాలపోసెదరా । మన్ను చేతనంటవద్దు వెన్న పెట్టెదనుచు చాల । మన్నించి పలుకు- కౌసల్యకా మరులు రెట్టింపఁ జేయు శ్రీ॥ రాముని॥ ౬

ధరణీవిభుఁడు భుజియించు- తఱిని కౌసల్యతనయుని । మురిపెమున రమ్మనుచుఁ జీర- వర యోగిహృదయాం । తరమునందుఁ జెల్వుమీఱ- వసియించు దేవుఁడు । చిఱుతవాఁడయి ముద్దుగార- వచ్చినఁ జూచి । తరుణి తనదు కోర్కులు మీఱ - కౌఁగిటనుంచి । కరుణించి భుజియించుమనిన - కబళము చేనందుకొని । తిరుఁగనాటలాడఁ బరుగె- త్తిన మాయాబాలకుఁడా శ్రీ ॥ రా॥ ౭

వితతయశుఁడు దశరథభూ- విభుఁడంతట గామా । రాన్వితులసుతులఁ బిలకించి యుపనయనములు- సతులముగ నొనరించి వసిష్ఠునొద్ద । శ్రుతుల నెల్లఁ జదివించి- చతురంగముల । గతులఁ దెలియనేర్పరించి- చౌషష్టివిద్యల । చతురులను గావించి- హర్షించువారు సత । తము గురుబంధుమిత్ర జనులకెల్ల హితులై ధైర్యో । న్నతులయి పరఁగిరందులో శ్రీ - యుతుఁడయి సత్యవ్రతుఁడయిన శ్రీ .రాముని. ౮

తల్లిదండ్రులకు ప్రియము- దనరగఁ నశ్వము నెక్కి । విల్లునమ్ములు చేపట్టి- వేఁటలాడుచు । మొల్లముగా నడవి నున్నట్టిమృగ-ములగుండెలు ఝల్లు । ఝల్లునఁ జుట్టిముట్టి పోనీక వాని నెల్ల చలపట్టి పడఁగొట్టి సౌమిత్రిఁ గూడి । బల్లిదుఁడై యన్నియయోధ్యా-వల్లభునకు కాన్కఁ జేసి । సల్లలితుఁడై సకలజనుల - సవినయముగాఁ బాలించు శ్రీ॥ రాము॥ ౯

శైలరాజకన్యకా! యీ చందమున మనుజావతార। లీల
మైవర్తించెశౌరి కనుఁగొనుమింద్ర । జాలికుఁడు చక్రిధారి
సమస్తవేద। మూలమైవిలసిల్లుచారి యజ్ఞులుదెలియఁ। జాల
రతఁడు నిర్వికారి విమతసంహారి। శ్రీలచేఁజెలువందు శేషశై
లశిఖరాగ్రవిహారణ। శీలుఁడై సద్భక్తలోక పాలుఁడై దనరు
నిత్యాత్మ శ్రీ॥ రాము॥

౧౧. నాదనామక్రియ-ఆటతాళము.

పల్లవి.—ఇందువదనా! వినవె యీచరితము-సుందరదనా॥
అను.—డెందము శ్రీముకుందుని పాదార । విందములం
దానందింపఁజేసిరా. కేందు.

ధీరుఁడు విశ్వామిత్రుఁడు తానయోధ్యకు శ్రీరాముని జూ
డవచ్చెను, అని। వార్యుఁడై సాధముఁజొచ్చెను ఎదురుగా
రాజు చనితోడి తెచ్చెను మునికి । చారుసింహాసనమిచ్చెను మ
హా। దారుఁడై పూజయొనర్చెను, కరము । లారూఢిసౌద
లఁ జేర్చెను స్వామి, మీరు వచ్చుట కేమి కారణమది దెల్పుఁ!
డీరాజ్యమైన మీ-కిచ్చెద ననెను రా॥ కేందు॥ ౧

కౌశికుఁడా పూజ గైకొని పల్కె-భూ- మీశ మారీచ సు
బాహులు మాం। సాశను లద్భుత దేహులు- ఘోర। పైశా
చిక ప్రీత వాహులు- కాల। పాశవిడంబిత బాహులు దిభి। జే
శాదిసుర మునిద్రోహులు యజ్ఞ। నాశకులధిక దుర్మోహులు-
గాన! జూసి వారలపొగరడరించ సలక్ష్మణుని। జేసి రాముని
బంపుమీ శుభ మౌనసె॥ నిందు॥ ౨

భూమీశుఁ డేకాంతమున వసిష్ఠుతోఁ బల్కె- నేమి సేయు దు నేమందు నెట్లు। రాముని నెడబాసి యుందును సుగుణ। ధాము నెన్నఁడు గనుఁగొందును గురు। స్వామి యెవ్విధి సుఖము చెందును, ఈవి। శ్వామిత్రునుడి యెట్లు విందును ఇతని। కేమి మనవిఁ జేసికొందును నేను। ఈమాట వినకున్న- నిప్పుడె శాపమిచ్చు। నీమాని యనగురుఁ-డిట్లని యనెను రా॥ కేందు॥ ౩

నరవర విను మిది పరమరహస్యము - నరుఁడా శ్రీరఘు రాముఁడు ఘోర। దురితాంధకారవిరాముఁడు హరి-పరమాత్ముఁడు కమలాకాముఁడు భక్త। వరదుఁడు ప్రణతసుత్రాముఁడు దిన। కరవంశజలనిధిసోముఁడు మాని। పరదేవతా సార్వభౌముఁడు ఇతఁడు। పరమేష్ఠిచే తొల్లి ప్రార్థితుఁ డయి భూమి। భరము మాన్ప నీవరతనయుఁ డాయె ననె॥ నిందు॥ ౪

రాజా నీవు కశ్యపబ్రహ్మవు కౌసల్య- జేజేల కెల్లను తల్లి అదితి। నాఁజనుతరుణీమతల్లి మీరు। శ్రీజాని భజియించి తొల్లి-చాలఁ- బూజింప నతఁ డుల్లసిల్లి సుతుఁడనై జనించెద మీకు నెల్లి నని య-వ్యాజకరుణారసముఁ జల్లి-నేఁడు। రాజీవాక్షుఁడు రాముఁడై చూపట్టె శేషుఁ-డే జుమి లక్ష్మణుఁ డిది నిజ మనెను రా॥ కేందు॥ ౫

వరశంఖచక్రము ల్భరతశత్రుఘ్నులై- రరుదార హరియాజ్ఞచేత సురు। చిరయోగమాయయె సీత యనఁగ-మెఱసి జనకవంశజాతయై। పరగుచున్నది ధీసమేత వినుత- సరససద్గుణమణివ్రాతయిది। పరమగోప్యము లక్ష్మణుని రాముని మాని-

వరు వెంటఁ బంపుమని బల్కె వశిష్ఠుఁ॥ డిందు॥ ౬

రామలక్ష్మణులను రాజు పిలువఁబంచి- ప్రేమతోఁ గౌఁగిటనుంచెను- తానామ। హామహులనుతియించెను- తన- దే మహాభాగ్యమని యెంచెను-వి। శ్వామిత్రుఁ జాలఁ బూజించెను-ఘనశ్యాముని నతని కర్పించెను- శుభ। మౌ మీాకని దీవించెను- శ్రీరాములంకట ధను- ర్బాణతూణీరధరు। లై మించి మునివెంట నతిమోదమునఁ జని॥ రిందు॥ ౭

లలిని బలాతిబలలను రెండువి-ద్యలు రామునకు మౌనియిచ్చెను-రాముఁ। డలరి గంగానదిని మెచ్చెను-ఆ। వలఁబోవఁ దాటక వచ్చెనుదానిఁ। బొలియింప ముని సెలవిచ్చెను ఒక్క-। ములికి యురమ్మున గ్రుచ్చెను దనుజ- విలవిల తన్నుకచచ్చెను-ఆ। వెలఁది యాబిడరూపు విడి యక్షసతియై- చెలఁగి రా మునిఁబొగడి- శ్రీమీాఱఁ జనెను రా॥ కేందు॥ ౮

కౌఁగిట రాముని గదియించి జడదారి- వేగమే శిరము ముద్దాడెను-అంత। బాగాయె నని కొనియాడెను మహా-యోగి ధ్యేయుఁడ వనుచు వేఁడెను-హర్ష। సాగరమున నోలలాడెను- మహా-భాగుఁడు ముదమునఁగూడెను-వీత। రాగుఁడై భయమెల్ల వీడెనునిగ- మాగమమంత్రరహస్యములను దెల్పె-నీగతి శేషగిరీశుఁడౌహరికి రా॥ కేందు॥ ౯

౧౨. సౌరాష్ట్రి- ఆదితాళము.

పల్లవి.—వినవే సుగుణానీతా, గిరిరాజసుతా.

అను.—మునియుతులై రాఘవులు, నాశ్రమ। మునను

నాఁడునిలిచివేకువ। ఘనులుసిద్ధాశ్రమగతులైరచ్చటి।మునులారాఘవులను బూజించిరి॥ వినవే॥

శ్రీరఘురామునిచే ననుజ్ఞఁగొని। సారయశుఁడు విశ్వామిత్రుఁడుక్రతు। వారంభించెను, మహాజనవృతుఁడై। సారెకు మారీచసుబాహులస్ర। ధారలు గురిసి రహో। ధీరుఁడుదాశరథి మహోద్ధతుఁడై। మారీచు ననిల, మార్గణమున। వారిధిలోఁబడ,వైచి సుబాహుని। దారితుఁజేసెను, దహనాస్త్రమునను॥ వినవే॥ ౧

సునిశితబాణము, లను సౌమిత్రి త। దనుచరులను జంపెనుబువ్వులజడి నెనసి సురలుగురి, యించిరి సంభ్రమ। మునను గుశికసుతుఁడినకులతిలకుని। తనతోడ నిడుకొని। నెనరునఁ గౌఁగిట నునిచి లక్ష్మణుని, మునునిడి కొనియాడి, ఫలములు, అనఘులకును భోజనములొనర్చెను, దినములుమూఁడిటు, చనెను సరసముగ॥ విన॥ ౨

మునిపతి శ్రీరా,మునితోఁ బలికెను। జనకునియాగము, గనుఁగొనఁజనియెద। ననువుగ మీరు వ, చ్చిన శుభ వానన। వినతుఁ డగుచునను, జనిఁగూడి తపో। ధనువెంటముదముతోఁ। జనిచనియెదుటను, వనమొకటిఫలసు, మనస్తరులతాలం, కృతమై జనవిరహితమై, గనుపట్టినదీ, వనమేమనరా,మునితో మునిపలికె. వినవే. 3

గౌతముఁ డనుముని, గలఁడు లోకవి, ఖ్యాతుఁడాతనికహల్యయనుసతిని। ధాతయొసంగెనా, దంపతు లిచ్చటఁ।

ప్రీతినుండ నింద్రుఁడు నొకనాఁడు। గౌతమ వేషమున। నాతి నెనసిచను, నాతఁడిస్నాతుఁడై। గౌతమముని వచ్చి, భస్మీ। భూతుఁ జేతునాతో బొంకకు మనఁబురు। హూతుఁడు మర్జాతి నైతిఁ గావు మనెను. వినవే. ౪

శాప మొసగెను, సహస్రభగుఁడ। వై పొమ్మని వృత్రారి నహల్యను। కోపమున శిలా, రూపముగమ్మనె, నేపరజంతురహితముగఁ జేసెను, ఈవనమా మహాని, బాపు రేయెన్నఁడు నీపై రఘుపతి, శ్రీపాదము పెట్టు, నాఁటికి, శాపము చెడునని, చనె సతీమణికి, పాపము బాపవె, పరమపురుషా యనెను॥ విన॥ ౫

రామునికరము క, రమ్మునఁ బట్టిమ, హాముని యప్పుడ, హల్యను జూపిన, భామపైని దనఁ పాదము నుంచి మహామతియగుచు న, హల్య, దనరఁగని, రాముఁడు తామ్రొక్క, రామామణియు సలక్ష్మణుని ధను; ర్బాణధరుని కనకాంబరుని, శ్రీమన్మందస్మితవదనుని శ్రీ, రాముని శేషాద్రి, ధామునిఁ జూచెను॥ విన॥ ౬

౧౩. బిలహరి- ఆటతాళము.

పల్లవి.—శరణు శరణని రామ, చంద్రుని నహల్య, సన్నుతించెను॥ వినవే॥

అను.—పరమపురుషుఁడనుచు గౌతమవాక్య-సరణి మదిలో నెన్నుచు- శౌరికిమ్రొక్కి- యనుదార నర్ఘ్య పాద్యములిచ్చి హర్ష విస్ఫురితాక్షియై మించి-పులకించి నీ, చరణనీరజ పరాగమునను - దురిత మెల్లఁ దొలఁగె నహహా, గరిమ

తోను కృతార్థనైలి జ-గత్ప్రభూ కమలావిభూ హరి॥ శర॥

చరణములు—ఏవిభుపాద రా-జీవ రేణువులచేఁ బావ
నమైనది-భాగీరథీమహా, దేవిబ్రహ్మాది సు-రావళి నేమహాను
భావుఁడు గావించె- సేవరదుపదరజము, వేవేలవిధముల-వెద
కఁబడును శ్రుతుల-చేవనజభవుఁ డెవని శ్రీనాభిపద్మమం, దా
విర్భవించె నవ్యయుఁ డైనపురవైరి, యేవిశ్వగురునామ మే
ప్రొద్దు భజియించు, నేవీరవరుపాద మీభువనజాలముల- నె
ల్లనాక్రమించెను, శ్రీవనితామణికి- నెవ్వని యురము చెలఁగి
విహరింప నునికిపట్టయ్యెనే, దేవునిపద మనిందితరాజయోగి
హృద్ధ్యేయమై తనరారి చెలువుమీఱు, నావిభుం డావరమఁ
డాగురుఁ డావరుఁడా దేవుఁ డిదెననుఁ, బ్రోవుటకు, ప్రత్యక్ష
మయ్యెన- హావిచిత్ర మటంచు నెంచి. శరణు.

శ్రీరఘువీర నీలీల లత్యద్భుతము - లేరికితరముగా దివి
తెలియమర్త్యావ, తారమునను జగత్త్రయము మాయామో
హ-పారవశ్యము నొంద భ్రమియించితివి నిర్వి, కారుఁడవీవు
చలనరహితుఁడవువి, కారచలనాదులు గలవారివలెనుందు,
వారయఁబూర్ణుఁడవానందమయుండ వ,క్రూరుఁడ వతిమా
యి- కుఁడవుసవిస్మయో, దార విశుద్ధుఁడ వాత్మప్రజా ఖం
డబో- ధస్వరూపుఁడ వజుఁడవు, పారమార్థికుఁడ వీవేభూత
ముల కా-ధారభూతమ వీవే యీజగము నీవే, సారెకు జగ
దా-శ్రయుఁడవీవె కర్తృకారణ కార్యము-లు నీవిలాసములు,
చేరి కన్గొనఁగనేరక తనుధారి వందురు గాని నిన్ను, దారి

తాఖిలకలుష మగుపర- తత్త్వమన ఖలులచే నగునా. శర.

జలజలోచన నీవలఘు మాయాగుణ, ములచే బింబితుఁడవై, విలసిల్లి జగదుదయ, విలయములకు బ్రహ్మవిష్ణ్వీశ్వరనామములఁ బూనియున్నావు తెలియఁగ నొకఁడవె, వలనుమీఱఁగాను వాచ్యవాచక భేదముల జగన్మయుఁడవై, యలరుచుందువునీవ, స్ఖలిత తేజుఁడ వోంకార వాచ్యుఁడవు వాక్కులకగోచరుఁడవు గూఢవర్తనుఁడవు, బళిబళి శ్రీరామభద్రగుణోన్నిద్రప్రథనాంగణరుద్ర, కలిత కౌస్తుభహార శ్రీశేషా, చలశిఖరవిహార మోహనాకార, చెలిని చంచలను ని, శ్చలజ్ఞానమార్గము, దెలియ నెంతటి దాన నీదాసను, కలుగఁజేయుమునాకునీపద, నలినభక్తినిరంతరమ్ముగ, జెలఁగి వందనశతములొనరిం- చెదను దాశరథీ దయానిధీ॥ శరణు॥

౧౪. బేగడ- ఆదితాళము.

పల్లవి—వినీలవేణి వినుతగుణశ్రేణి, వినవే శర్వాణి॥

అనుపల్లవి—ఘనాఘనాంగుఁడౌరా, మునిచే ననుజ్ఞగొనిగౌతమ, మునియొద్దకుఁజనె నహల్య, మునీంద్రుఁడౌ రామునిఁ జూచిపలికె, ఘనంబుగను మిథి, లాపురంబునను, క్రతువరంబుమా, హేశ్వరచాపము,కనుఁగొనియనంతరంబయోధ్యకుఁ జనెదవనట వినమ్రుఁడయ్యెను హరి॥ వినీల॥

రంగదభంగ తరంగగంగను, ప్రొంగుచు దాఁటి విదేహరాజపురి, చెంగటరాఁగ నెఱింగి జనకుఁడు చెలంగుచునె

దురుగను, రంగుగఁ జని గాధేయునకును సాష్టాంగ మొఱఁ
గి పూజించి దిశల్ వెలుఁగంగ జేయుచంద్రసూర్యులో సు
ర,పుంగవుల నరనారాయణులో, శృంగారకళల నం,బం
గారుతళుకు లనంగాను దగినవీరలెవ్వ, రెఱుఁగవలయు నన
దశరథాత్మజులు! మంగళకరులీరామలక్ష్మణులు- మహాభు
జుల్ ఘనులని ముని దెల్పెను. విసీల. ౧

తీవిగ మత్క్రతుసంరక్షణమున,కై వీరలనే దోడితె
చ్చునెడ, పావనుఁ డీరాఘవుఁ డొకశరమునఁ, జావనేసెఁ
దాఁటకను, భూవర మదీయయాగవిఘాతకు, లైనవరలును బా
హుప్రముఖనిశిచ, రావళిఁ దుంచియు మారీచు జలధి,లో
వైచెఁ బదాంబుజరజమునను, ఈవీరుఁడహల్యను వేవేగఁబవి
త్రతను, గావించి నేఁడు నీగృహంబున గరకంఠు విల్లనుఁగొన
వచ్చెను, నావును నగరికిఁదోడ్కొనిచని యానరేంద్రుఁడా
రాముని బూజించెను. విసీల. ౨

అంతట జనకుఁడు మంత్రులఁ బిలిచి పు, రాంతకువి
లుదెమ్మనిన భటుల న,త్యంతబలుల నైదువేలఁ బంపినఁ,
బంతమువిూఱఁజని, సంతతమును మణిశస్త్రాదులచే, నెంత
యుభూషితమై ఘంటాళత, కాంతమైనవిలు దెచ్చిన ధరణీ,
కాంతుఁడు కౌశికుఁగనుఁగొని యావింత, నృపవరు లంతా
చూడఁగఁసంతోషమున రఘూద్వహుఁడీ, చాపమెక్కిడినఁ
జాలును సీతా,కాంత నిత్తుననిని శ్రీరాముని, కనుంగొనె
న్మనిదరహాసమునను. విసీల.



శ్రీరాముఁడు వామకరంబున విల్లాహూతిగఁ గొని యెక్కిడినృపతులు। చేరిచూడదక్షిణకరమునసరు, దారగవంచినపుడె। సారముచెడి ఫెళఫెళమని విరిగెను. వైరివరులధైర్యముతోఁజూడఁద। దారవము దిశల్నిండె దివివిభూ,నాహూఘులగుచుఁ గనుగొనుదేవత। లారాముని శ్రీమీఁబొగడి రి, తోరంబుగాఁ బ్రసూనవర్షమును, దుందుభిధ్వను లప్సర వనితాజన। చారునాట్యములు చెలఁగ రాఘవునిఁ, జనేశుఁడర్మిలిఁగౌఁగిల నుంచెను.వినీల. ౪

ఫుల్లాంబుజపత్రాక్షుఁడు రాముఁడు విల్లువిఱచుటలు విని యంతఃపుర।పల్లవాధరలు మనసీతకు శ్రీ, వల్లభుఁడనఁ దగిన।వలభుఁడిదె వచ్చెను చల్లనివాఁ డెల్లజగములను నేలఁ జాలువాఁ। డల్లమరునైనఁ జక్కఁదనమున నుల్లసంబులాడన లెయమ్మ। చెల్లా రాముని వల్లాకోరిక, లెల్ల ఫలించు నంశపావనుఁ, డీమహాత్ముఁడంచని పలికి సరస।సల్లాపము లాడు చుసీతకు మణి, సరు ల్వీరుల్ హారువుగఁగై సేసిరి .వినీల.౫

పట్టుచీరగటిగట్టి రవిక చను, కట్టుదిట్టముగఁ గట్టిమృగమదము: బొట్టునుదుట నునిచికనులకాటుక, పెట్టి కురులు దువ్వి। దట్టముగా కీల్ముడివై చిమల్లె, మట్టువిరాజి వేడుక చే సరములు। చుట్టి స్వర్ణభూషణములు మేనను, దట్టముగా బూనియొక్క చెలికేల్। వట్టి, జనకునిపట్టి శౌరికి। పట్టంపు రాణి నౌదు నేనని, బాళితోఁడఁ గుందనపు బొమ్మవలె। నెట్టనరాజమరాళకరిగతులనెరానిరాకరింపుచునడిచెను .వీని.

తాటంకద్యుతి దిక్కుల నెల్లను,దీటుకొనఁగఁ బావటబొట్టును సరి। సాటిలేని చంద్రసూర్యులును స, య్యాటమును మెఱయ। తేటముత్యపుసరులు పదకములు, మేటిచిలుకతాళితోడఁ బెనఁగొన, మాటికి నందెలు ఘల్లని మ్రోయఁగఁ దీటులేని వైఖరి సీతావ, ధూటి, గుణములపేటి, హారకి, రీటాదిభూషణాఢ్య శేషగి,రీశు రామభూవిభునిచేరి మణి,హాటకమయమాలిక గళమున నిడి,హరిన్ వరించితివని చనెముదమున .విసీల. ౭

౧౫. కాపి-జంపెతాళము.

పల్లవి—విను హైమవతీ ఘనా,ఘనసుందరాకృతీ, వినుతధృతీ కరుణామతీ।

అనుపల్లవి—తనమంత్రిలను బనిచె దశరథుని తోడితె, మ్మనిజనకనృపతివేగా బాగా.విను.

ఆరూఢి దివసత్రియమున వార లయోధ్యఁ, జేరిదశరథునిగాంచి, ధీరులై మ్రొక్కి బహుదివ్యవస్తువుల నదు, దారఁ గానుకయుంచి। శ్రీరామునకు జయశ్రీరామునకు సీతనునిశ్చయించి నేఁడు శ్రీ, మీఱ మిముఁ బిలువనం,పెను జనకుఁడన సంభ్ర, మించివేడుక దలంచి మించి .విను. ౧

జనవిభుఁడు శ్రీరామచంద్రునకుఁ గళ్యాణ, మని చాట నానతిచ్చి, జనకమంత్రులకు నుత్సాహమున రత్నభూషణదుకూలములు నిచ్చి, తనగురుండగు వసిష్ఠుని సుమంత్రినిఁ గనిరా, మునిపెండ్లివార్తదెచ్చి, తగుఁగదా,

జనకవిభుబాంధవ్య, మనిఁ గడు లెస్స యని, రనువుగా
ముదము హెచ్చి మెచ్చి .విను.

మఱునాఁడు గురుహితస, మస్తజను లెల్ల వే,మఱు
బలిసి కొలువఁగాను, అరుదైనయాణిము త్యములగొడుగు
లనీడ, ౹నధికవైభవముతోను, భరతశత్రుఘ్ను లిరు,వురు
గజారూఢులై, యిరుగడలఁ జేరి రాను, రథ మెక్కి, నరవ
రుఁడు మిథిలానగరమునకుఁ జనె నెలమి, నాల్గుదినముల
లోను, దాను .విను. ౩

హితమతిని దశరథున, కెదురుగాఁజనిపురో, హితస
హితుఁడై జనకుఁడు చతురుఁడై పూజింప, పరసులై రామ
ల,క్ష్మణులు తమతండ్రికపుడు, అతిభక్తిఁ బ్రిణమిల్ల, నా
లింగన మొనర్చి నానందమునను నృపుఁడు, తతమహోన్న
త జనకరాజసదనమున సుతకౌశికా, న్వితుఁడై వసించెనతఁ
డు, జనహితుఁడు .విను. ౪

తనయాగకర్మము, తయుఁ దీర్చి జనకుఁడు శ,తా
నందుతోడ ననెను, .దనరు కాశ్యపుర,మున మదనుజుఁడు
కుశ,ధ్వజుఁ డుండు మోదముననుఁ మొనసిపిలువనంపుమన,
వినియట్లు సేయఁ జ,య్యన వచ్చి యతఁడన్నను పొడగాం
చి, తనకుమారికలు తా,నును మ్రొక్కి వర్ధిల్లుఁ, డనుచు
దీవెనలు గొనెను, మనెను.విను. ౫

లలిని జనకుఁడు పుర మ,లంకరింపు మనఁ దో,రణ
చయోల్లాసితంబు అలఘుసౌధధ్వజో, జ్జ్వలము గోపురవి

తా, నావళిరాజితంబు, ఫలభారసమ్రరం భాస్తంభశోభిత, ప్రతిగృహప్రాంగణంబు, కహ్లార, కలితాంబుపూరగంధిల రాజమార్గంబు, కై సేసి రాపురంబు, డంబు .విను. ౬

క్రమముతో నంతఃపురములంకరించి బంగారు కుంభముల నుంచి, సమమైన పచ్చరాజగలపై నిలిపి నీలముల బోదెలుఘటించి, రమణీయముగను బగడములదూలములు వజ్రములగొణిగెలు రచించి, చతుర్ద్వారముల గొమరొప్ప కళ్యాణవేదిక గట్టి, రమరికను సంతసించి, మేలెంచె .విను.

ఎలమి సీతాదికాంతలకు నలుగులు వెట్టి, తలలంటి జలకమార్చి, జిలుగులను దడియొత్తి, చెలగి, సరిగంచు చీరలు గట్టి కురులు దీర్చి, వలనొప్ప గొప్పకొప్పులు వెట్టి చందనం, బలంది తిలకములు దిద్ది రవికలను, హారయుం జనుకట్టుపై, నలవరిచి కై సేయ, నలందిరసముగం జేర్చి, మది చేర్చి ॥విను॥ ౭

పరంగ కేకయపతికు, మారుండు యుధాజిత్తు, వచ్చె నచ్చటికి నంత।వరుస దశరథుండు నల్వురుసుతులభూషణా, వళులం గై సేసి చెంత, సిరులలరం జానుండు, తటి జనకుం డానంద, భరితుండై భద్రదంతా, వళములను, గరిమమునం బనుపరాఘవులెక్కి రాజమార్గములం జూపట్టిరంత, వింత॥విను

పొదలుచును గౌసల్య, మొదలౌ సతులు గొల్వ, భూపతులు చేరి కొలువ, విదితమాగధవంది, బృందములు గొలువ నట,విట గాయకులును గొలువ, సదయులు వసిష్ఠ

వి, శ్వామిత్రు లాశీర్వ, చనము లొసఁగుచును గొలువ, క
ళ్యాణ, సదనమునకరిగె శే,షగిరీశుఁడగు రామ,చంద్రుఁ
డొకఁ ముదము మొలువ, చెలువ ॥విను॥ ౧౨

౧౩. కల్యాణి-ఆటతాళము.

పల్లవి.—కల్యాణమువిన వేనేఁడు సీతా,కల్యాణము విన॥

అను.—కల్యాణమయమైన, కల్యాణనిలయమున, కల్యా
ణపతిఁ డాయ,హల్యావరదుని ॥కల్యా॥

వేదనాదములు వేణుమర్దళవీ, ణాదుందుభిడిండిమాది మ
హావాద్య,నాదములు పుణ్యాంగ, నాబృందశుభగాన, నాద
ములుఁజెలఁగ జ,నకుఁ డెదుర్కొని దశర,థాదిభూపతులక,
ర్ణాసనమునిల్చి యా। మీఁద సపురోహితుడై దేవముఖ
హైమవేదిఁ బ్రతిష్టించి, వివిధమంత్రములచే, వేదోక్తహో
మ, విధు లొనరించి సీతాదికన్యల ధన్యల నల్వురను స,మ్మో
దమున రావించి, మురియుచు శుభజాలా,పాదకముగ మధు,
పర్క మిచ్చి వేడ్కఁ, బ్రోదిచేసి నృపుఁడు, పూజించె రా
ఘవుల ॥కల్యా॥ ౧

శ్రీమిథిల జనకుఁడు శృంగారవతియైసౌ,దామినీలతమా
డ్కిఁ, దనరెడుసీతా,కోమలి తెఱమఱుఁ,గున నుంచి చాలఁ
గా, రాముని రమాభి, రాముఁడైనశ్రీ, రామచంద్రునిపా
ద,రాజీవములు గడిగి, సేమమునఁ దజ్జలము, శిరమున ధరి
యించి, సేమముతో సీత, నిఖిలలోకమాత, కామితసిద్ధసం
కల్పపూర్వకముగ, భూమీశుఁడు ధార,వోసె నగ్ని, సాక్షి

గా మానవతిని రా,ఘవుఁడు చేకొనె దేవ-తామందారసు
మ,ధారలు గురిసె భ,ద్రానితగుణులై యలరువధూవరు
లపై ॥కల్యా॥ ౨

అంతటఁ దెర దీయ,సతిపమోముఁ జూచి, సంతసించెను,
రామచంద్రుకన్గవతారా,కాంతుఁ గనుఁగొని యలరు,కలువ
లపోల్కినా,యింతిచూపులు దనరె-హృదయేశుపదయుగళి,
నెంతయుఁ దామరల, నెనయు తేఁటు లనఁగా, కాంతామణి
ని పాణి,గ్రహణ మొనరఁజేసి, కంతుజనకుఁడు మం,గళసూ
త్రము గట్టి, దంతిగమనకు మణులు, తలఁబ్రాలు పోసి శ్రీ
మంతుఁడై లాజహోమముఁ జేసి కృతకృత్య,స్వాంతుఁ డ
య్యెను తాట,కాంతకుఁ డటమీఁద, సంతతానందమున, జ
నకుఁ డూర్మిళ నిచ్చె, మంతు కెక్కగను లక్ష్మణకుమారు
నకు ॥కల్యా॥ ౩

వరుసతోడను కుశ, ధ్వజునికుమార్తెల, సురుచిరమాం
డవి, శ్రుతకీర్తుల నిరువురను, భరతశత్రుఘ్నులకును జనక
ధరణీశుఁ డానంద,భరితుఁ డగుచు నొసఁగె నరుదారఁగాఁ
బెండ్లి,యలరారెనా వేళఁ, జిరతరయశులు, వసిష్ఠవిశ్వామిత్రు,
లురువుగ నావధూవరులకు సేసలు,శిరమున నిడిరి యా,శీ
ర్వాదములు చేసి,రిరవంద దశరథా,ధీశుఁడు దీవించె, గరిమ
ను కౌసల్య, కైకసుమిత్రాది, కరిగమనలు మం, గళహార
తు లొసంగి రా,తటి రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు॥క॥

జనకవిభుఁడు కౌశి,కుని వసిష్ఠునిఁ గనుఁ,గొని పల్కెనా

రద,ముని యిచటి కొకనాఁడు, చనుదెంచి నను విను మని
పలికె హరిభక్త, జనవరదుఁడయి నిర్జరులను బ్రోవరా,వణు
వధియింప రఘువంశమునను రా,ముడనుపేర దాశరథి, వై
నాలుగంశముల, జననమొందెనుసీత, యనునామమున నీయిం
టను యోగమాయ పుట్టెను దెలిసి కౌసల్య, తనయునకుసీత
నిమ్మని చనె నది మొదలుగను సీత శ్రీసతి, యని తలఁచి
యేవిధమున రాముఁ డల్లుఁడౌనని చింతించి ధను, వనునెప
మున మీఁద, యనుశుభము గంటి ననె. కల్యాణ. ౫

శ్రీరామచంద్రుని జేరి జనకుఁడు పలికె, శౌరి నాజన్మ
ము సాఫల్యమాయె ను,దార యీపావనస్థలిని సీతాయుతుఁ
డవై రంజిల నిన్నుఁజూడ నర్హుఁడనైతి ర,మారమణ భువన
నిర్మాణనైపుణిగలిగె, నీరజభవునకు నీపాదవారిచే, నీరమ్య
పదజలము నెత్తి దాల్చి బలి మ,హా,వీరుఁడై సురరాజ్యవిభ
వము చేకొనె, సారమౌ నీపాదరజమున నహల్య, ఘోరశా
పము దొలఁగె కోవిదులును నీయు, దారాంఘ్రి రేణువులు
కోరి భవభయదూరు, లైరట్టి నీవే శరణని పొగడ రా
ముని. కల్యా. ౬

సారిది నాసమయమున, సురదుందుభులు మ్రోసె, ధిక్కు
తద్ధిన్నాంతకిటతక, తా, థైథై య్యయనుచు నచ్చరలా,
డిరి గంధర్వవరులు పాడిరి భూసురవరుల ధరణీ, వరులఁబూ
జచేసి, సరసమృష్టాన్నభో, జనము లిడి రీ,కరణిఁ బరఁగ నా
లునాళ్ళు, జరుగుటయుఁ గౌశికుఁ, డరిగె నల్లుంద్రకు, నరణ

మిచ్చి నృపుఁడు కరుణచేఁ బుత్త్రికల ఘనమతులఁగాంచి, త
రత్రోడఁ బనుప నా,దశరథక్షితిపతి వరమతులు గోడండ్రిసి
రులలర నాశేష, గిరివాసుఁడైన రఘు,వరుని మున్నిడుకొని
పురికి ప్రయాణోన్ముఖుఁ డయ్యె ముదమున. కల్యా. ౭

౧౩. సురటిరాగము- ఆదితాళము,

పల్లవి.—చేరి వినవె శౌరి, చరితము, గౌరీ సుకుమారి గిరి
వరకుమారి.

అను.—వారిజాక్షుఁ డంతటను శ్రీ,మీఱి వేడ్కతోనయో
ధ్యకుఁ, గోరి పోవుదారిలో నృపవైరి యైనపరశురాముఁ
డు, కారుమొగులకరణి చాపధరుఁడై, కాలమృత్యువో
యనఁగఁ బంక్తిరథు, కోరి హరియెదుటను నిలిచిపలికెను
వీరాధివీరుఁ డని మెఱుంగక. చేరి.

బెండువంటివిల్లు నడిమికి, రెండుచేసి పెల్లు పొంగెదు,
కొండనెనయఁ జెల్లు నావిలు, దండివైరులకు ముల్లు, గడు,
గండుమిగిలిదీని నెక్కువెట్టిన, గాని రాముఁడనను నినునటు
గా, కుండినఁ జంపుదు నన రాముఁ డతనికో, దండముగొ
ని చక్క నెక్కిడి య,ఖండాశుగము తగఁ దొడిగి తెగ, నిం
డఁ దిగిచి భార్గవుఁడనిను, కాండాహతచరణుఁ జేసి నృప,
కాండాభిరాముఁడనౌదుననినఁ, బుండరీకలోచనుండితండని
పూర్వకాల సంస్మృతిపొడమి పొగడి, భండనప్రచండపండి
తుండ వ,జాండాధిపతివవ్యయుఁడ వనెను. చేరి. ౧

బాల్యమునను నేను, ఘోరత, పంబు చేయుచోను, హరి

వా, త్సల్యమొప్పఁగాను, వేగఁబ్రి,సన్నుఁడై పలికెదాను,
సా, ఫల్యమయ్యె నీతపమును జన,సమ్మతమునువచ్చి వంశ
యుతుఁడవగుసా, ఫల్యబలుఁడ వగుచుఁ బిత్రుహాననుఁడగు కా
ర్తవీర్యగెలిచి ఖలనృపుల నై, కల్యాత్మకులఁ జంపి శమదమ
ముల్పార్థితుఁడ వగుము నేఁ గా, నల్యాగర్భమున రాముఁడన,
గల్యాణదాయినై జనించి య, హల్యాసతిఁ బవిత్రిఁజేసి
సీతను,గళ్యాణమై నీకు దర్శనము, తుల్యముగ నొసఁగుదు
నని చనియె దయతో నాహరియ నీవని చనియెఁ ॥చేరి ౨

స్వామి నేను మించి, హైహయ-వంశజులను ద్రుంచి
శాంతుఁడ, నై ముదము దలంచి, చెలఁగెద, నీమహామహి
మనెంచి, ఖగ, గామి నీబలంబు నీవు గొంటివి, గాన నేను
ధన్యతముఁడనైతిని, నీమహనీయదర్శనము గలిగెఁ బి,తా
మహాదుల కగోచరుఁడవు శ్రీరామామనోహరుఁడ వగురఘు,
రామా,ప్రకృతికంటెఁ బరుఁడవు, కామాద్యరివర్గదూరుఁడ
వ,హో మాధవ భవరహితుడవు, కామకర్మగుణవర్జితుఁడవు
నుదక,మున ఫేనజాలములు ననలమున,ధూమమెటుల నటు
లనే యఖిలమును, నీమాయచేఁ గల్పితం బనె ॥చేరి॥

ఎంతదాఁక నరుఁడు నీపద-హితులపొత్తుఁ జొరఁడు, విను
వాఁ,డంతదాఁక కరుడువలెను భ,వాబ్ధిఁ దిరుగుపామరుఁ
డుప, కాంతుఁడై సుజనసంగతివలనను,గనినభక్తి చేత నెపు
డునిన్నున, నంతు నాశ్రియించునపుడు, మాయకు, నంత
మజితుఁడునుస్వప్రకాశుఁడును, శాంతాత్మకుఁడునైన సద్గు
రుఁ,డంతవాని కగపడును సుని, తాంతానంద మతనిచేఁ
గని,చింతాలతల నెల్లఁద్రుంచిని, రంతరాత్మసుఖముఁ జెం

దునీపద, రాజీవయుగభక్తి లేనినరు, లంత మొంది జ్ఞానము
క్తిసుఖముల, నంద వశముగాక చెడుదురనె. చేరి. ౫

ఈశ శరణు శరణు దురితవి-నాశ శరణు శరణు, సుజన,
క్లేశహరణ శరణూ, జయజయ శ్రీరామ శరణు శరణు, నేఁ,
జేసినట్టిపుణ్య మెల్ల నీదుమ, హాళుగమున కొనఁగినాఁడనను
దయఁజేసి ప్రోవ మనఁ బరశురామునకు, సీతావిభుఁడు ప్రస
న్నుఁడై పలికె, వాసి నీమనంబునను దల, పోసి వరముఁ గో
రు నినుకృపఁ, జేసినా ననిన భృగుకులుఁడు, భాసిల్లుచు నీ
దుపదరజో లేశమునకు నే వరంబు నమ మఖి, లేశ భక్తిని
మ్మనఁ గృతార్థునిగఁజేసి పనుపఁజనియె జామదగ్ని ని, జే
చ్ఛం దనుఁజరిపు నుతించుచుజనె. చేరి.

ప్రీతుఁ డయ్యెఁ జాలా, దశరథ విభుఁడంతట లీలా, గుణ
ముల, చేత నలరి శీలా, తగఁపురిఁ జేరి చక్రి యావేళ, భూ,
జాతనెనసి తనరు ననుఁజులును నిజ, సతులరతుల నేలి రతులవి
భవన, మేతుఁడు జగత్ప్రభుఁడుఁ బ్రథితగుణ, జాతుఁ డవ్యయా
నందమూర్తి నం, గీతానందకీర్తి సుగుణ, భూతాద్యఖిలసా
క్షిమాయా, జాతాఖిలకలుషహరుఁడు సా, కేతాధిపుఁడై
యుండె హరిద, యాతిశయత నిదియుఁ జెప్పె సుబ్ర-హ్మ
ణ్యకవి శేషగిరీశుపేరవి। ఖ్యాతి మీఱ నధ్యాత్మరామాయ,
ణాఖ్యానమున బాలకాండమిది. చేరి.

బాలకాండము-

సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు.

## అయోధ్యాకాండము.

౧. కర్ణాటకసారంగ-అటతాళము.

పల్లవి.—శ్రీసద్గుణాన్వితా శీతాద్రిసుత వినవే. కౌశేయ, వాసుఁడు శేషాచల వాసునిచరిత్రము.

అను.—భాసిల్లునంతఃపురవరమునందు మణిసింహాసనస్థితుఁడై మునిసుతుఁడై మహో, ల్లాసుఁడై దరహాసుఁడై శ్రీవాసుఁడై శ్రితదాసుఁడయి సీ, తాసహితుఁడగురా మునిఁ గను తలఁపూని సురమౌని వచ్చెను. శ్రీస.

శరదిందుచంద్రికాసదృశమౌ తనుద్యుతుల, మెఱయుచు వచ్చువాని నారదునిగా, నెఱిఁగి సీతాజానియు దేవీయుతుఁడయి, పొరపొచ్చ మింతలేనిభక్తిచే మ్రొక్కి, పరఁగఁ బూజించి మౌని నీదర్శనసం, స్మరణచే విషయాసక్తచిత్తులమైసం, సారచింత మాటికిఁ గలుగుమముబోంట్లకు దొరక దిది దుర్లభమునినుఁగని పరమపావనుఁడనైతిని, భా, స్కరుఁడు రాఁ దమమడఁగుక్రియ నజ్ఞాన మడఁగు నన ముని పల్కెను. శ్రీ.

శ్రీరామ భ్రమయఁజేసెదవో నను లోకాను, సారవాక్యములచేను సం, సారి నను టిది యరయ సత్యమేను జగదాది

యీరామా, యీరమణి గృహిణిగాను జేయుటను నీసుతులై బ్రహ్మాదులెల్లను త్రిజగన్మహాసం, సారి నీవు హరి జనకజ లక్ష్మి పురవైరి నీవు సీత హిమశైలజాత, వారిజభవుండ నీవు ధరణిజ, వాణిరవి నీవు ప్రభ జానకి, యీహాధి శ్రీపురుషవాక్యము లన్ని సీతయు నీవ యనియెను. శ్రీస. ౨

స్వామీ నీఛాయ యవ్యాకృత మనఁబడు నది, యే మూలప్రకృతి దాన మహత్తత్త్వ మూమహత్తత్వాన లింగశరీర, మై మఱి యది సకలమైనతనువులఁ జేసె న, హంకారబుద్ధి ప్రాణాజ్ఞానకర్మేంద్రియ, సాముదాయకము లింగ, శరీర మనఁబడు నదె జన్మకర్మమూలము ఇంద్రజాలము, ఆమహాత్మయె జీవసంజ్ఞనాద్యవిద్యోపాధి నొందిన, దై మించె స్థూలాది దేహత్రియమెజీవోపాధి యనియును. శ్రీస.

స్థూలసూక్ష్మకారణాల జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మూఁడు గల్గె నీసంసృతి, లీలచే నెనయువాఁడు జీవుఁడె పరమాత్మ త్రి, కాలసాక్షి యీరేడులోకముల కాది, మూలమది నీవే చూచుమా యీభువన, జాలములు నీయందె జననస్థితిలయములై జరుగుచున్నవి రామా రాక్షసవిరామా, వ్యాళ మని త్రాడు గని బెదరిన పోలికను దను జీవుఁ డనుకొను, బాలిశుఁడు ఘనుఁ డాత్మతా నని భయరహితుఁడయి యలరు ననియెను. శ్రీస. ౪

ఏనీ తేజమున నీయఖిలమును వెలుఁగు, నిది ఖలుఁడు తెలియలేక దేహ, మేనే నని యెంచుఁ బుణ్యశ్లోక! యెందాఁక

న, జ్ఞానము తెగిపోక యుండు నందాఁక, దీనుఁ డగు జనుఁ
డు నీకారుణ్యమునవి, జ్ఞానానంద మొసవిన నమలుఁ డౌ నది
నీపా, దారవిందభక్తిని గలుగునది ముక్తిని, దాస మగు
రామ నీదాసులదాసుఁడను కరుణనను, బ్రోవుము, నీనాభిక
మలజుఁడు మాతండ్రి యటుగాన నేఁ బాత్రుఁడ ననె. శ్రీస.

అని చాలా ప్రీణతుఁడై యానందబాష్పములు, కనుల
జడిగొన జడదారి రఘువంశతిలకుని, వినుతించె వేడ్కఁ జేరి
రావణవధార్థము, జనియించినావు శౌరి దశరథుఁడు నిన్ను,
జనవిభుని జేయఁగోరి యున్నాఁ డటుల, యిన రావణుఁడు
చచ్చు నెటులతనిఁ జంపుదు, నని ప్రతిజ్ఞఁ జేసినావు మును
డాసి, వినుముభూభారహరణమునకు మొనయు మిది వనజ
భవువాక్యము, ననినఁ జిఱునగవు మొగమున జిగిబెనఁగొ
నఁగ ననియె శ్రీరాముఁడు. శ్రీస. ౬

విను నారద నే నెఱుఁగని దేమియును లేదు, మును ప్రతిన
నాచేత నెటు చేయఁబడె నటు, ల నేఁ జేతు సకలభూతముల
సుఖాసుఖములు, ఘనకాలసంజాతములు ప్రారబ్ధ, మున నగు
నవిభువన నే తన్నై తగులక నేనే, యెనసి వినోదింతు నిదె రేపు
దండకాటవి కేఁగి, మునివేషము దాల్చి సంతోషము, నను
జతుర్దశవత్సరము లుందును సీత యనునెపమునను రా, వణుని
సబలముగఁ జంపుదు నన విని దేవగతిఁ జనె మునీంద్రుఁడు. శ్రీ.

౨. పూరికల్యాణి-ఆదితాళము.

పల్లవి.—వినవే శుకవాణీ మాణిక్య వీణావాదనపటువాణీ.

అను.- మనువంశ్యుఁడు దశరథుఁడంతట మంతనమున వసియించి వసిష్ఠుని ఘనముగ రావించి మన్నించి, విను మనిపలికె మహాత్మ నిఖిలజను, లునుమాటికిఁ బొగడెదరు శ్రీరాముని, ఘనగుణాభిరాముని యువరాజునుగా నొనర్పవలె నిపుడె భరతుఁ డను, జుని గూడి చనెను మామను గనుఁగొన శుభదీక్ష నునుపు రాముని రయముగ ననె. వినవే.

వరమాని దశరథుని వీడ్కొని రఘు వరునగరికి, వేగ రాఁగా శ్రీ, హరి యెదుర్కొని బాగా వసిష్ఠుని పరఁగ సత్కృతుఁ గాఁగాఁ జేసి సీతా, తరుణి హైమకలశోదకములొసంగఁగ, గురునియడుగులు గడిగి, శిరమున నవ్వారి, ధరియించి సేమ మడిగి పూజించి నీ, చరణనీరధారణమునఁ గృతార్థుఁడనై, మెఱసితి ననుదా, శరథిపలుకు విని, చిఱునగవు దొలఁకఁగఁ బలికె మును నీచరణజలము హరుఁడు శిరమునందిడి, పరమపురుషుఁ డాయెమాతండ్రి నలువయు నీపదాంబువుల సుఖియయ్యె ననెను. వినవే. ౧

ఇటు లనఁదగునే లోకగురుఁడవు విశ్వేశుఁడ వనియు రమాపతి వనియు సము, త్కటయశుఁడ వనియుఁ బరమాత్ముఁడ వనియు నిన్నుఁ, గుటిలుల కెఱుఁగవశమా భక్తపాలన, చటులుఁడవై భూభారము మాన్ప రావణునిఁ జంపఁగ మది నెంచి పుట్టితివని, దిటవున నిశ్చయించినాను నేను, అటులైన బహుగోప్యముఁ జేసితి నీ, వెటుల మాయచే సర్వముఁ జేయుదు, వటులనే గురుఁడ నని శిష్యుఁడ వీ, వనుచు నటన నల్పితి స్వామి జగ, న్నటనసూత్రధారి యఖిలభూతాంత

ర్యామి యనన్ వెలయుదువనెను దపసి. వినవే.

నీవు శుద్ధసత్త్వమయమైన మేను నెఱిఁ బూని భువియందు మాయామనుజ, భావమునఁ జెలఁగుచుందు వకట రాజ, సేవ గాసిఁ జెందుపౌరోహిత్య, జీవన మతినిందిత మని తెలిసియు, నీవు రఘువంశమున జనియింతు వని, భావించిసంతసమున నీకు గురుఁడనై, యే వేడుక కిది నేనియ్యకొంటి నాతప మిప్పుడు ఫలియించె నన్నిఁకఁ నీమా, యావిభూతి కగపడుపకు దశరథ భూమివిభుఁడు నిన్ను బట్టము గట్ట కు, భావహుఁ గమ్మనెను సీతతో దీక్షావిధి నుండుమని చనియె వసిష్ఠముని. వినవే. ౩

శ్రీవిభుఁడు లక్ష్మణుని గని నన్ను యౌవరాజ్యాభిషిక్తుఁ జేసెదరు నేను సాక్షిమాత్రుఁడను, నీవె సకలముఁ బూను కర్తవు భోక్తవు, నీవే నాప్రాణములు మేను నుమ్మని పలికె, నావేళఁ బౌరజనులు రాముని యువరాజ్య, శ్రీవిభుని కడు హెచ్చి దశరథుని మెచ్చి, యావార్త లపుడె తెచ్చి కౌసల్యా, దేవి తోడ సుమిత్రాదేవితోఁ దెలుప వార, లావాక్యాకర్ణనమున సంతోషపూర్ణ, లై వెలసిరి సురలు సరస్వతిఁ గని, దేవీ నీ వయోధ్యకుఁ జని విఘ్నము, గావింపుము రామాభిషేకమున కనునావిబుధప్రార్థన కియ్యకొనె వాణి. వినవే. ౪

కొమరారుకై కనగరు దాసియొకతె కుంటిది గూనిదిగుజ్జు రూపు, దిమిడిగ్రుడ్లముడిబొమలుడొంకుమై గలదియయోధ్య లోనిరమణులకు, నవ్వులాటదిమంథర యను, కుమతియొక్క తె గలదు భారతి దానిఁజెంది, కుదురై యుండె నంతఃపురి శృంగా

రముల, నమరి యెంతయు వింతమై యున్నఁజూచిభ్రమసిమం
థర తొందరతో వచ్చి కైక రేపు, రామునకు పట్టాభిషేక
మనిసం గ్రైక, ప్రమద మొదవి బంగారందెలొసఁగఁగా న,
డఁతియొల్ల కిది భయసమయము సుఖ, సమయము గా దబల
శేషశైల, స్వామి యైనరామునిశుభము నీకనెను. వినవే. ౫

౩. తోడిరాగము-అటతాళము.

పల్లవి.—సరసగుణమణిసన్మందిర సఖిక్కతేంది రా. వినవే.

అను.—గరిమముగ రాఘవునియభిషే, కమహోత్సవము
శుభమనక భయా, కర మనుట యేమి శ్రీరాముఁడు,
కౌసల్యగాననుఁజూచు ననుపరమసమ్మతములైన కైక,
వచనము లీవనఁగఁ జాలక మం, థర నీసుతునకుసుఖముఁ,
దలఁచినానుదాయగాను దలఁపకు. సరస.

కైక విను భరతశత్రుఘ్నులుఁ, గేకయపురి కనిచి నీకాం
తుఁ, డేకాంత యేకాంతమున సీతాకాంతు ధరణీకాంతుఁ
గాను, బ్రాకశైశ్వర్యమున కెల్లను పట్టభద్రునిఁ జేయఁ దలఁ
చెను, నీకు సీతనయునకు దాస్యము, నియమించి నొకయు
పాయ మున్నది, నీకు రాజు దేవాసురాజి నిచ్చి, నవరములు
రెండు గలవు, నీకొడుకు దొరతనము రాఘవుని, వనవాస
మును నాన సేయు మనె. సరస. ౧

ఈవిధమున మంథర పలికిన, హిత వని తలఁచి సఖిని
మెచ్చుచు, నావనిత ధీజనితకోపము, నను మాసినచీర గట్టి
వెసను, శేవి యుడిగి భూషణము ల, న్నియుఁ బాఱవైచి

యలుకయింటి, లో నొంటిగా నేలఁ బడి పొర, లుచుండెను
దయగలవాఁడైన, పావనుండైన ధీరుఁడైన, దేవసముఁడైనఁ
గాని కుజన, తావినోదమును వీడఁడేని, తద్గుణానుసారి
యౌను నిజమిది. సరస. ౨

అంతటను దశరథుఁడు కైకగృహంబునకుఁ జని నిశ్శబ్దమై,
కాంతిచెడి భ్రాంతిపడి మెలఁగెడి, కలికితండము గని కలఁగి
విభుఁడు, ఇంతవింత యిదేమి యనఁ జెలు, లెఱుక మాకైకయ
లిగినయది, సంతసము సేయు మన విని యాదంతిగమనను
డాసినీకీ, చింత యేమిటికి కైక నీదు, చిత్త మెటులటులు
చేతు నని, తాంతమోహమునను పా, దముల కపుడు
నృపుఁడు మ్రొక్కిదక్కినా ననె. సరస. ౩

పలికి బొంకనివారు మీరలు, ప్రాణేశ మునుపు నా కొ
సఁగిన, యలఘువరములకు భరతుని రా, జ్యాధిపతిగా రా
ముని కానలో, వెలయఁ బదునాల్గేండ్లు మునియై, నిలువ సెల
విమ్మనుచుఁ గైక, పలుక విని వజ్రిహతవృక్షము, చెలువు
నను భువిఁబడి యంతలోఁ, దెలిసి చెడుగుల గంటె ననుచుఁ,
దలఁచి వెడఁగుకలకంఠి నెదుట, పులివలెం గని తిరుగ మూ
ర్ఛిలినఁ, జెలులుబోధచేసి రాధరాధిపు. సరస. ౪

భార్య గా వీవు శత్రువు నా, పాలిటికి నీకు రాముఁడు పరి,
చర్య యాశ్చర్యముగ సల్పును సతి నీవు రాముని మెత్తు
వెపుడు, ఆర్యసమ్మతుని బొమ్మన నే, నతివ రాజ్యము గొ
మ్మనివసృప, వర్య బొంకి నరకమునఁ బడు, వాఁడ వని కైక

వలుకదశరథుఁడు, కార్య మేమనుచు వసట నొంది, కంది యుండె నారాత్రి చనిన, సూర్యోదయమునఁ దార్యత్రిక, సుభగవినోదము లెసఁగె. సరస. ౫

ఛత్రచామరతురగకరిరథ సముదయము గనుపట్టెభూషిత, గాత్రుని బవిత్రుని సుమిత్రా పుత్రయుతుని కరీంద్రారూఢుని, జైత్రాతపత్రాన్వితుని రామ చంద్రుఁగనిజను లలలరియుండిరి ధాత్రీశుఁ డేమో రాఁ డని య త్తఱిసుమంత్రుఁడు చని, మ్రొక్కి హా, పుత్రిలలామ హా రామ యని పొగులురాజు గని కైక నడుగ, రాత్రి నిద్రలే దితనికి శ్రీ రాము సుగుణధాముఁదోడి తె మ్మనె. సరస. ౬

దశరథాజ్ఞ సుమంత్రుఁడు జని-తగ రామవిభుఁ దోడి తెచ్చిన। శశివదను- డసితతనుఁ డగురఘు-సత్తముఁడు తండ్రికిఁ బ్రణమిల్లెను। బిసరుహాక్షుని గాఁగిలించుక-పృథివీశుఁ డేడ్వఁగ వసిష్ఠుఁడు। మనలకను వచ్చె రాముఁ డిదె-మన కైక భరతునకు రాజ్యము। అసదృశాటవికి నిన్నుఁ బనుప-నడిగి నాననఁ బితృవాక్యము। వినువక నడపెద ననె శేషగి-రిశిఖరాలయుఁడు విశాలమతియై ॥సరస ౭

౪. ఆనందభైరవిరాగము-అటతాళము.

పల్లవి.—వినవే పల్లవమృదుచరణా కరుణా-వితరణగుణాభరణా॥

అను.—జనవిభుఁ డానతి-చ్చినదండకాటవికి। ముని వేషధారినై, చనియెద నన విని, యనఘ రాఘవ కాముకుఁడ

నై యతివవలలను జిక్కితిని నిను। వనమునకు ననిచి ప్రాణ ము లీతనువునను మన వనెను భూపతి ॥విన॥

రామా జగదభిరామా సుబాహుని,రామా కులల। లామా హా హైమవతీచింత్య,నామ హా భీమోద్దామసం,గ్రామ హా శ్రీమహితముఖజిత,సోమా నిన్ను నేమని పొమ్మందు, నెటుల నోర్చియుందు। యీమోహాబ్ధికిఁ గట్టు ఏదని విలపింప, నామహీపతి నడలవల దని సౌమిత్రితోఁ దల్లినగరికి। స్వా మిచని నతి సుమిత్రాకౌ,సల్యలకు సేయ దీవించిరి ॥విన॥ ౧

అనువంద వనభూమి కరుగఁ గార్యము వచ్చె,నమ్మా సె లవిమ్మా యనిన। విని సొమ్మసిల్లి యాకొమ్మ హా, వనజా క్ష ననుఁ జేరరమ్మా రాజు। నినుఁ బొమ్మనుట నిజమ్మా నమ్మ। నన నగుచుఁ గైక, తననందనుని దొరనుగా। ననుఁ బదునాల్గేండ్లు, వనమున వసియింప। జనవిభుని వేఁడెఁ బితృ వాక్యము మనుపఁ జనియెద నన భరతునక, వనియొసఁగి తనయు నిచటనెనిలు,మనుచుఁ గౌసల్య విలపించెను॥ విన॥ ౨

కైక యెవ్వరు ధరణి, కాంతుఁ డెవ్వరు చూడు నాథాక పరా కాకైక నీకై కడఁగి దివిజా,నీకములు, డీకొనినఁ ద్రుం తుఁబో, నీక రాజ్యశ్రీకిని పట్టాభి,షేక మపుడు పాశకటము గఁ, జేతుభరతుఁ డల్గిన నతనిఁ, గేకయులఁ దుత్రిళ్లడఁ,గింతు నని లక్ష్మణుఁడు, వీఁకమైఁ బల్క రాముకు విని, నీకడిమి యును నీదుభక్తియు, లోకముల కెల్లఁ దెలియును వ,త్సా కైకపై నలుగవల దనె. విన. ౩

జడము నశ్వరము ఈ,జగము రాజ్యము తనువు, సత్య
మా యిది, నిత్యమా ఆస, పడ భోగఫల, మౌన్నత్యమా,
కలిమి, పడఁతి చంచల సుజన, స్తుత్యమా భ్రాంతి, యుడు
గకుండుట సత్కృత్యమా మాన,వుఁ డసుఖమునకు కర్మ,
మొసిగట్టితనకంటె,నోడలు వేటని తెలియ,నుడుగుఁగోర్కు
లుతృణతతి, నడియేటఁ గూడి యెడసినక్రియ, మాతృపితృ
సతీసుతహితాదుల, నడక యిదిస్వప్నసమ మనియె,న్నక
జనుఁడు కోరుననెరాముఁను. విన. ౪

ఆయు వల్పము జరావ్యాధులు పులులవలె, డాయఁ దెలి
యఁడాయ నరుఁడు, ఈయఖిలసుఖములు, . హేయ మనఁడు,
మాయురే భగవన్మాయ దేహ, మేయాత్మ యనుకుమతి,ఛా
యామాత్రి,మైయస్థిత్వజ్మాదోమ, జ్ఞాస్మృజ్మంసని, కాయ
మహా కాయ మెట్లాయె నాత్మ చెపుమా, యీ యాస వి
డువు మహామికబ్రిమ, హేతు విదియ యవిద్య నే నన, పా
యమగు సచ్చిదానంద,బ్రహ్మమనుటెదివిద్యయనెహరి.విన వే

మొదలు క్రోధము పాప,ములకు మనస్తాపమూలముఇం
ద్రిజాలముక్రోధము, సదయాత్ములకు ప్రతికూలము క్రోధ
ము, హృదయగ్రంథికినాలవాలము క్రోధము,విదితధర్మము
లకు, శూలము, మదియందది యుంచకను నిను నీ,వఖిలసా
క్షిగా నెంచి,ముదమున సుఖియింపుము ఈజ్ఞానము,మద యుతు
ల కీవలపలక్ష్మణ, మర్మమనితల్లి కీత త్త్వమె, సదయుఁడై
తెలుపఁగాఁగిటసుతుఁ,గదియించిపోయిరమ్మనెసతి. విన. ౬

హరి సుమిత్రికు మొ్రిక్కి యున్న లక్ష్మణ నిలువు,మ
న్నమనసు వెన్న, కరణేఁగరఁగఁబల్కె సీకన్న మును నేనరి
గెదను రానీ, కున్నఁ జిత్తుఁబర మేశ యనినఁగడుఁ జెన్నారం
గఁగరుణించియనుజు రాకకు సమ్మతించి యా,ధరణిజను జేరి
నే, దండకాటవి కేఁగి, తిరిగివచ్చెదనిలువు మననీ,చరణము
లయాన నేనిలువను, బరమాత్మయనిన శేషాచల,పతి య
తివతోఁ గూడి కదలెను. విన. ౭

౫. యదుకుల కాంభోజి-ఆదితాళము.

పల్లవి—చికురనిందితాళి రణకేళీ, జితమదాసురాళీ నిల
యాకృత, సకలభువనపాళీ లలనా, జనమాళీ కాళి. విన వే.
అని—సకలరాజన్యులు రా జను భా, నుకులరత్నము విభవ
మునుడిగి జ,నకసుతాలక్ష్మణసమేతుఁడై, వికసితాంబుజ
లోచనుఁడై చను,టకుఁ గత మేమని తండ్రియాజ్ఞ నడ,వికిఁ
బోవు టెఱిఁగి పురజనులు పొగుల,నకట వగవకుం డనుచు
వారితో, ననియె స్వామ దేవుఁ డన్మనీంద్రుఁడు. చికుర.

ఈరాముఁడు నారాయణ దేవుఁడు ఈశుఁ డవ్యయుఁడు
మహానుభావుఁడు, శౌరియోగమాయసీతయయ్యెను, కోరి
శేషుఁడే లక్ష్మణుఁడై యలరె జను, లారా బ్రహ్మవిష్ణురు
ద్రా, కారమైపూని గుణశ్రీ। మీఁజ జగదుదయస్థితిసం,హా
రములు చేయుఘనుఁడు హరి। ఈరాముఁడు మత్స్యకూర్మ
సూకర, నారసింహ వామన భృగురామశ। రీరములు దాల్చి
యిపుడు దశరథకుమారుఁ డయ్యె ఖలులఁ జంపుటకు ననె॥చి॥

రావణాదిదుర్జనులవధార్థము, రాముఁ డుద్భవిల్లుట యీ యర్థము। దేవముని దెలిసి పలుక నతనితోఁ, దెల్పె రేపువని కేఁగెదనని యితఁడు ధరణీవల్లభుఁడు కైక హరి నట,వీ వాసమున కనుపలేదితఁడే వారల నిటునియమించెను, దైవాధీనము సర్వజగము। గావున మీ రిందుకై యడలకుఁ డీవనజోదరుహృదయపద్మమున। భావించినఁ జింత లెడలు నని ముని, పలుకఁ బౌరు లలరిహరినుతించిరి ॥చికుర॥

ఆమీఁదట రాముఁడు కైకనగరి, కరిగి యడవి కేఁగ మాకు ముగ్గురికి। భూమిపతియాజ్ఞ కొను మనినఁ గైక, దీమసమున నిచ్చె నారచీరలు, అవి। సౌమిత్రియు రాముఁడు గటిరి, భూమిసుతచేఁ గాకున్నను స్వామి జనకజకటిఁ జుట్టెను, ఏమీ యనలేక నృపభార్య।లీమానవతి కీచీర తగ దని। యేడ్వఁగ వసిష్ఠుఁ డదరిపడి కైక। నీమది చెడ సీత కిది యొసఁగఁదగు,నేయని దుకూలము లవనిజ కొసఁగె ॥చికుర॥ ౩

రాజు సుమంత్రినిచేఁ గుమారులకు, రథము దెప్పింప నపుడె జనకునకు। శ్రీజాని సలక్ష్మణుఁడై మ్రొక్కెను, సీత యందఱికి మ్రొక్కి యరద మెక్కె హరి, జేజే లలరఁగఁ దే రెక్కెను, జేజే యని సుమిత్రకొమరుఁడు। రాజిలురథ మెక్కె సుమంత్రుఁడు రథ,రథ్యముల నడుప నిలు మని దశరథ। రాజు విలపింపఁదఱిమి నడచు జన, రాజితోడఁ దమస దాఁటె రాముఁడు ॥చికుర॥ ౪

పుడమిఱేఁ డవనిపైఁ బడి పుర,పురఁ బొక్కి పొరలియే

ద్వభృత్యు లధిపుని । నడరి కౌసల్యనగరికిఁ గొనిచని, రా
యువతివిభుని బోధించుచునుండె న । క్కడ రాముఁడు నిల్చి
జనులనిటు, విడరాదని పురికి రథముగొని । నడురాతిరి సు
మంత్రిఁ బొమ్మని, యుడురాజనిభాననయును నను । జుఁడుఁ
గూడి నడువ నపుడె కదలి చని, సుమహత్తరంగకలికఁలుష
భంగ । మద్భృజటాజూటసంగ గంగఁ గని మెచ్చుశౌరిఁ జేర
గుహుఁడు వచ్చెను॥ చికుర॥ ౫

చరణకమలయుగళికిఁ బ్రణమిల్లెడు, నెఱుకువాని రాముఁ
డనుధఁ జల్లెడు । గురుదయాదృష్టిఁ గని కౌఁగిట నిడు, కొన్నఁ
బాగడె గుహుఁడు భక్తి నచ్యుతుని । హరి ధరియించె జట
లు మునినైవనిఁ, జరియింతు ననుచు లక్ష్మణుఁడు । ధరియిం
చెను సత్యవ్రతుఁడని కురియించిరి విరులు సురలు శ్రీ । ధరుఁ
డు గంగనీటఁ గ్రుంకిజలములు ద్రావి తరుమూలమునఁ బవ్వ
ళించెఁ । దరుణితోడ నట రామచంద్రు నా,గరులు గానలే
క పురికిఁ బోయిరి॥ చికుర॥ ౬

మాయామానుషవేషధారి తృణ-శాయియై నిదురవో
వఁగ ధను । స్సాయకములు పూని కొలిచియుండెడు, సౌమి
త్రితో నిషాదవిభుఁడు పలికెఁ దృణ । శాయి శ్రీహరి నిటు
గని కను,దోయి సంతోషించుపన్న । దోయి ఈదుఃఖమునకుఁ
గై, కేయి హేతువు గదా యనెను । మాయికము సుఖాసు
ఖము నొడలు తమ, కేమెడ లేదని లక్ష్మణుఁడు శబర । నా
యకునకుఁ దెల్పగ నరుణోదయ, మాయె శేషగిరిపతియు

మేల్కొనెను ॥చికుర॥ ౭

౯. భూపాలము-ఆటతాళము.

పల్లవి.—సఖిమణి వినవే నీవీసచ్చరితము-సలలితానంద దాయకమన వే

అను.—సుఖాజడశుభసుషుప్తి దేరి, ముఖాబ్జకాంతి పొదలరఘుకుల। శిఖామణి గుహసీతానుజుల్, సేవింప స్నాతుఁడై సుప్రీతుఁడై। సల దఖండమగు నోడ నెక్కి యమునా, రాపగఁ గడచి గుహుని బిలిచి। సఖా పురికేఁ బొమ్మనుచుఁ బనిచె, సదయుఁడై ప్రియత్నపూర్వముగ ॥సఖి॥

మించిరాఘవులు మృగము నొకటివధించి పచనము మంచిగాఁ గా। వించి ముగురు భుజించి యచట వసించి మేల్ కాంచి, మరునాఁ। డంచితగతి ధరాత్మజ తాను, దంచద్భరద్వాజాశ్రమము, గాంచి మునికి తమ॥ వేంచేయు టెఱిఁగించఁగాఁ, బంచి హర్షించి రమ్మని శిష్యచే నృపపంచాననులు వచ్చుట దెలిసి, ప్రపంచదర్ఘ్యము, గొంచెదురు చని, చక్రినీక్షించి తనువు పుల, కించ నుతియించముని కనఘులు నమస్కరించ కౌఁగిలించి రాముని పూజించెను శ్రీరాముని స్మితముఖజితసోముని జగదభిరాముని॥సఖి॥

నాదబిందుకళాతీత జగదాదిపురుష మహాత్మ విను నీ। పాదరజమునఁ బ్రోదిసేయుము, నాదుమందిరము అనిన ముని।నాదరించి తదాశ్రమమున వినోదించి తదనుజ్ఞ సుజనా। హ్లాది వాల్మీక్యాశ్రమము శ్రుతి, నాదబంధురము గని।ముని

పాదములకానవని జానుజుల,తో(డవిలి ప్రణుతు(డై యలరు
మ।హా దేవుని సుమూత్రరుచిరుని, నబ్జదళనేత్రు రమాకళ
త్రుని శ్రిత।మేదినీసుతాలక్ష్మణులావాల్మీకి(గాంచి గారవిం
చి పా।ద్యాదివిధుల నర్చించి ఫలము లర్పించి భజించి హారి
పలికె॥సఖి॥ ౨

స్వామి విను వనభూమి దశరథ, భూమివిభుపంపున( జరిం
ప(గ।మేము వచ్చుటమీకు( దెలియని,దేమి యున్నది నేను
ఈమానవతి।తో మెల(గి యిచట శ్రమించనది, నేమింపు
మని రాము(డు పలుక। నామాని యఖిలార్థసంవేదియై ప్రే
మచే( బల్కె భువనములకు। రామ నీవే నిలయ మదినీకు ధా
మ మిది సాధారణమను త్తమమైన దే।వామహానుభావా విను
మేమహాత్ములతిశాంతులు సము లిచ్ఛాసూయావిరహితులు
నీ। శేముషిగలవారిమది నీకు శ్రీయుతముగ నిల నునికి య
నెను॥సఖి॥ ౩

శమదమదయాసత్యములుగల, సుమతు లెవ్వరు శుభాశు
భముల। సమయముల హర్ష విషాదముల, భ్రమయ రెవ్వరు
సుజనబృం। దముల( గూడి ధర్మాధర్మసమరసము వీడి మది
నిను శరణము వే(డి గర్వముడిగనాడి మమత గోరాడిమెవ।
రుమునులయి తనరారుదురు ఎవ రమితధృతి శ్రీరామ నీ
మంత్రము జపింతురు ద్వంద్వరహితు లయి,తజ్జనులస్వాం।
తము నిశాంతము నీకుష। డ్విమతషడూర్మి షడ్భావములకు
మీఱి యవల వెలు(గునిను దే।హముగ సర్వగతునిగ నొక

నిగ, నరయుజనులమది యిలు నీకనె ॥సఖి॥ ౪

అనవరతయోగా, భ్యాసబలమున దృఢీకృత। మనస్కు
లు నిను ప్రతినిమిషమును, గనుఁగొనుచు ననఘులయి మిం
చు। ఘనులహృద్వనజమున సీతాయుతుఁడవయి, మొనసివి
హరింపు మదియనీకు। ననువైనతావు నినువర్ణింపఁజాల, నం
చుఁబలికి। వనజాక్షి నీప్రభావముచే, ననువంద బ్రహ్మఋషి
నయితిని। జననమాత్రమే తాత్మపరుఁడను ని, పాదపురిఁ బె
రిఁగి విలుపట్ట నెఱిఁగి బో। యనెలత నొకతె నెనసి కొడుకు
లఁ, గనినే వారిఁ బ్రోవిజీవుల। మునుమిడియ మునివలెనె చం
పుచు, ముచ్చిలతేఁ డన నెగడితి ననె ॥సఖి॥ ౫

ఈగతిఁ జరియింప సప్తఋషు, లాగమవేత్త లరుగవార
ల। సాఁగి పోనీ కాఁగిన ననిరి, వేగ నీవరిగి నీసుతుల। నీగరితల
నునెమ్మిఁ బిలిచి, భోగఫలములపోల్కి దురితము భోగములు
గొమ్మని వారి నాగరికమెఱిఁగి రామా। తో గర్వమెందుకనఁ
జనినే, నాగరితనడుఁగ నాలుబిడ్డలు। మూఁగి యడచిన మొఱ
కునయి మరలి, యోగివరులను గని యిది దెలుప విని కడు।
రాగిలి యుపదేశ మిచ్చి వారవలఁ జనమ, రా మరా యని
వి। రాగినై జపించితిఁ బుట్టలు, ప్రబలె నాదుతనవుపై ననె
ముని ॥సఖి॥ ౬

అంతట బహుసహస్రాబ్దములు, పంతమునను దపంబు
సేయఁగ। దాంతులగు సప్తఋషులు వచ్చి, తనర ననుఁదెలు
ప భానుఁడు। మంతుమీఱఁ దమము నడఁచుక్రియ, వింతగా

వల్మీకము వెడలి। సంతసమునను సంయములఁ గని, సద్భక్తి నలుప ధీ। మంతుఁడవు బ్రహ్మఋషి వైతివి, వంత దీఱెను వాల్మీకి యని। యంతర్హితులై రింతయును శేషాద్రీశ నిను మది నుతియించు ఫలమిదియని। కొంతపొగడి సురనదికిఁ జిత్రి, కూటగిరికి నడుమ గృహము ముని। కాంతుఁడు రచింప సీతా,లక్ష్మణయుతుఁడై హరి యుండెనచట ॥సత్రి॥

౭. అసావేరిరాగము-ఆదితాళము.

పల్లవి.—హృద్వనజార్చిత రామా యా-శ్రితజనకల్పా రామా। సద్వచోభిరామా రామా వినవే॥

అను.—అద్వయముగ సుమంత్రుఁ డరదముఁ గొని, యయోధ్యకరిగి, దశరథున కెఱిఁగి ర। ఘూద్వహుఁడు జానకీ లక్ష్మణులను, గూడి గంగ కావలఁ జన నృపుఁడు। విద్వన్నుత రామచంద్ర సీతా,విభూ జగత్ప్రభూవిధాత నిను మహా వైభవానుభవయోగ్యు నడవి, నడల వ్రాసెనా యని యఱలెను ॥హృద్వ॥

పుడమిజనులు నిను దయగలవాఁ డని, పొగడ వైకల్యమేటికి। అడరి, నీదుకోరిక లన్నియు నేఁ, డకటా సాఫల్యమాయెను। వెడవెడ యేడ్వక యుడుగు మనుచును, క్ష్మీశునిఁ గౌసల్యదూఱిన। నిడుదగన్నుల నీరోడియునతని కా,నుడి యె హృదయశల్యమాయెను। పిడుగుబడినవాని కొఱవిఁ జూఁడిన, వడువున నేఁచెదు ప్రాణముల్నిలవు। పడఁతి వినుము పుత్రశోకమునఁ దనువు, వెడలునటుచు నొకముని తిట్టెఁ దొల్లి। కడఁక

నేను వని వేఁటలాడ ముని,కొడుకొకఁడు రేయి నది ఘటము ముంచ। బుడబుడమన గజ మని శరమేయ న,తఁడు హా యతి నని జనపతి ॥హృద్వ॥ ౧

డాయఁ జని యయో యని నే మునిపద,తోయజములు దడవి యోముని। నాయక నే నపరాధిని దశరథ, నరపతి నని నుడివి మ్రొక్కిన। సాయక వేదన కోర్వలేను నా,జన నీజనకు లడవి నోరలెద। రాయెడ కేఁగుము వైశ్యుఁడనగ శ,రమ్ముఁ బెరికినిడివిసేయక తోయముఁ గొని చని హాకుమా రకా, హాయజ్ఞదత్తాయని జీరువారి। కాయతమతి వలగొని యుదక మొసఁగి యయో,ధ్యావిభుఁడను దశరథుఁడ దంతి। నేయ మీతనయుఁ డీల్గె నన నీవు, మాయటులనె సుతునెడ సినపుడె చని।పోయెదవని గెడసిరని దెలిపి మృతుఁ, డాయె హారిహారీ యనుచు నృపుఁడు ॥హృద్వ॥ ౨

మోదుకొని యహో యని కౌస,ల్యాదిముదితలు విలపింప వసిష్ఠు। డాదయితల వారించి శవము, తైలముచేఁ గ్రాఁగింపఁ బంచటు। మీఁద భరతశత్రుఘ్నులఁ బిలువనం,పినత్వర దీపింపవా,రే। డోదినమే వచ్చి యయోధ్యఁ గని భయ,ఖేదములు జనింపఁ బురజను। లావరింపమియుఁ గని యిదేమో యని, యంతిపురి కేఁగి కైకకు మ్రొక్కిన మోద మొదవి సుతుఁ గౌఁగిలించి తన పుట్టినింటిసేమ మరసె భరతుఁడు। మేదినీశుఁ డేడని కైక నడుగ విని సీతారామలక్ష్మణుల నీ।

మీఁదిదయచే నడవి కనిచితిఁ, బతిమృతుఁ డాయె నా సాల
సె నతఁడు ॥హృద్వ॥ ౩

కొంతవడికి సేదదేఱి భరతుఁడు కోపదృష్టినిఁ జూచి కై
కా। శాంతమూర్తిని గృపాళుని శ్రీరామ,చంద్రు నడవిఁ
ద్రోచిభువిపతి। హంతవైతి వయయో నరకము, నందుఁ
బడెదవే ఛీ యనినే, నెంతపాపకర్మకు కొడు కైతి నిం,కేల
ననుచు లేచిపోయి। కాంతుఁబాసి వనరెడుకౌసల్యను, గాం
చి పాదములపైఁబడి యేడ్చినఁ జింత యేమీ నీవు కైకకరు
ణను, శ్రీమంతుఁడ వైతని జనని పలుకె। నింత కైకకృత్య
మే నెఱిఁగిన గుఱు,హింసఁ జేసినట్లనఁ గౌసల్యా। కాంత త
నయుఁ గౌఁగిట నిడికొని యా,క్రిందించె మహారవ మెసఁ
గఁగఁ ॥హృద్వ॥ ౪

అప్పుడు వసిష్ఠుఁడు వచ్చి భరతుతో, ననిరొ వగచు టే
లాదశరథుఁ। డపరమితసుఖము లనుభవించి దివి,కరిగె జ్ఞాన
శీలజీవుఁడు। చపలజన్మమృత్యురహితుఁ డమలుఁడు, శాశ్వ
తుఁడు త్రికాలాబాధ్యుఁడు। కపటశరీరము జడ మన్నృత
మిందు,కై విచార మేలామూఢుఁడు। అపవిత్రమైనసంసార
దుఃఖా,హతుఁడై బాంధవులు దెగిరనిపోగులు। నిపుణుఁడు జీ
వితము చిగురాకుకొన, నీరబిందువునుగాఁ దలఁచు ననుచుఁ।
గృపచే నెఱిఁగింప నృపునితను వ,గ్నిచే దహించి క్రియల్
చేసి సోద। రపురస్సరుఁడై భరతుఁడు శేషగిరి,పతి రాము
నిఁ జూడఁదలఁచె ॥హృద్వ॥, ౫

౯. మంగళకౌశికరాగము. -అట

పల్లవి.—ఎలమిచే సేవింపవే-శ్రీరాముని చెలిమిచే భావింపవే। యోలలనా॥

అను.—సలలితముగ రామ-చంద్రుని శ్రీపాద జలరుహ నిష్యంద-సద్భక్తమకరంద ॥మెలమి॥

భరతుఁ డామీఁదట - బంధుమిత్రమంత్రి। వరసేనాపరివృతుఁడై కోసల। పురికి హరిని దే।నుద్యుక్తుఁడై వసిష్ఠాది, గురుసజ్జనాన్వితుఁడై కదలి గంగా సరిదమలపులినాం-తరముల విడిసెనచ్చెరు వంది గుహుఁడు చె,చ్చెర శరశరాసన। ధరుఁడై యోధులతోడఁ, దఱిమి నడచి యితఁడు।పరమపావనుఁడేని సురనదిదాఁటింతు, హరికి వంచకుఁడేని యురుగనీనని వచ్చి। భరతు రామసేవానిరతు రాజ్యకాంక్షా, విరతుఁ గని మెచ్చి యర్పించెఁ గానుకలు మ్రొక్కి ॥ఎలమి॥ ౧

కూరిమి భరతుఁడు, గుహుని మహామహుని। సారెఁ గౌఁగిటనుంచి యచ్యుతచెంతఁ। జేరిన ట్టాత్మ నెంచి యెచ్చట నీవు, శౌరినిఁ బొడగాంచినా వని యతనిచే రాముఁడు విశ్రమించియున్నచో-టారసి తిలకించి మ్రొక్కి యచట।నా రాత్రియుండి మఱునాఁడుప్రొద్దున భా,గీరథి దాఁటి యరుదార భరద్వాజ। శ్రీరమ్య చరణరాజీవములు వలగొని, యారూఢిఁ దావచ్చు టంతయుఁ దెలిపి స।త్కారము లతనిచేఁ, గాంచినాఁడచట శ్రీ।మీఱ నిల్చి మునిచే దారిదెలిసి వేగ, శ్రీరాము లుండెడి చిత్రకూటముఁ జేరె ॥ఎల॥

బలముల భరతుఁడీ,మ్మ్రల నునిచి గుహశత్రు|ఘ్నులురా
నడచి తనమైఁ,బులకలు నిండఁ|దిలకించె మునిధనమ్మై,ఫలకు
సుమకు|ట్మలపాళికాఘనమై, శాఖిశాఖా|విలసద్ఘనాఘనమై
మయూరకో|కిలకీరసేవనమై, పావనమై శ్రీ| యలరునా వనము
పరిహసి,తనందన మచట హల| కులిశధ్వజనీలాబ్జ రే, ఖల
బాలు పొలుపొందు సీతారాములపాదముద్రిత| స్థలులు గని
హర్షాశ్రుజలము కనుల జాఱ, ఫలియించె నాదుకోర్కెలు
నే ధన్యుఁడనై | వెలసితి నని యెంచి వినుతించి హరియున్న|
నిలయము శుభలక్ష్మి, వలయుముఁ జూచెను ॥నెలమి| ౩
వెలిదమ్మితేకుల గెలుచుకన్నులవాని, వెడఁదయురము
వాని నల్లనివాని మొలకనవ్వులవాని సీతాలక్ష్మణులతోఁ
గ్రీడించువాని నారచీ|రల జటలఁ దనరువాని నీరేడుజగ,
ముల నేలినవాని రాముని జూచి| సలలితభయభక్తి,సంభ్రి
మాద్భుతముల| వలగొని తత్పాదనలినములపై హస్త|ము
లు చేర్చి సాష్టాంగముగ మ్రొక్కి కనుల నం|గుళము లొత్తు
చు మేలు, దలఁచు భరతుని కృపా| కలితదృష్టిఁ గాంచి కౌఁ
గిలించి తొడల నెలకొల్పె గుహశత్రు|ఘ్నులు నతు లొనర్పఁ
గ లలితుండు దీవించి వెల లేనిచను విచ్చె ॥నెలమి॥ ౪
స్వామి కౌసల్యాదిజననులు తా మ్రొక్కి, వసిష్ఠ మునిఁ
గాంచి పూజచేసి| భూమీశు నెచ్చరించి సేను మడుగ, నీ
మీఁదిమమత మించి దశరథుఁడు ని|న్నే మదిలో నుంచి
దివి కరిగెనన, వేమాఱు శోకించి గంగానదికి| రాము లం

దఱు వెంట రానరిగి స్నాతుఁడై । పేర్మిఁ దిలోదకక్రియలు దశరథునకు । సౌమిత్రియును దాను, సల్పి కృతకృత్యుఁడై । నేమమున నాదినము, నెఱవేర్చి మరలి నిజ। ధామముఁ జేరి స,త్ఫలము లందఱి కొసఁగి । శ్రీమీఱ మన్నించె శేషగిరి పరిభుఁడా-శ్రీమహిళావిభుఁ డీ,లీల వినోదించె ॥నెలమి॥ ౫

౯. జుజావంతిరాగము-ఆదితాళము-

పల్లవి,—వినవే దళదరవిందదళసుందర - విశాలలోచన నిజకింకర జనభయమోచన॥

అను.—మనుకులతిలక అయోధ్యకు రమ్ము క్ష,మాపతివై మమ్ముఁ బ్రోవుము । ఘనయాగములుఁ జేసి సుతులఁ గాంచి తనయుల రాజ్యము,న నునిచి పిమ్మట వనమున కేఁగుట రాజధర్మ మిటు, వలెఁ జేయుము, కైక దురితమతియై। యొనరించినయపరాధము క్షమింపు, మని భరతుఁ డన్న పాదములకు మ్రొక్కెను ॥వినవే॥

భరతుని రాముఁడు తొడపై నిడుకొని, సరఁగ బుజ్జగించి దశరథ। నరనాథుఁడు న న్నరణ్యమునఁ బదు,నాల్గేండ్లు వసించి మీఁదట । బురముఁ జేరు మనె నంతదనుక నిను, ధరణిఁ గా వఁగఁ బంచినాఁ డిది । యిరువురమును నెఱపవలె నన భరతుఁ, డిందిరేశుఁ గాంచి జనకుఁడు । కరటి కాముకుఁడు భ్రాంతుఁ డతనివా,క్య మనృత మన వత్సా దశరథుఁ । డరయ సత్యవాది యతని దూఱకు, మనిన సామి మునినై నే వనమునఁ జరియింతు నీవు ధర యేలు మనుఁడు, హరి య దే

టితగ వలంచన నేను నీచరణముల్ గొలిచి వత్తు ననిన
దా,శరథి వలదయోధ్యకుఁ బొమ్మనె దమ్ముని ॥విన వే॥ ౧

శ్రీయెల్ల నయోధ్య యెల్లఁ దనువు త్య,జింతు ననుచు
లేచి భరతుఁడు। ప్రాయోపవేశమునకై కుశభూ,శాయి యై
నఁ జూచిరాముఁడు। మాయురే యని కులగురుని కనుసైగ,
చేయనతం డేచి భరతుని। డాయఁబోయి నావాక్యమున తం
డ్రి, మాయలు పోఁద్రోచి విను నా। రాయణుఁ డచ్యుతుఁ
డీరాముఁడుఁ బ్రహ్మచేతఁ బార్థితుఁడై రఘుకుల। తోయ
ధిఁ బుట్టెను రావణాదులను, దునిమి వచ్చు నన నతఁ డద్భు
తముగ। శ్రీయుతునకు నతుఁడై పాదుక ల,ర్థించ రాముఁ
డొసఁగ మౌళి నిడికొని। తోయజాక్షు సమయాతీత మైన,
వే యనలముఁ జొచ్చువాఁడ ననె భరతుఁడు ॥విన వే॥ ౨

కైక సాశ్రుజలనయనయై శౌరిఁ, గని మంతనమందు రా
మా। నీ కపరాధముఁ జేసితి ఖలనై, నిందఁ బడితి నెందు
ననుదయ। చే కరుణింపుము నీమహామహిమ, శ్రీనివాస
ముందు ఎఱుఁగక గుణాకరుఁడ వగుణుఁడవు విష్ణుఁడ వ,
వ్యయుఁడవు నీయందు లోకా నీకముల్ నీదుమాయచే జనన,
నిలయవిలయములను జెందును। నీ కన్యము లేదు ఇంద్రజాలి
కు,ని తెఱఁగున మాయామనుజతనువు-చేకొని నటియింతు నీ
వు నీచే, లోకులు ప్రేరితులై చరింతురు దివౌకసకార్య ము
నర్చితి నీమా,యాకళా మోహితాత్మనై నేను ననె॥విన॥ ౩

పాహిపాహి దేవ దేవ నమోఽస్తు, పద్మనాభ సీతానా

యక। మోహా మనెడిముడి విడు మని జనని,పొగడ నత్రా
తావనుఁ డగు।శ్రీహరి చిఱునగవు దొలుకఁ బలికెను, చెలఁ
గి ధీసమేత నిజమే యు। దాహరించితివి నిర్జరకార్యార్థము
నే నీచేత నిటు ల।వ్యాహతముగ బలికించితి నీకు భ,వము
లేదెద నన్నుఁ దలఁపుము। ద్రోహస్నేహములు లే వితని
కనిదుష్టులు ననుఁ దెలియలే రనిన ఖగ।వాహనునకు మ్రొ
క్కి కైక పీడ్కొనె, వరసేనాయుతుఁడై భరతుఁడుచని।
మోహనముగ నందిగ్రామమున సు,బాహుకంఠలుంఠ నుని
దలఁచుచుండెను ॥విన వే॥ ౪

కుండలిశయానుఁ డిచట జనసం,కుల మని భూమిసుతా
లక్ష్మణు।నండదండలను నడువ దండకార,ణ్యముఁ జొచ్చి
శ్రితాశ్రితుఁడై। యుండెడియత్రిమునికి మ్రొక్కిన నతఁడొ
సఁగె నర్ఘ్యము జితాహితున క।ఖండభక్తి ననసూయకు జా
నకి,దండ మిడ నభిమతార్థసిద్ధి। దండిగ నగు నని దీవించి
యిచ్చెఁ, గుండలయుగ మనసీతనయకు మెండుగఁ జతుర్దశా
బ్దములకుఁ గా,శ్మీరచందనాద్యలంకారములు। నిండుమనం
బున నొసఁగె ననసూయ, నృపలలాముఁడగు రాముఁ డత్రి
ముని। మండలాఖండలునితోడఁ దత్త్వ,మహితగోష్ఠి నుండె
సమరసన్నుతుఁడై ॥విన వే॥ ౫

భాషాపతిసుతుఁడగు శ్రీరాముని, భయభక్తులు మీఱ,
జేరియ। శేషభువనములు సృజించి యవి, పోషించుటకు ను
దారాకృతులను। వేషధారివలెఁ బూనెదవు నీవు,రోషదూ

రా మాయా। యోషామణి యఖిలము భ్రమించునది, యె
ఱుగు నీకు వీరాధివీరా దోషాచరహర హరచాపదళన, పో
షితమునివసనా యని కడు।భూషించె లక్ష్మణుఁడు నాచే ని,
మ్మగఁ బలుకఁబడిన యీచరిత మాంధ్ర।భాష నధ్యాత్మ
రామాయణమునఁ, జరఁగ నయోధ్యాకాండము రచించె।
శేషాచలపతివేర నతనికృప,చే సుబ్రహ్మణ్యకవీంద్రుఁడు ము
దమున ॥విన వే॥ ౬

అయోధ్యాకాండము

సంపూర్ణము.

———

శ్రీరస్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు.

## అరణ్యకాండము.

### ౧. దేవగాంధారిరాగము-ఆదితాళము.

పల్లవి.—శ్రీశేషాచలవాసుని వినుతి । సేయ నెవరికి నైనఁ దరమా ఉమా॥

అను.—శ్రీశుఁ డత్రిమునిచే దా రెఱఁగి ది, నేశోదయకాలమునఁ గదల సీ। తాసుమిత్రాసుతులతో మద వే,దండపుండరీకానీకచమ। రీశశ వరాహమహిష శరభకపి, వృకాదిమృగభయదమై ఖగకులా। వాసమై ప్రచండమా దండకా,వనము జొచ్చి యనుజునితో ననియెను. ॥శ్రీశేషా॥

మనుజాశనకంటకావృతంబీ, వనము మన మతిప్రయత్నముగఁ జోఁ। జనుననుచు ఖేటకము ల్గొనుచు, జనకజ ముందఱ వెనుక రామల। క్ష్మణు లిరువురు చని కనిరి యసురనా,ధుని మానిఖగవ్యాధుని విరాధుని ఘనశూలము దిప్పుచు వాఁడు వచ్చి, కట్టలుకఁ మీా రెవ రని యడిగిన। విను రాఘువులము దశరథవిభుపను,పున సుజనులఁ బ్రోవ ఖలులజీవధనము గొనవచ్చితి మన బ్రితికెడి, తలంపు గలిగిన లలన

నొసఁగి, చనుఁడని కదియ మహాసిచే రాముఁ, డాదనుజుకర
చరణశిరములు వరుస నరికె॥శ్రీ శేషా॥ ౧

శ్రీరాముని గాఁగిటఁ జేర్చె సీత, చెలఁగె దుందుభిరవము
విరులు గురిసెఁ దోరముగాఁ గడు శృంగారముగా। సారెకు
నచ్చరలాడిరి పాడిరి। చేరి కిన్నరు ల్విరాధుఁ జంపుట,చే
రాజిలి రరికరిహరి యైనహరిఁ। జారుభూషణద్యుతి ససమధృ
తి ను,దార శుభాకృతిఁ। దారాపథమధ్యగుఁ డగుకవిగతిఁ
దనరిన చక్రిధరుని శౌరుని గని। కోరిక దీఱ వినమ్రుఁడై
మ్రొక్కి, గుణాఢ్య విద్యాధరుఁడ దుర్వాస। భూరిశాపమున
నసుర నైతి నిదె, ముక్తి నీవలన నగు టనె విరాధుఁడు॥శ్రీ॥

భవరోగవైద్య దయాకర నమో, ధవళాంబుజాక్ష ని
నుఁ దలఁచుచుఁ గనుచు వినుచు నుడువుచు నంటుచును, న
విరళముగ మ్రొక్కుచు నుండఁగఁ, జే। యవలె నామనో
నేత్రశ్రోత్రజి,హ్వాకరశిరములు రామ తారకనామ।భవనుత
యని పలుక హరి, నగుచు నాభక్తిదుర్లభం బది నీకు గ
ల్గెఁ। బవిమలసుజ్ఞాని వైతి వన విని, ప్రకటసుగుణభద్రా
రామభద్రా। యెవరు నీకు సము లధికు లటంచు, నిజేచ్ఛ
నరిగె విద్యాధరుఁ డంతట। రవికులమౌళిఁ జేరె శరభం
గా,శ్రమ మమ్ముని గనె సీతానుజుఁడగు॥శ్రీ॥ ౩

చూచి యెదుర్కొని పాద్య మొసఁగి య,చ్యుతు సుఖా
సీనుఁ జేసి పూజించి, నీచమతు ల్ఘనసంసారరతుల్ , ఓచిత్త
జజనక నినుఁ దెలియలే, రురుతరమగు నీకటాక్షమున నినుఁ,

జూచితి వేచిన యఘములఁ బోఁద్రోచితి న, హో చిత్ర
మనుచుఁ, బలికి శరభంగ, యోగి దారువుల్ ప్రోవిడి యన
లము, చే చితి దరికొల్పి యం దుటికెనే,తాచంపకగంధియు
తు హృద్గ్రంథి, మోచను విశాలలోచను మానసమునం దు
నిచి ముక్తతనుఁ డయ్యెఁ దటి, వేచి దండకావాసు లైనము
ను, లాచతుర్భుజునిఁ జేరగఁజని పాడగనిరి॥శ్రీ॥ ౪

మ్రొక్కె రఘూత్తముఁడు మునులారా సుఖ,ము గదా
మీ కనిన।రక్కసులచేఁ జిక్కితిమి బాధల,స్రుక్కితిమి గ్రక్కు
న మముఁ బ్రోవు మనుచు రాముని।కక్కడనున్న కపాలము
ల్ చూపి, వెక్కసమున వృద్ధజనుల మునులఁ। జక్కఁ
జేసి రింతయు దైత్యకృతమే-శరణు మా మొఱాలింపు మనిన
విని।యుక్కడంతు దానవుల నని యభయ, మొసఁగె మునుల
కెల్ల మది రంజిల్ల।మక్కువతో భరతాగ్రజుఁడు నిలిచె-మౌని
గృహములందుఁ గొన్నేం డ్లచట। నక్కఱతోఁ జని కనియె
సుతీక్ష్ణుఁ, డనుమునీంద్రునిఁ బరబ్రహ్మమూర్తియగు॥శ్రీ॥ ౫

౨. మంగళకౌశిక రాగము-ఆదితాళము.

పల్లవి.—వీనులవిందుగ విన-వే యీచరిత విఖ్యగను॥

అను.—శ్రీనివాసుని బూజించి సుతీక్ష్ణుఁడు స-మ్మాన
ముగాంచి సానందుఁడై పలికెను॥వీను॥

రామ నీతారక-నామమంత్రజపము।నేమమునఁ జేసితి, నీ
రజాక్ష।శ్రీమహిళాధీశ-శివవిరించిసేవ్య। కామసంసారసా-గర
తరణచరణా యనె॥వీను॥ ౧

సతీసుతాదిఘోరసం-సారాంధకూపపతితుఁడనై, పాప
మతినైగతి గానవినను, గన నిర్హేతుకదయామతివై నీవే
వచ్చితి వనెను సంయమి॥వీను॥ ౨
సకలభూతమాన, సాలయుఁడ వైనను బ్రికటించి నిన్ను
జపమ్ముసేయని । వికలుల మాయా-వివశులఁగఁ జేతు । వకట
నిను భజియించ-నఘముఁ బాపుదు వనెను॥వీనుల॥ ౩
విశ్వసృష్టిస్థితి, విలయములకజహరి।విశ్వేశరూపముల, వె
ల యుదీవు హరి।వశ్వఁ డనేకపాత్రిములఁ గనఁబడుభంగి। శా
శ్వతుఁడ విది మూఢ, జను లెఱుఁగ రనెఁ దపసి॥వీను॥ ౪
పరమేశ ప్రకృతికిఁ-బరుఁడవౌ నీదివ్య । చరణము ల్గంటి
దృ-క్స్వాంతములకు గో । చరుఁడవు గా వైన, హరి నీనామ
స్మరణ।పరమతుల కెపుడు గను, పట్టుదు వనె మౌని॥వీను॥ ౫
రూపాద్యుపాధిదూ- రుఁడవై నమాయానట । నాపాదిత
మౌ నీమా, నవరూపము ఇది।గోపాడగంటిస్మర, కోటిసుందర
ము శర।చాపాన్వితము కరుణా,శ్రయనేత్రయనెను ముని॥వీను॥
స్మితలలితాస్యముసీతా,యుత మజినాంబర ము।జితము సౌ
మిత్రిసే,వితపాదము స।ప్రతిమ మసితోత్పలా,భము మద్భాగ
ధేయ।మతిశాంత మగునీశు,భాంగము గంటి వనె॥వీనుల॥ ౭
దేశకాలకర్మా, తీతవిజ్ఞాన ముఖ।లేశ నీరూప మతి, హిత
మమలము।నాశరహితము స్వప్రి,కాశము నిఖిలావ । కాశము
-చిద్ఘనా,కాశ మని పొగడె ముని॥వీనుల॥ ౮
ఈరూపు భావించి, యిఁక నొకటి నామనసు।కోరలేదనిన

మునితో రాముఁడు చె।న్నారఁగఁ బల్కె మునినాథ నీమ
ది మత్స।మారాధనమున నిర్మలమౌ తెలియుఁగుదు వనె॥నీ॥
మీవంటిభక్తులఁ-బ్రోవ వచ్చితి నన్ను।భావించి వినుతిం
చి, సేవించి మా।కీవే గతి యనువారి, కెప్పుడుఁ జూపట్టుదుఁ।
గోవిదుఁడ నీవు ముక్తుఁడ వైతి వనెఁ జక్రి॥నీను॥ ౧౦
ఈపావనస్తోత్ర, మెవరు పఠించినఁ । దాపత్రయమ్మున-
బాపుదురు। దీపించి మద్భక్తి, దృఢమౌసుజ్ఞానము । ప్రాపిం
తురు పరమపద మనెను రాఘవుఁడు॥నీను॥ ౧౧
మన మగస్త్యుని జూడఁ,జనవలె నని సుతీ।క్ష్ణయుతుఁడై
సీతాలక్ష్మణులతోడఁ।జని యగస్త్యానుజుని,గని యవల శేష
శై।లనివాసుఁ డగస్త్యాశ్రమముఁ జేరి వినుతించె॥నీను॥ ౧౨

౩. నవరోజురాగము-ఆదితాళము.

పల్లవి.—వినవే తరుణీమణి శ్రీరాముని।వినుతగుణస్తోము
నిసుచరిత్రము॥

అను.—ఘనమై షడృతుఫలసుమశో।భనమై, రాజితబ
హువిహగ।స్వనమై జితనందనమై మునిధనమై, సరసుర
మనోనురంజనమై, తగునగస్త్యునితపో।వన మినకుల
మణి, గని మెచ్చి సుతీక్ష్ణ నీగురునకు, మారాక
దెలుపు మనె॥విన॥

స్వామి మహాప్రసాద మని సుతీక్ష్ణుఁ డగస్త్యుని డా
యఁ జని మ్రొక్కి య।హో మహాత్మ సీతాలక్ష్మణులతో,
రాముఁ డిటకు వచ్చినాఁ డనిన మౌని।యామాట విని హె

చ్చి యెదు రేఁగి హరికి, శ్రీ మిూఱ నర్ఘ్య మిచ్చి, తోడి తెచ్చి।
రామా యంబుజహితకులాబ్ధిసోమా, నీలవారివాహస్తోమ।
శ్యామా, శ్రీరామాహృద, యాభిరామ సంగర।భీమా పాల
కడలికడ నజు, చే మును ప్రార్థితుఁడవై దశరథుని-నోము
పంటవై పుట్టితి వని నుతించె॥విన॥ ౧

సకలభువనసృష్టికిఁ బూర్వమునం-దొకఁడవై నిరుపాధికుఁడ
వై యే।వికల్పము లేక యున్న నినుఁ జెంది మూ౹,ప్రకృతియై
న నీమాయ యవ్యాకృత మనఁగఁ బ్రకటమై సృజన సేయ మ
హత్తత్త్వమున।,నొకటి గల్గె మునిగేయ, దాని కహంకృతినా
మకమై, యొకటి జనించె గుణా।త్మకమై, యహంకారమునక
ర్భక మయ్యెను దానివలన నేకమై, తన్మాత్రభూతేంద్రియా।త్మ
కమయ్యె నన్నిఁటికి సూత్రా।త్మక మగులింగ మొకవెనందు
విరా।ట్టు కలిగె జగములతఁ,ను సృజించె ననె ముని॥విన॥ ౨

నీవు రజస్సత్త్వతమోగుణముల, నేర్పునను గొని బ్రహ్మవిష్ణు
మహే।దేవరూపములఁ గ్రీడింపుచు జగదుదయ,స్థితిలయముల
ను చేయుచుందువు మాయాగుణభేద।భావాభావముల నొంద
వు, అవస్థాత్రియములఁ।గేవలుఁడవై కనుఁగొందువు సా,క్షివి
చిన్మయుఁడవు।దేవాధిదేవ యోమహానుభావా యెపుడు సృ
ష్టిలీలకుఁగా వాంఛింతు వపుడు మాయను, నీవంగీకరించి గు
ణవంతుని।కేవ నుందు వామాయ వి,ద్యావిద్యలు రెండై ఈ
వరువిద్య యమృతకర మవిద్య మృతకర మనెను ముని॥విన॥ ౩

విను మవిద్య నొందిన ఖలు లగుదురు, విద్య నెనయ నకు

రులాడు రదినీపా।దనలినభక్తిచేఁ గాని దొరకనేరదు, గనుక నీసేవఁ బూని చేసినయతఁడె।ఘనుఁడు కమలాజానిపాదసేవకు మొనయనివాఁ డజ్ఞాని స్వప్నమునందైనను, కనరా, దతనికి ముక్తిమార్గ।మనరా, బుధులు వేయు నేటికి।దనరా, రును మోక్షము బుధ।జనరా, జితోక్ష సంగతి ననిముని। లనరా జనగర్వమోహమద।గుణరహితులు శమదమరతులు సర్వ,జనహితులు భగవద్భక్తిరతు లనేఁ దపసి॥విన॥ ౪

ఏయుపాయమున నైన నీయందుఁ - దోయజాక్ష నాకుఁ బ్రపత్తి గలుగఁ।జేయుము నిరతము నీదర్శనము సఫలమై-చెలఁగె నాజన్మము నేఁడు నాక్రతువు లెల్ల।శ్రీయుక్తము లాయెఁ జూడు నాఁటనుండి నేఁ।జేయుతపమునకు నేఁడు నీపాదార్చనమగు-దోయి సీతతోడ నీ వహిం।శాయి,నామది నిల్వుమెందుఁ, బోయి, నావు నను ని।ర్మాయి,స్మృతి గలుగఁజేయు సతసుఖ,దాయి యనుచుఁ బొగడి యతుఁడు।సాయకతూణీరచాపకృపాణ, సాధనము లగస్త్యుఁడు రాఘవున కొసఁగె॥విన॥ ౫

మేదినీభారహరణార్థము,యీ మేను పూనినా,వుగావున రావణాదులఁ జంపు పొమ్ము పంచవటి-గౌతమీనదిచెంతఁ దనరారు రెండు యోజనముల।మీఁద నది చెలువుమీఱు నట కొన్నినాళ్లు వినోదింపు ముదముచేకూఱుఁ గమలాకాంతా,వి।నోదిగర్వితదనుజచయవిభేదీ యోగిజ నానందా।పాదీ నిరతము జగ,దాదీ సత్యవాదీ యఖేదమణీ।వేదియనిపల్కుకుంభభవు, పాదములకునతుఁడై శేషశైలవాసుఁడవలఁజనెనవనిజానుజులతో।

౮. దేశీయదేవగాంధారిరాగము-అటతాళము.

పల్లవి.—చానరో వినవే శ్రీరామ, చంద్రుని చరితము రస భరితము॥

అను.—శ్రీనివాసుఁడు త్రోవఁ బోవుచోఁ బర్వతశ,రీరుని జటాయువుని గని సౌమిత్రితోఁ బలికెను॥చాన॥

విలు దే లక్ష్మణా వీనిఁ బొలియింతు వీఁడసుర। వలె నున్నాఁ డనిన నామాట,విని ఖగరాజు।అలుకుచు నిచ్చో,ట రామా నీవు శ్రీరామా నీ పిట్లలుగకు భవత్పితృసఖుఁడను జ,టాయువనువాఁడ నాపై దయఁ।జిలుక వే యనుచుఁ గౌఁగిట నలమి యతనికి హరి సెల వొసఁగె॥చాన॥ ౧

భానువంశమౌళి, పంచవటీగౌత, మీనదీతటమునందుఁ జేర నచ్చట రా।మానుజుఁ డనువొం,దుపర్ణశాలలు. ఆపర్ణశాలలు। పూని రెండు రచించె నొకశుభ,మైనలగ్నమున సీతాయుతుఁడై నరేంద్రుఁ డచట నిలిచి, యలరుచును గడపె మూఁడు నెలలు॥చాన॥

కందమూలములు ల,క్ష్మణుఁడు దెచ్చి యన్న।ముందర నిడి చరణముల్ గొల్చుచు రాత్రు।లం దెల్ల జాగరణ,ము లేసేయుచు, నుజేయుచు వి।ల్లంది శరములు పూని సేవ, నందుఁడై యుండి యొకతఱిఁ గని। మందహాసవదనార,విందుఁడగు రాఘవున కనియెను॥చాన॥ ౩

మోక్షకారణమా, మొదలితత్త్వమంబు। జాక్షనీవలన నే,ను దెలియఁగోరితి।రక్షింపు నీకన్న రక్షకులు, లే రరయ లే।

రతుయజ్ఞానవిజ్ఞానవి,రాగయుత మని దాని దెల్పు । మోక్ష
ణంబ యన ననుజున కిట్లనెను దాశరథి ధీనిధి॥చాన॥ ౪

విను మాయాస్వరూపము వివరించి, వెనుక సంవిద్రూపుఁ
దెలిపెదను । అనాత్మయైన యీతనువె, యాత్మగా నెదను
దోఁచునే మాయ, తోఁచునే మాయ । అనఘ దానివలన
సంసారమా, యావిక్షేపావరణము । ననెడి యీరెం డామా
య కాకృతు లనె రాముఁ డనువుగ॥చాన॥ ౫

పరఁగ జగము లింగాద్యబ్రహ్మాండముగ విక్షేపము సృ
జించె మించి యా, వరణము పరమాత్మ నావరించి జ్ఞాన
రూపమై, జ్ఞానరూపమై, బెరసెఁ దా్రి డహి యని భ్రమసిన,
ట్లురుమాయచే నైన జగములు పరతత్త్వమునఁ గల వను
టరయ నవిచారమనె రాముఁడు ॥చాన॥ ౬

కలలోఁ గన్నవస్తువుల,వలెనె సత్తుగా దఖిల,ములు మ
హేంద్రజాలము సంసారమను, బలుచెట్టునకు మూలము దే
హ మేనని, దెలిపి తన్మాత్రభూతహృదింద్రియాహంకారబు
ద్ధిప్రకృతులు నహంతయును తను వనఁ, జెలఁగు నన్నిటి
కాత్మ సాక్షి యనె ॥చాన॥ ౭

జ్ఞానమునకు నహంకార,మానడంభజయ మలుక, మా
నుట ఋజుభావము సేవించి భక్తి,చే నిజగురుని దైవముగాఁ
గ నెన్నుట, గాఁగ నెన్నుట, మేనిదోసము; లెఱుఁగుట తను
మ,నోనిగ్రహము ఈషణవిరతిఁ, బూని నాయం దనన్యం,
శై సమమతయును సాధనము లనెఁ ॥చాన॥ ౮

ఆస లన్నిటిని జ్ఞానాసిచేఁ దునిమి సచ్చిదానందచైతన్య
ము తా నని తెలిసి, భాసిలు టె సౌజన్యము, వాఁడె ధన్యుఁ
డు, డాసి యనుభవము గురుశాస్త్రాభ్యాసమునఁ గని జీవప
రులవి,లాసవై ఖరులఁ గూర్పఁ దొలంగు మాయ యిదె ము
క్తి యనెఁ ॥చాన॥ ౯

మచ్చరణస్మృతి లేని,మనుజు లిది చెందలే, రచ్చపుతమ
ములో, నజ్యోతిలేక కన,వచ్చునే యేరికైనఁ గావున నన్నుఁ,
గావునన, న్నిచ్చఁ దలఁచువారలకు ని,మ్మావిద్య యొదల
కేవల దని, హెచ్చుగాఁ దెలిపె శేషగి, రీశుఁ డనుజునకు
ముద మొదవఁగఁ ॥చాన॥ ౧౦

౫. అఠాణరాగము-ఆదితాళము.

పల్లవి.—వినఁగదవే మన, వేదండగమన। మనసార సా
రసనేత్రు చరిత్రము॥

అను.—మనుజాశని కా,మరూపిణియై శూర్పణఖ యు
నెను మా, నిని వచ్చి యపుడు, గనుఁగొనె రఘువ,రునిజ
గద్గురుని॥విన॥

ఆదరహాస మామహోల్లాస।మాపరస్మేరకటాక్షవిలాస।
మాదరదళితాబ్జాస్యవికాస, మాయిందిరాసఖసుఖనివాస,
మై దనర్చునురము సుందర, మై యలరు నుదరము ఆనతజ
న, ఖేదముల నడఁచి మోదముల నొసఁగఁ, గాఁదగుచరణ
పల్లవములు అ, మీఁదట నఖసౌష్ఠవములజిగిఁ, బ్రోదియిడు
తొడలచందము రాముని - పాదపద్మములయందము గని,

యీ దానవి మదనాశుగములచే, నదరి చెదరి దనుజారితోఁ
బలికె॥విన॥ ౧

ఎవ్వరు మీరు ఏమి మీపేరు, లివ్వని కిట్టేల యేతెంచి
నారు, ఎవ్వరికుమారు లీచెలువారుజవ్వని యెవ్వతె, నిన్ను
వేమాఱుఁ, బువ్వువిల్తుకేళిఁ గలయఁగఁ బూనినాను బాళి
నన్నేలుము, నవ్వుగా దనఘ నాపేరు శూర్ప, ణఖ యంద్రు
రావణునకుఁ జెల్లెల, నివ్వార్త కతఁడు ముదముచేఁ గడు-ని
వ్వటిల్లు ఖరదూషణాదులు నిన్నుఁగొల్తు రరిభీషణా యనిన,
నవ్వుచు సీత వినఁగ రాముఁ డనియె, నవ్వనితకు భయహి
తవు లొదవఁగాను ॥విన॥ ౨

మనుకులు డను రా,మాభిధానుఁడను, విను దశరథవిభు
తనయుఁడ నతఁ డను, ప నిట వచ్చితి మవనుజుఁ డిదిగోఁ
గనుఁ,గొను మీసతి నే, ననలసాక్షిగాను ఘనతఁ బెండ్లియా
డినాను, గనుకదీనితోఁ,డియాపోటికి, మొనపి నీవు నోఁ,పుదు
నె సౌమిత్రి, నెనయు మనినఁ, జని వేఁడిన నతఁ, డనియె
లలన,ననుఁ గూడిన నీ,వును దాసి వవుట నిజ, మన రాము
ని, యొద్దికేఁగి యది ఘనాక్ష్మతిఁ, గనలి సీతపైఁ జన లక్ష్మ
ణుఁ డసి గొని ముక్కుఁజెవులఁ, గోసె రక్కసికి॥విన॥ ౩

అఱచుచుఁ బాఱి, యది ఖరునిఁ జేరి, మొర వెట్ట సు
రారి భూరిరణభేరి, పరఁగఁ గదలి, శూర్పణఖచే దారి, నె
ఱిఁగి బలములరి, ముఱి నడచె మీఱి, పరులు వచ్చుట గని
యనుజుని, ధరణిజను దోడ్కొని, యగ్గిరిగుహ, కరుగఁ బని

చి రాఘవుఁడు ధనుశ్శర, వరకరుఁడై బలువీరులఁ దార్కొ-
నె, ఖరదూషణత్రి, శిరులు దాఁకిరి, హరిపైఁ జనుసేనఁగు
లు నా, హరిమెఱయు సేన, నొకబగలునఁ దెగ, నతికి నా
రాయ, శాస్త్రమున రాముఁ డరుల దొరలతలల, దొరల నే
సె నవనిపై ॥విన॥ ౪

తమ్ముఁడు వచ్చి సీతను దోడి తెచ్చి, యమ్మెయి నన్న
హా, హాసము మెచ్చి, నెమ్మి నుండెను సు, ఖమ్మున హెచ్చి
యమ్మదిరక్కసి, యట లంకఁ జొచ్చి,పమ్మి రావణుచరణ
మ్ములఁబడి, వగవ నతఁడు కరుణఁ దెలియలేఁ గాఁగిటఁ,
గ్రమ్మి యిదేమన రామలక్ష్మణులు, కాంతారసీమ మెలఁగ
రామునికలికి చెలు వలరి చెలఁగ నీ, కిమ్మన నన్నిటు చేసి
రి నీ,తమ్ము లిందుకై పొలసిరి యనిన, కొమ్మనూరార్చి
ర,క్షోవిభుఁడు రాముని నిమ్మహి శేషగిరీశునిగాఁ దలచె॥వి॥

౭. ఫరజురాగము-అటతాళము.

పల్లవి.—ఇంతి చెంగల్వ,బంతి చెఱువలమేల్, బంతి గు
ణముల, దొంతి విన వే॥

అను.— శ్రీకాంతుఁడు గా కున్న ఖరదూషణాదుల నా,
వంతలోనఁ జంప, నెంతవారు నరు లని చింతించి దశకంఠుఁ
డసురుల, శిక్షింపఁ జక్రి యినకులమున, మంతు కెక్క జనిం
చె శ్రీరా, మాఖ్య బ్రహ్మాదినుతుఁడై యనె ॥నింతి॥

ఐనఁ గానిమ్ము శ్రీ, హరిచేతఁ బొలిసితే-మానుగ వై
కుంఠ,మందిర మేలుదు, నే నతని గెలిచితి,నేని రాక్షసరా

జ్య- మీానేల గలదనుక నేలుదు నని తలఁచి, భానునిభ మ
గురథమెక్కి-విధి- పూని ప్రేరేపమున్మతివై, రాను గతహృద
యుఁడై చనియెను రావణుఁడు మారీచునింటికి ॥నిం॥ ౧

వచ్చినదనుజేశుఁ, జెచ్చెరఁ బూజించి, వచ్చినపని దెలు
ప, వలె, నన్న మారీచు, మచ్చికఁ జేసి రావణుఁడు వలికె
రాముఁడు, హెచ్చి కానకు దశర,థేశుఁడు పంపఁగ వచ్చి
మునులకు నెల్ల నభయం బిచ్చి మనఖరదూషణాదుల, వ్ర
చ్చినాడఁట రాముని సతిని, దెచ్చి యేలుదు నన నతఁ
డనియె ॥నిం॥ ౨

రాముఁడు నరుఁ డని రావణ తలచెదవు, శ్రీమహావిష్ణు
వు, సీత మహాలక్ష్మి, యీామేను పూనినాఁ డిచట నినుఁ
బొరిగొన నామహాత్ముని జెనకు, టదియే మృత్యువు విను
వి, శ్వామిత్రు క్రతువున సుబాహుని, జంపి రఘుపతి నన్ను
శరమున, నీమహోదధి వైచె బ్రతికితి, నేమిసుకృతముకత
ననో యనె ॥నిం॥ ౩

హరి నన్నుఁ బొలియింప, నవతరించినట్లయితె, వెఱచి
తే చంపక, విడుచునా లేలెమ్ము, మెఱసి నీవు మాయా,
మృగమై రాఘవుల న,త్వరముగ భ్రమియింపు, ధరణిజ నేఁ
దెత్తు, మఱుమాట లాడ నినుఁ జంపుదు మారీచ యని
రావణుండన, వెఱచి హరిచేఁ దెగిన మోక్షము, వీనిచేఁ
బడ నే లని కదలె ॥నిం॥ ౪

పదియాఱువన్నియ, బంగారువలెఁ దనువు, పాదల మే

నిపై వెండి, పువ్వులవలెఁ జుక్కలు, గుదిగొన మణిరుచులఁ,
గొమరారుకొమ్ములు, కొదమరత్నము లనఁగా, గొరిసెలు
దనరఁగ, నుదుట నీలములవలెఁ గన్గవ, యొప్ప మారీచుండు
లేడియై, కదలి శేషగిరీశుఁ డగురా, ఘువు, డున్నపంచవటిఁ
జేరెను. ఇంతి. ౫

౭. నాయకిరాగము-ఆదితాళము.

పల్లవి.—దీనభక్తజనసౌఖ్యదాయుకి, ప్రాణనాయకి వినవే.

అను.—భానుకులుఁడు ఏకాంతమున సీత,తో నిటు లనె రా
వణాసురుఁడిదె నినుఁ గొని,పో నరుగుదెంచె నీ వంతర్హి
త,వై నీదగుఛాయామాత్రము నిలు,మీ నను వర్ణాంత
ముసందుఁ బొందఁ, గా నీకగు నన నట్ల నిల్చె సతి. దీన.

చెలఁగుకపటమృగముఁ జూచి మాయా,సీత దీనిఁ గొనితె
మ్మనిన శౌరి, విలు నమ్ములుఁ గొని చనుచు జానకిని,గొలిచి
యుండు సౌమిత్రి నే నీలేడి, సలలితము మీఁజుఁ దెత్తు ననిన
ల,క్ష్మణుఁ డిది మారీచుండు చేయుపొ,కలు వల దీకార్యముఁ
బూనఁగా న,గారిస్తుత యన నిల్వ కేఁగె హరి. దీన. ౧

సర్వపూర్ణుఁ డయ్యు నచలుఁ డయ్యును-సాక్షి యయ్యు
లోకానుసారియై, పర్విడి మాయామృగమువెంటఁ దగిలె-భ
క్తపోషణుం డనెడినుడి విదితముగా,సుర్వీతనూజకోరిక దీర్పఁ
గ-నుద్దండాటవి రఘువీరుఁడు చని, దుర్వారామర్షణుఁడై
మృగంబు-నుర్విం బడ నేసె నిశితాస్త్రమున. దీన. ౨

త్రుళ్లడంగి కపటరూపు చెడిమారీచుఁ డొరలుచో హా

లక్ష్మణా, చెల్ల రే ననుఁ బ్రోవు మని చక్రి-చీరినటులు దోఁ
చ నా ర్తరవమున నిలపైఁ, ద్రెళ్లుచు మహీశుసన్నిధిచే ము-
క్తిం జెందె నచట నా ర్తధ్వని విని, తల్లడపడి భూమిజ రాముఁ
డాప-దం బొందెను జను లక్ష్మణా యనెను. దీన. 3

మూఁడుజగము లనికిఁ దొడరినను రా-ముఁడు భయార్తుఁ
డౌనె చెలియ తెలియక, యాడితి వనుమఱఁదిని నతివ సుజ
నుఁ-లాడ రానిమాట లాడనాతఁ డని వినఁ, గూడక హరియ
నుచు నన్నుచనిన-జాడం జన రావణుఁ డిష్టము చే,కూడె న
నుచుఁ జేరెను మానినియై ని-గూఢాత్మాకృతియై ధరాసుతను.

పూజఁ జేసి సీత వలికెను మహా-పురుష నిలుము మత్పతి
వచ్చుదనుక, నాజనకజఁ గని మీ రెవరు దెలుపు-నాతి యని
న నయోధ్యాధిపతి యగుదశరథ,రాజుకోడలను రామునిభా
ర్యను-లక్ష్మణుఁ డనుతమ్ముఁడు దానును వని, రాజీవాక్షుఁడు
పదునాలుగువత్స-రంబుల్ నిల జనకాజ్ఞ వచ్చె ననె. దీన. ౪

నిన్ను విందు నన రావణుండ నా-నెలవు లంక దనుజవి
భుఁడ జగముల,నన్నిటిని గెలిచినాను ననుఁ బొందు-నరుని
బొందు నీకెందు కన విని భయంబు,న న్నెలత యోరి ఖలుఁడ
నిను రాముఁ-డస్త్రహతుఁ జేయునన రావణుఁ,డెన్నికఁ బది
తల లిరువదికరంబు-లిమ్మై తగ రథమందు సీత నిడె. దీన.

అలఘుగతిని బోవ శేషగిరినిల-యా హరీ రామ లక్ష్మణా
యనుచుఁ, గలికి విలపింప విని జటాయు వది-దెలిసి వచ్చి రణ
మొనర్చి కూలెను గిరివలెఁ - కులుకుచు దశాస్యుఁ డరుగ గిరి

నైదు-గురు కపులను గని తొడవుల్ ముడి యిడి, చెలి నై చె
నచట లంకాపురంబుఁ-జేరి యశోకవని సతిని నిలిపె. దీన.

౮. లలితపంచమిరాగము-ఆదితాళము.

పల్లవి.—ఓవనితామణిరో వినవే. నొకటిదలచె నోవని.

అను.—వేవచ్చులక్ష్మణుని వీక్షించిహరి మది-నొకటిదలఁచె.

నే సాక్షి నౌదు నైన, నీ జగము మాయామోహ-వ్యా
సంగ మొందఁ జేతు నని యెంచి హా సౌమిత్రి సీత న
చట డించి వత్తురా తప్పుఁ-జేసితి వింక నేమి సేతు ననిన
రాముఁ గని యతఁడు పలికె. నోవని. ౧

ఆర్తనాదము వినియవనిజ నన్నుఁ బొమ్మన్న- నార్త
రక్షకుఁ డతని కడలకు మనిన, నార్తిచే వినరానిదు,ర్వార్త
లాడ నీమార్గానువర్తినై వచ్చితి నన్ను మన్నింపవే యో
దయానిధీ యనె. నోవని. ౨

ఆమీఁదఁ బర్ణశాల-కరిగి సీత లేకున్న, రామచంద్రుఁడు
శోకవా-రాన్నిధి మునింగి, తా మహామహుఁ డయ్యు ని-ర్ద
ళితదుఃఖరాశి యయ్యుఁ, బామరులకుఁ జూడఁ జింతా-పర
వశుఁ డైనట్లు విలపింపఁ దొడఁగె. నోవని. ౩

హా పూర్ణచంద్రానన- హాచకోరాక్షి యింత, కోపమా
నాతోఁ బలుక-కున్నా వేమి, ఓపరమసాధ్వియింక నేనె-ట్లో
ర్తు నిమిష మొకయుగ మాయెఁ, బాపపుదైవ మింత - పగ
వాఁ డా యెఱుఁగ నని వనితను వెదకె. నోవని. ౪

వెతకుచు రాఁగా-హతపక్షుఁడై పడియున్న, పతగేంద్రు

గని లక్ష్మణ-పరికించితే, అతివ నీతఁడు మ్రింగి-హతుఁడైన
ట్లున్నాఁడు వీని, ధృతిచేఁ జంపుదు విలు నమ్ములు- దెమ్మ
నిన రామ నే జటాయువు ననె. నోవని. ౫

హరిహరి యని డాయఁ బోయి-యతనిచేఁ దద్విధ మెల్ల
నెఱిఁగి పక్షిరాజుమై-కరమున నిమిరి, పరఁగ బోధించిన రా
మా-హరి పరమాత్ముఁడవు నిన్నుఁ, గర మర్థిఁ జూచితి ము
క్తిఁ-గంటి నని ప్రాణము ల్విడిచె నతఁడు. ఓవని. ౬

చితిఁ బేర్చి పులుఁగుమేను-శిఖచే దహించె నంత, ధృత
శంఖచక్రగదాబ్జా-న్వితుఁడై హితుఁడై నతుఁడై రుచిరత
నుఁడై వరవిమా-నారూఢుఁడై జటాయు, వతిభక్తి శేషాచ
లపతి-యా రాముని నుతియింపఁ దొడఁగె. ఓవని. ౭

౯. జటాయుకృత శ్రీరామ స్తవము చూర్ణిక.

శ్రీమదగణితగుణ మణిగణాలంకృతరుచిరచిరతరశుభస్వ
రూపం, సకలజనభయావహమహదజ్ఞానజనితకలికలుషాంధ
తామిస్రనివారకభవతారకదీపం, అనుపమాద్భుతమహాప్ర
తాపం, హతదీనజనతామసస్తాపం, కరధృతవిదితామోఘశ
రచాపం, జగదుదయస్థితిసంహారావిర్భావతిరోధానాదిమహా
మాయావినోదనిదానం, అంగీకృతరంగన్మంగళాభంగతుంబు
రునారదసంగీతవీణామృదుగానం, భూతభవిష్యద్వర్తమాన
కాలత్రయాబాధ్యమానం, అసమానం, అక్షీణకటాక్షవీక్ష
ణరక్షితదాక్షాయణీప్రముఖనిఖిలభక్తజనసమూహం, నిర్గళి
తసకలసందేహం, దుర్వారోర్వీభరణహరణనిర్వహణచణలీ

లామానవదేహం, నిరీహం శ్రీమత్కరుణావలోకనమాత్రతోషితపాలాక్షచతుర్ముఖాది సర్వసుపర్వాఖర్వఖేదం, నిరంతరామనస్కసమాధిపరిపూర్ణపరమయోగీంద్రహృదయ సరసీరుహకర్ణికోపరిస్థిత వితతజగత్పవిత్రీకృతాద్భుతప్రభావభాసురవియన్నదీజనక విభవాభిశోభితకిసలయమృదుపాదం, సమస్తజనానుమోదం, నతజనసంతతసకలకల్యాణగుణసంపాదం, దళత్పుండరీకపత్రజైత్రవిపులతరమనోహరవిలోచనం శిలామయమానినీమోషాఘర్షణదోషవిమోచనం, యాచితవైరోచనం, కుముదబాంధవకిరీటప్రచండ కోదండనోద్దండదోర్దండసముద్దామం దేవతాసార్వభౌమం, రవికులపయఃపారావారపరిపూర్ణసోమం, గర్వితపూర్వగీర్వాణవాహినీసందోహకఠినకంఠలుంఠనగళచ్ఛోణితారుణితసహస్రకరసహస్రకోటిప్రభాభాసమాన మహాభూతభయంకరసుదర్శనాభిధానావక్రచక్రాయుధాభిరామం, మారీచసుబాహువిరామం హారహీరసీహారకర్పూరసుధాసారడిండీరశరన్నీరదశారదానారదపూర్ణిమాచంద్రచంద్రికాధిక్కారదశదిగ్వ్యాపితధవళయశోధామం శ్రీరామం, జననమరణాది ఘోరసంసారమహాగహనదావదహనాయమానసకలజగజ్జేగీయమానపావననామధేయం, సూరిజనభాగధేయం, ఇంద్రనీలమణిప్రతీకాశాతిస్ఫుటసుందరకాయం, రమాకాంతాకుచకుట్మలతటీచర్చితపటీరకుంకుమసంకుమదమిళచ్చందన పంకముద్రితశోభనవిశాలవక్షసం, హతఖరదూషణాదిరాక్షసం, రూక్షేక్షాశిక్షితవిపక్షం, ప్రి

పన్నావనదీక్షం, పరధనపరదారవిముఖమునిజనసేవ్యం, దుష్టజనదుర్విభావ్యం, ప్రణవైకసంస్తవ్యం, శ్రుతిశిరోవీథికాశ్రావ్యం, విలూనదంభాభిమాననానాభువనసంస్తూయమాన మానవపుర్నిర్మాణాసమానమానసవరోవరముహుర్ముహురుద్ధతసముత్తుంగాఖండానందవీచీపరంపరా లీలాడోలాందోళితచిన్మయరాజహంసం, రాజకులావతంసం, స్మితమనోజ్ఞాననేందుమండలం, రత్నప్రభాచకచ్చకితచామీకరచారుకిరీటకుండలం పోషితాఖండలం, గుణత్రయశక్తిత్రియమూర్తిత్రయానువృత్తం, తరుణామయచిత్తం, పనసామ్రకదళీక్రముకఖర్జూరజంబూనింబజంబీర పున్నాగచంపక మధూకవకుళాశోకతమాలసాలరసాలాదికోరకితపుష్పితఫలితలలితమహా మహీరుహరాజీవిరాజిత రత్నచ్ఛవిచ్ఛటాలంకృతసానుప్రదేశ సంతతసముత్పతన్నిర్ఝరాకలితప్రశస్తసమస్తవిలాసోల్లసిత శేషాచలశిఖరమధ్య సువర్ణప్రాసాదవిహారణశీలం, తోషితాశేషభూపాలం, సురాసురయక్షరక్షస్సోరగ గరుడగంధర్వసిద్ధ సాధ్యకిన్నరకింపురుషవిద్యాధరచారణాప్సరో బృన్దరచితబహువందనం, భక్తజనచందనం, రఘునందనం త్వాం భజామి త్వాం భజామి.

౧౦. శహానరాగము_అటతాళము.

పల్లవి.—కోరికూరిమి మీఱి కౌమారిఖ- రారిచరితము వినవే॥

అను.—శ్రీరాముఁడు జటాయువుభక్తికి మెచ్చి- శ్రీమీ

అగఁ గైవల్య మిచ్చి యావలఁ జని హెచ్చి .కోరి.

సానుజుఁడై సీత నరయుచు రాముఁడు-చని ఘోరాకా
రుఁడైనరక్కసుని జూచి, మానధనుఁ డౌలక్ష్మణునితోడఁ
బలికెను-వీనిబాహువులలోన నిప్పుడు మనము, పూని చిక్కి-
తిమి కన్నులుఁ గాళ్ళుఁ దల లేదు-వీనికి నని తెగువతోన
రాఘవు లిరువురు, వాని యోజనదీర్ఘ బాహు-ద్వయముఁ
దెగ నఱకిన, గబంధుఁడు, దాని కద్భుత మంది మీరెవ-
రే నెఱుఁగ ననఁ జక్రి పలికెను .కోరి. ౧

దశరథసూనులము రామలక్ష్మణులము- తండ్రియాజ్ఞ వ
నమున సీతతోడ, వసియించి యుండుమము-వంచించి యె
వఁడో నా-వామాక్షిఁ గొని చనెను- వాని వెదకుచువచ్చి,
వెననిన్నుఁ గంటి నీ వెవఁ డనిన గంధర్వ-విభుఁ డజునివర
మునకు జిరజీవినై, కొనరి యష్టావక్రమునిఁగనుఁ-గొని నగి
న నసుర వగుమని త,పసి శపించె విమోచనము రఘు-పతి
సేయు ననెను దైత్యుఁడు .కోరి. ౨

దనుజతనువు గాల్పు మెఱిఁగింతు సీతావృ-త్తాంత మన
న న్నిట్లు సేయ నరు దరు దిది, యన నసురాకృతి విడిచి
దివ్యగంధర్వుఁడై-వినుతించె హరిని మాయామానవకాయ,
మనఘ దుష్టనిగ్రహార్థము పూనితివి పర-మాత్ముఁడవు వై
వరాయ సన్మునిగేయ మనోవాగగోచరుఁడ వనా-దినిధనుఁ
డ వఖిలసాక్షి చి-ద్ఘనానందమయుఁడవు ర,ఘునందన వంద
నములు చే-కొనుమనె .కోరి. 3

రూపరహితుఁడ వయ్యు రెండురూపములు గల-వో పరమ పురుష నీకు స్థూలసూక్ష్మముల, ప్రాపున జగములు గలుగు వెలయునడఁగు-నీపాద మాన పరాకు హిరణ్యగర్భ, యేపున సూక్ష్మమయి విరాట్తనువు స్థూలమై-దీపించె నది మాకుఁ దెలియు మును లలమట, కోపి ధ్యానము సేయగఁ విరాట్పురుషుఁ డన ధారణాశ్రియుఁడై, చేపట్టి రామునితనువె సమ్మఖిలజగములు ననెఁ గబంధుఁడు.కోరి. ౪

వానిజ్ఞానము మెచ్చి వరదుఁడు పలికెను-వరమౌనీపావన స్తవము నుడివిన వినినఁ, గాని వారికి సిరులుఁ గలుగు దురితముఁ దొలఁగుఁగలుగ దెన్నఁడు భయ మని సెలవియ్యఁ, గానె రావణుఁడనురాక్షసుఁడు సీతను లంక,లో నుంచినాఁ డీదినము శబరివద్దకిఁజనుఁ, డా నెలఁతచే సకలమును వినఁ-గానగు ననుచుఁ గిన్నరుఁడు: జనె, భానుకులమౌళి శేషాచలపతి మతంగాశ్రమముఁ జేరెను.కోరి. ౫

౧౧. మాంజిరాగము-ఆదితాళము.

పల్లవి.—హితమతి సతీపార్వతీ-యా, చరితము వినవే।

అను.—రతిపతిశతాధికరుచి- రాంగు లౌ రామలక్ష్మణుల, సతివేడ్కఁజని యాశం-దాబ్ధిఁ దేలి శబరి యెదుర్కొనెను.హిత.

పదయుగళికి మ్రొక్కి-పాద్య మొసంగి, తదంబుకణార్ద్రి పదమలసర్వాంగి, యై హరిదర్శన, ముదితవిలోచనజిత సారంగియై, రాఘవులను స-న్మృదుఫలగంధమాల్యములఁ, తృ

ప్తులఁ జేసి హృదయముల, మునమొనవఁ బలికెను రామునితో
శబరి కరఘటితాంజలి యగుచు .హిత. ౧

నినుఁ గని ధన్యనై తనరితి ఖలులఁ-దునుమఁగ మునుల మనుపఁగ దశర,థునిసుతుఁడై నారాయణుఁడు జనియించు-నని నాగురుఁడు సువ్రతుఁ,డై తెల్పెను మతంగ, ముని యది నేఁడు నిజ మా,యె శరణు శరణు దైవరాయా, వనితను హీనకులజను నినుఁ దెలియఁజాల-నన రాముఁడు పలికె .హిత.

కులనామాశ్రమా,దులు హేతువులు గా వ,బల ననుఁ దెలియఁగ, భక్తి యొకటివినా యజనదానతపోమంత్ర,ములు భక్తిహీనము లైనవి, ఫలములు గనుకఁ, దెలిపెద భక్తిమార్గము, సులభ మగునపవర్గము, తొలుత సత్సంగతి యా,వల మత్కథాలాపగుణరతు లనెను .హిత. ౩

ననుఁ గొనియాడుటయు, - ఘనగురుసేవ య,ను నియమాదులను, ననుఁబూజించుట, నను భజించినవారలను, గని సంభావించుట సకలభూతముల ననుఁగాఁ గని శమదముల, నెనయుట విమలచిత్తముల, నను వివరించుటయు నివి నవవిధభక్తులని మరల హరి పలికె.హిత. ౪

భావము సజ్జన,సేవన పదిలమైనది నీకుఁ, గావున నను, జూడఁ,గాఁ గలిగె నిఁక జానకి తెఱఁగు, వేవేగమె జాడ గాఁ దెలుపు మన సతిని, రావణుఁ డెత్తుకొని వేగ, లంకకుఁజనె మహాభాగా, దేవాదిదేవ నీకు దెలియని,దిగలదే యనుచుఁ జెలిపలికె .హిత. ౫

పంపానామసరో,వరతటి ఋశ్యమూకాద్రిపైఁ, బెంపున సుగ్రీవుఁ డున్నాఁడతనిసఖ్యము చేయుఁ డింపున నతఁడు దో డ్పడు నని తెలిపి శబరి, తెంపున నచట జితిఁ బేర్చి, దేహ ము చిచ్చుతోఁ గూర్చి,సొంపున శ్రీవిభుని దలఁ,చుచుఁ దను వెడసి పరమ పదమున కరిగె ॥హిత॥ ౬

ఈరఘువర స్తవము,నెవరు పఠించిన వినిన-వారికోరినకో ర్కెల నిచ్చు శేషాచలేశుఁడు కృపను, ఘోరదురితములను బుచ్చు నిది జయ,కరము సూరిజనానందకరము,దారిద్య్రసం కటహరము-అరణ్యకాండము శ్రీ నీలా సుబ్రహ్మణ్యకవి తెనిఁగించె ॥హిత॥

అరణ్యకాండము

సంపూర్ణము.

---

శ్రీ ర స్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు.

## కిష్కింధాకాండము.

మారువరాగము-ఝంపతాళము.

పల్లవి.—శ్రీహిమాచలవరసుతా యీకథ స-మాహిత మతివై వినవే॥

అను.—మోహనాబ్జోత్పలా, మోదయుతమై విమల, మై హంసచక్రవా, కాదివిహగకులకో,లాహలమై, పనసామ్ర వకుళక దళీతరులసితతీరమై తగుపంపాతటిని డాసి, సాహస విక్రమకలాకు,శలు లగురాఘవులు,స్నాన పానములు చేసి, శ్రమముఁ బాసి యలరిర ॥శ్రీహి॥

వరఋశ్యమూకాద్రి,సరణిఁ దప్పక నడచువారి శరచాప ధరుల, నృపవరుల, నురుజటావల్కలాం,బరులఁ జూచి, వెఱఁగొంది సుగ్రీవుఁ డరు లని తలఁచి మంత్రి,వరుఁ డై సహ నుమంతు,వారి నెఱుఁగఁ బనుప, నెఱవడుగై చని మారుతి రాముని యంఘ్రులు, శిరము సోఁక నతుఁడై జగదుదయ, స్థితిలయ, కరణశీలురై పురాణ,పురుషులై తనరు,నరనారా యణులో కాక మీ రెవ రని యడిగెను ॥శ్రీహి॥ ౧

విను లక్ష్మణా యితని, వినుతవాక్పటిమంబు, ఘనశబ్దశా
స్త్రమతమై, శ్రుతిహితమై, తనరె నని హరి వటువు, నతిమై
త్రితోఁ గని నే, దాశరథిని నను రాముఁ డందురు నా, య
నుజుఁ డితఁడు, లక్ష్మణాఖ్యుఁడు సీత యనునా, వనితయు నే
ను నితఁడు నడవులఁ జరించ మ, జ్జనకుశాసన, మున వచ్చి
పంచవటి నుండ, దనుజుఁ డవఁడొ కన్నొఱఁగి సీత నెత్తుక
చనె, దాని వెదకెదము నీ వెవరో తెలుపు మనె రా
ముఁడు ॥శ్రీహి॥ ౨

వానరేంద్రుఁడు సుగ్రీ, వాఖ్యుఁడీగిరి నమాత్యులఁ దా
నున్నారు వాలికి, భయపడి మ, హానుభావా ననుమీపాలికిఁ,
బంపె, నేను సుగ్రీవుమంత్రిని, వాయుసుతుఁడ హను, మా
నాహ్వయుఁడ సూర్య, సూనునకు మీకుఁ జెలిమి, మానిత
ముగఁ జేసెద ననుటకు రాఘవులు నను, మతింప వారిఁ దన
మూఁపుపై నిడి తెచ్చి, భానుజున కెఱుఁగఁ జేయఁ జెలంగి
రామునిపాద, పద్మముల కెఱఁగి తరుశాఖ పీఠ మిడియె
నతఁడు॥శ్రీహి॥ ౩

రామాభిగమనంబు, సౌమిత్రిచేఁ బ్లవగ, రాజు విని రిపు
విఘాలా, నగ పేల, భూమిసుతజాడ, యేలీల, నైనం దెత్తు,
స్వామి యొకదనుజుఁ డొకపతి నెత్తుకొని పోవ, భామ మైత్రో
డవు లిటఁ బాఱనైచె నని యియ్య, రాముఁడు గని హా సీతా,
యని విలాపింపఁ బామరునికి దైన్య, పడఁదగ దని రవిజుఁ,
డామహామహునికి దెలిపి, యగ్నిసాక్షికముగఁ బ్రమాణిక

ములు చేసికొనిరి సఖ్యమునకై ॥శ్రీహి॥ ౪

మయసుతుఁడు మాయావి, వాలితో ననిఁ బెనఁగి-పుయి
లోఁడి యసుర తొలఁగి, గుహఁ జొర ని,ర్భయుఁడై వానిఁదో
లి, చెలఁగి యచట, దయచే నన్నునిచి పోయి తా నెలకు
రాకున్న-లయమాయె నన్న యని తలఁచి, గుహను శిలదో్రి
-చి, భయమునఁ జని యది దెల్పఁగ సచివుల్ ననుఁ గపి,పతిని
జేసి రరిఁ బొరిగొని మాయన్న వచ్చి, ప్రియను రాజ్యము
నుఁ గొని ననుఁ దఱిమిన శేషగి-రీశ నేనది మొదల్, ఇచట
నునికి యనె నినజుఁడు॥శ్రీహి॥ ౫

౨. కళ్యాణిరాగము-అటతాళము.

పల్లవి.—తగ వినవే ;యీచరిత్రి దళ-త్కంజదళమంజులనే
త్రా, నగవిభేదనమణినిచయకాంతిస్ఫుట-సుగాత్రనుతిపాత్రా

అను.—నగఁ బొగులు రవిజుఁ గని హరి నీ-పగతుఁ దునిమె
ద నన బలాధికుఁ, డగువాలి గెలువ నెట్లగు నని, యతఁ
డన్నబల మెన్నఁగడఁగెను॥తగవిన॥

దుందుభి యనెడిదనుజుఁ డాహవ-దోహలత మహిషరూ
పుఁజెంది వాలిని దొడరఁ గొమ్ముల-సందెడలఁ జీల్చి యతఁ
డేపు, మ్రిందించి కాలం దన్నినఁ ద-ద్రక్త మీగిరి నెఱయ
వాలిని 'ఇందు రాఁ దలపగులు,నని శపి-యించెను మతంగు
డనెఁ గపిపతి॥తగ॥ ౧

అదిమొద లిచట నుందు నభయత-ననఘ దుందుభిశిరం
బు అదె యోజనము చిమ్మినవాలి-ననిగెలుతు వన విని ము

దంబు-గదురఁ బదియోజనాల్ చిమ్మెఁ-గని సప్తతాళపత్ర
ములంతఁ-గదిమి యొకపరి గోయునటు లవి-చిదుము మన
హరి నగివిలుకొనియెఁ॥దగవిన॥ ౨

శర మొకటి శ్రీరాముఁ డేసిన-సప్తసాలములఁ ద్రుంచి,
గిరి ధరాతలరసాతలముల-నెఱఁగి పోదిఁ జేరె నది గాంచి,
తరుచరాధిపుఁడు రాముని పా-దముల కలరుచు మ్రొక్కి- శర
ణని, చరాచరమూలమైనపరా-త్పరవస్తు వని పొగడఁ దొ
డఁగెను॥తగవిన॥ ౩

నాపూర్వపుణ్యఫలము జగ-న్నాథ నినుఁ గనుట నేఁడు,
ప్రాపని తలంతు నిను సంసా-రనివృత్తికై ఘనులు చూడు.
శ్రీపతి సతిసుతధనము కాం-క్షించి బుద్బుదసమం బది నీ, ప్రా
పు పెన్నిధి పేద కబ్బిన-పగిది నేఁ గంటి ననె నినజుఁడు॥తగ॥

క్షణ మెవఁడు నీయందు మది ని-శ్చలముగా నుంచు వా
ని, ఘనమోహలత సమూలముఁ దెగు-నిను రామ రామ
యనువాని, వినుతింప బ్రహ్మహత్యాశ-తమణఁగు నిఖలబ్ర
హ్మ మని తోఁచె నటంచుఁ గౌఁగిలించెను శ్రీ-శేషగిరిపతి
ని సుగ్రీవుఁడు॥తగ॥ ౪

3. రేగుప్తిరాగము-ఆదితాళము.

పల్లవి.—గరుడగమను సచ్చరిత్రము వినవే-గౌరీసుకుమారీ॥

అను.—సురుచిరాలింగనమునం బరిహృత-గురుకలుషుఁడైత
నరుసుగ్రీవుని, వరదయాదృష్టిఁ గని చిఱునగవున-వదన
శశిశృంగార శ్రీమీఱఁ బరతత్త్వ మెఱిఁగి పలికితి వానను-

బ్రాకృతు లెఱుఁగక రఘుకులుఁ డండ్రు, కరటులను మా
యచేత మోహితులు-గాఁ జేతు ననిపల్కె శ్రీపతి॥గరుడ.
లేలె మ్మికఁ వాలితో ననికిఁ జను-కీలు గుఱు తెలిఁగి రి
పుఁ డ్రుంతుఁ నని, మేలుగ హరి పల్కె-నఁగిష్కింధకు-మిహి
రతనయుఁ డరిగి కెరలుచుఁ-జాల సింహనాదముఁ జేసిన రిపు,
శబ్దము విని రోషారుణనేత్రుఁడై, వాలి రా నతనియుర మి
కజుండలి కేలఁ బొడిచె వాలి యమునిఁ బోలి, వ్రాలుచు
సోలుచు నొకరి నొక రేచి-చాలప్రొద్దు పోరాడువాలిచేఁ, దూ
లి రుధిరములు గ్రక్కుచుఁ జని హరి-తో ననియెం గపిరాజు
తొడింబడి. గరు. ౧

రామా ననుఁ జంపింపఁగఁ దలఁచితి-వో మాయన్నచే
నటులైన నీవే, స్వామీ ననుఁ బొరిగొను మని పొగిలిన-రా
ముఁడు కడు వగచి నేను సఖా, యేమిసేతు మీరిద్ద రొక
రూప-మైమెఱయుట నేయక తడసితి నని, సౌమిత్రిఁ గని
యితని కొకగుఱుతిడి-యీమాటు పంపు మా యన నతఁ
డనుపమ, హేమపుష్పమాలిక యొసఁగి పనుప-ధామనిధిసు
తుఁ డరిగి వాలిఁ బిలువ, నేమి-చోద్యమని యాజి కతఁడు
పోఁ-గా మగనితోఁ దారవలికెను. గరు. ౨

పోవలదు మహాత్మా ప్రిపు లే కితఁడు-పోరికి దిరిగి నచ్చె
నా యన నగి వాలి, నే వీరుఁడనై పో కునికి తగదు-వేవేలు
వచ్చినను నే వెఱవ, వేవేగ నతనిప్రిపుతోడఁ-జావ నడిచి
వత్తుననిన నంగదు చే వింటి రాముఁ డడవులకు వచ్చి-సీతఁ

గోల్పడి నేఁడ రవిజునితోఁడఁ, దా వహ్నిసాక్షిగా మైత్రిఁ జే
సి-నే వాలినిజంపుదు ననినాఁ డఁట, దేవదేవుఁ డతని శరణ
మని సు-గ్రీవుని సచివుఁ జేయు మనె సతి॥గరు॥ ౩

రాముఁడు సాక్షాన్నారాయణుఁడై-బ్రహ్మాదిసురలు ప్రా
ర్థింప రఘుకుల, సోముఁడై జనించె రావణవధకు-నామహితు
నకొరులు స్వజనులు, నేమిలేరబలపొమ్మనితమ్ముని- నెదిరిపోడు
వ, దరువుమఱువున నుండి,రాముఁడై ందరిబాణ మేయఁబడె
సు-తారామసుతుఁడు సోలి గిరిఁబోలి, మైమఱపు కొంతవడికిఁ
దెలిసి గుణ-ధాము ధృతజటాస్తోముఁ గువలయ,శ్యాము లక్ష్మ
ణకపీంద్రాభిరాము-రాముని జూచి వాలి పలికెను॥గరు॥ ౪

నాచే నీకపకార మేమి దిన-నాథసుతునివలన నుపకార
మేమి, రాచనడక తెలియకచేసితివి-నీచేతఁ జంపవచ్చునా
బోయవై, కాచి పొంచి యేసిన కీర్తియేమి-క్షత్రియుఁడవై
తేని న న్నెదిర్చి, చూచిన యశ మగుసీతకొఱకు రవి-సుతు
శర ణను టేమి రామస్వామీ, నాచతురత యెఱుఁగవు రా
వణు సా-న్వయముగ సీతతో నిడకుఁ దెత్తుఁ, దోఁచదాయె
దోసమాయె నీ కను-దుందుభివైరితో నృపుఁ డనియె॥గరు॥

సకలధర్మపాలుఁడనై చరింతు-శాసింతు విలుకాడఁనై
ఖలుల వా,రక గూఁతురు కోడలు దోడఁబుట్టువు-భ్రాత-
భార్య పలుక సరియగు, నకటా నీ వెఱుఁగక తమ్మునిసతి
నతిబలాత్కారమునఁ బట్టినపా,తకుని నిన్నుఁ జంపినఁ బాప
ములే-దని వాలి స్రుక్కి హరికి మ్రొక్కి, యిఁకఁ దప్పులు

లేవు శ్రీపతివి జగ-దీశుఁడ వని తెలిసె నన శేషగిరి, నికే
తనుఁడు శరముఁ బెఱుక వాలి య-నింద్యమగు కైవల్య
మొందెను ॥గరు॥ ౬

౩. ఘంటారాగము-ఆదితాళము.

పల్లవి.—కోమలారుణపల్లవపాణి-కోరి వినవె శార్వాణి.

అను.—భీమసంగ్రామహతుఁ డైనవాలి-బేర్కొని వానరుల్ శోకించిరి ॥కోమ॥

తోరముగా సోగకనుల బాష్ప-ధారలు బోరన నొలుకఁ, దారహారములు రాలఁ గిష్కిం-ధాపురి వెడలి నడు మలుకఁ, దార వదనవిజితరాకా - తారాపతి నిజపతిని జేరి, వీరాధి వీరాననుఁ బాసి పోయి- తే రమణ హా హా యని యడలెను ॥కోమ॥ ౧

రామా యేబాణమున నేసితో-నామగని నాబాణమునఁ, దామసింపక ననుఁ జంపు మనుచుఁ-దరణిసుతుని గని కోపమున, స్వామిదయ నఖిలము గల్గె నీ-కేమి సుఖ మనుభవించు మని, భామామణి విలపింప రాముఁ-డామగువ నూరార్చఁగడఁగెను॥కోమ॥ ౨

ఊరక యేల పొగుల శోకమునకు-వేత్తైపోయినపతికి, నారీసపతి జీవుఁడో యాశ-రీరమో నీమదికిఁ, గోరి గుణభూతేంద్రియములు-చేరి కలిగె నది తనువు శ, రీరి నిత్యుఁ డచలుఁ డెవ్వరి కీరీతి వగచెద వనెను హరి ॥కోమ॥ ౩

అనఘ తనువు దారువువలె జడము చి-దాత్మ జీవుఁడు

నిత్యుఁడని, మొనసి పల్కితి నీసుఖదుఃఖము-లనుభవించువా రెవ్వ రని, వనితామణి యడుగ రాఘవుఁడు- విని యహం కారాద్యనుబంధమె, ఘనసంసారము జీవునకు సుఖాసుఖము లజ్ఞానము లనెఁ ॥గోమ॥ ౪

బలుకోర్కెలు గలవానికి రానివి-కలలోఁ దోఁచు నెటు లటులనె, చెలి యనాద్యవిద్యాసంబంధము- జీవికహంకృతి యందుననె, తలఁపే సంసార మదియె బం-ధము శుద్ధస్ఫటిక మునఁ గెంపు, నిలుప నెఱుపై నట్లు మతీంద్రియా-కలన సంసృతి యనెఁ ॥గోమ॥ ౫

జీవుఁడు మనోయుతుఁడై యది పోవు-త్రోవఁ బోవుచు జన్మమృతి, భావ మొందుచుఁ బుణ్యవశత నా-భక్తులసంగతి సుగతి, త్రోవ దెలిసి మహదాదులకు-నే వేఱా బ్రహ్మమని తలఁచు, నీవు పూర్వసుకృతమును- సేవించి ధన్య వైతి వనె హరి॥కోమ॥ ౬

నాచేఁ బలుకఁబడిన యీవిధ మా-లోచన సేసి సన్మతి వై, యేచి సుఖంపు మన రాముని నుతి-యించెఁ దారయవ హితయై, ఆచక్రిమహిమ సుగ్రీవుని-కానందప్రద మయ్యె నతనిఁ, జూచి వాలికిఁ గ్రియల్ సేయ-సూచించి పంచె శ్రీ రామచంద్రుఁడు ॥కోమ॥ ౭

తరణిజుఁ డంగదపురస్సరుఁడై చ-ప్పరమున వాలితను వుంచి, పరేతోర్వి కేఁగి దహనాద్యపర-కరణీయము లొన రించెఁ, బరమాహ్లాదమున రామపద- సరోజాతములు గాం

చి మ్రొక్కిన, హరివీరుల కెల్ల దొర దినక-రాత్మజుఁడు
మంత్రి యంగదుం డనెఁ ॥గోమ॥ ౮

సిరియు రాజ్యము నీదె నిను సేవించెద ననుసుగ్రీవుఁ గని హరి, యరయ నీవే నేను రాజ వగు మని యానతీయ లక్ష్మణుఁడు పురి త్వరతోఁ జేరి సుగ్రీవున కలరి పట్టము గట్టి వర్షఋతు, వరుగ రమ్మని చనియె శేషగిరీశు డగు శ్రీ
రామునియొద్దికిఁ. గోమ. ౯

౪. యమునరాగము-రూపకతాళము.

పల్లవి.—ఫణిశయనునిచరితము విను దాక్షా యణీ భక్త జనపరాయణి.

అను.—గుణనిధులౌ దాశరథులు ప్రవర్షణాచలశిఖరస్థవిలసత్ఫలసుమ తరు, గణావృతమై బహువర్ణమృ గవిహగ సేవితమై, మణివృతమై వర్షవాతసహ మగునొకగుహ నుండిరి. ఫణి.

శ్రీనివాసుఁడు నరాకృతిఁ జేకొనినాఁడని మౌనివరులు సురలు కర మనురాగమున, మానితఖగమృగశరీరులై సేవింతురు పూని యనుదినము రాముని నహోరాత్రిల, ధ్యానమానసికుఁడై లక్ష్మణుఁ డేకాం తమున వికసితముఖుఁడై తగ రఘుపతిని జేరి, భానునిభా నీచే మును విన్న బోధనే మఱచితిఁ గాన సులభమౌ క్రియాయోగము సెల విమ్మని
యెను. ఫణి. ౧

అనుజుఁడ ననుఁ బూజింపఁగ నంతము లేదైన, విను సం

క్షేపముగా వినుపింతు గురుదయ, ననుపమమంత్రోపదేశమై
ధీమంతుఁడు, మొనసి గురునిచేఁ బూజావిధి తెలిసి తగ,నను
సభక్తికముగా నారాధించి ప్రాతస్స,వనాదిక మగు నాహ్ని
కము లొనర్చి శిలాస్థాపనముఁ జేసి కృతసంకల్పుఁడై గంధ
కుసుమాదుల, ననుఁ బ్రతిమాదిపూజ సేయుఁగవలె ననె
రాముఁడు . ఫణి. ౨

నాసన్నిధి భక్తి నేమి యొసఁగిన నే మందునె యలరు
దుఁ జాలభక్ష్యభోజ్యచందన, వాసోముఖపూజాద్రవ్యములు
దెచ్చిసిద్ధాసనమున దేవుని యెదుటఁ గూర్చుండి లీలా,భా
సురబహిరంతరమాతృకా న్యాసంబులు గేశవాదికము మూ
ర్తిపంజర, న్యాసంబులుఁ జేసి హృదబ్జరవివిమలజీవకళా ధ్యా
సిస్థై శిలాదులకుఁ గలాసిద్ధిఁ జేయవలె ననె రాముఁడు. ఫణి

హృదయావరణాదిపూజ లాగమవిధి నొనరించి యర్ఘ్య
పాద్యాచమనమధుపర్క, సదమలధూపదీపనైవేద్యనీరాజ
నాది విదితోపచారముల నర్పింపవలె నన్నవిద్య, వొదలు
చు నగ్ని ప్రతిష్ఠాపనం బు చేసి యగస్త్యోక్తమార్గమున హో
మము వేల్చి దహనుఁ దప్తసువర్ణసముగ మణిభూషణుఁగ
విష్ణు పదస్థితుఁగా బుధుల్ సదా భావింతు రనెను హరి. ఫణి

బలి పార్షదులకు నిడిన మంత్రజపముఁ జేసి చెలగిఁ విడె
మిచ్చి నృత్యగీతవాద్యము, లలరఁ నాముందర స్వస్తివచనా
దులు సలిపి నాప్రసాదము శిరసావహించి హెచ్చి, లలి దండ
మర్పించి కరయుగళి నాపాద జలజంబులు స్పృశించి తల

నుంచి మహాసంస్మృతి, వలనఁ బోవు మనియు ధ్యానమును జేయునతఁ డిహపర ము లొందు నని శేషగిరినిలయుఁడను జన్మునకుఁ దెలిపె. ఫణి. ౫

౫. పంతువరాళిరాగము-అటతాళము.

పల్లవి.—కలికి యలరులములికి చిలుకల కొలికి వీనులను ధఁ జిలుకుకథ వినవే

అను.—చెలఁగి లక్ష్మణదేవుని దెలిపి ప్రాకృతునివలె మాయ యలవడ * సీతా యని నిద్రఁ జెందఁజాలెను హరి. కలికి.

అచటఁ గిష్కింధాపురిలో హనుమంతుఁ డతిసీతిమంతుఁ డగచరేంద్రుఁ డగు సుగ్రీవుని చేరి రాజా, ప్రచురత ధనరాజ్యములఁ గొని రామచంద్రు మహానుభావుని మఱచినావు, ఖచరపతిసుతుఁడు తెగిన గతిఁ జెడక రాఘవుని జేరుము, విచికిత్స వల దనిన విభుఁడు పిలిపింపు మనెఁ గపులను. కలికి.

అంజనాసుతుఁ డధిపునియాజ్ఞ వానరుల రాఁ బనిచిన నఖిలదిక్కులఁ బిక్కటిల్లఁ గపివీరులు, మంజుతరగిరినిభశరీరులు మహియు నాకసము భేదిల్ల వచ్చి రంతఁ, గంజదళనేత్రుఁడై తగు- కాకుత్స్థకులుఁ డచలమున మణి,పుంజసాను స్థితుఁడై -పొరలె సీతావిరహార్తిచేఁ ॥కలికి॥ ౧

జానకీ హా చంద్రముఖి ప్రాణములు నీమీఁద నిలిచిన, వేనన్నుఁ బాసి-యుండఁగఁజల్లనై మా,మానవతి నంటి నీకరముల మఱి నన్నుఁ డాఁకుమీ రా కాసుధాకర, భానుసముఁ

డాయెఁ జంద్రుఁడు పరికింపు లక్ష్మణా యిదివఱ, కేణాక్షి
దనఁజూచేఁ బడి యెటులౌట యెఱుఁగ ననె రాముఁడు॥కలి॥

శ్రీసక్తుఁడై పానమదచేష్ట నిటు రాఁడు సు-గ్రీవుని
ద్రుంతు నని రాఘవుఁడు దోడర ననుఁ బంపుతీ, వ్రాసిహ
తునిగఁ జేతు నినసుతు నని యనుజుఁ డలుగ హరి కడు రా
యిడిసేయఁ దగ, దా సౌమిత్రి నీవు చని వాలి వలెఁ జెడకు
మను మిఁకఁ దడవు, చేసినఁ జెడు నని నదవ-శిఖరిణిఁ గపి
పురికి నతఁడరిగెను .కలికి. ౪

విలుగుణధ్వని చేయఁగ విని యంగదుఁడు వచ్చి మ్రొ
క్కి న-వేగ మీఁదొరకు మారాక దెల్పు మనఁ జని, కలఁగి
పురివాఁకిట నిలిచె లక్ష్మణుఁడు కపిరాజా పరాకా యన సు
గ్రీవుఁడు, దెలిసి మారుతి నీ వలుకఁ- దీర్చి యాఘనుని దె
మ్మనఁ జని, వలగొని కినుక నతవత్సలానుజా-వలదని తో
డి తెచ్చెను .కలికి. ౫

పతి పనుపఁ దారాంగన చని-భయభక్తివినయసంభ్రమ
ముల,నతిఁ జేసి కుశలమే బావా-నాపతిపైఁ గోప మేమీ,
అతిభీతుఁడై హరివిభుఁడు న-న్ననిచెమిముఁ దేరరా దేవా
యని చెయివట్టి, సతి యంతఃపురికిఁ దోడ్తెర నతని గనుఁగొ
ని కపి,పతి రుమాయుతుఁడై పాన్పుననుండి యులికి పడి లే
చె వెలవరివలెఁ .గలికి. ౬

మదలోలలోచనుఁడై-మలయురవిసుతుఁ గని యలిగి రా-
మానుజుఁడు పలికె సుగ్రీవా చేసిన తీలు, పదటఁగలిపి రుమా

పథూరతి-పరవశత మఱచి యున్నావా కాని వాలిని, బదరి పాణ్రిములు గొన్న శిత-ప్రదర మెదురెదురు చూచుచు నున్నదనిన రామకార్య మ-నఘ యితఁడు మఱవఁడనెఁ బావని.

వానరుల నిదె చూడు డెబ్బదిరెండు వే-ల్వలను గూడుక, భానుజుఁడు రాఁదలఁచినాఁడు అని పలికినపవ, మానసుతు చతురోక్తుల గతా-మర్షత నున్న రాకొమరు వేఁడుకొని, భానుజుఁడు పూని వందనముఁ జేసిన-వానిఁ గౌఁగిట నిడి యూర్మిళా, జాని యాసీనుఁడయి సరసపూ-జలు గొనె సఖునిచేఁ॥౮

రామదర్శనలాలసుఁ డయి రథమెక్కి-లక్ష్మణకపీంద్రులు రణభే,రీమృదంగములు పొదలఁగాఁ గదలి హ-నూనుసీన్నిలాం గదనలాది,భూమిరుహచరపతులు గు-ములు గొని కొల్వఁగాఁ జామరసితాతపత్రి-సద్విభవయుతులై శేషగిరి, ధాముఁడయి రఘుకులాబ్ధి-సోముఁ డగురామవిభుఁ జేరిరి॥కలికి॥ ౯

౬. కాంభోజిరాగము-అటతాళము.

పల్లవి.—రామాభిరామ గుణధామ-రామకథాసుధామాధురి సామాన్యమా॥

అను.—రాముని కనతిదూరమే తేరు డిగి వచ్చి-సౌమిత్రిరవి సుతులు చేసిన నతులు, స్వామి కౌఁగిట నిడి యర్ఘ్యపూ-జామాన్యుఁ జేయ హరిపతి హరి, వామభాగాసీనుఁడయి రఘు-రామ నృప యిటు చూడు వచ్చిన, కామరూపుల నగణితులఁ-గపుల జితరిపుల ననె విను॥రామా॥

మేరుమందరహిమవత్పారియాత్రాదిగిరులఁ జేరియుండెడి

మీరు దేవాంశభవులు, భూరిశైలాకారులు రణోదారులు-సా
రకరిబలులు దశశతసహస్రయుతులు వి,స్తారవారణసత్త్వులు
నిస్తులులు-చారుసౌవర్ణతను లమలశ,రీరు లగసంగులు వినీలా-
కారు లిదె గర్జ లిడి పరు విడి కడఁగి నీపనికిఁ బ్రాణములీఁ,
గోరినా రింక మీరు మీయాజ్ఞా వశు లభిజ్ఞా యనె॥

గొనకొని భల్లూక-కోట్లు గొల్వఁగఁ దగునీగుణనిధి జాం
బవంతుఁ-డు నితఁడు పవన,తనయుఁడు హనుమంతుఁడు నల
నీలతార-పనసగజగవయగ- వాతఁగంధమా, దనసుషేణద
ధిముఖులు కేసరిప్రముఖులు, విను మితఁడు శతబలి దశరథుఁ
డితం డనఘ వాలికొడుకంగదుఁ డీతం, డనుపమానబలా
ఢ్యులను పనిగొను మనిన, నినతనయు నాలిం,గనము చేసిన
మోదాశ్రులోచనుఁడయి హరి పలికె ఘనుఁడయి॥ రా॥ ౨

ధరణిజ వెదక వానరులం బంపుము నీ-వెఱుఁగవా కార్య
సరణి, యని పలికిన దాఁశరథియానతిఁ దరణిసుతుఁ డగచరు
ల హరిదంతముల కనిచె-నవనిజనసి నెలలోఁ, నెఱిఁగింపకున్న
వారిఁ దుంతు నని భేరి, మొరయించి యంగదజాంబవ, ద్వి
నుతహనుమన్నిలనుషేణుల, శరభమైందద్వివిదుల ననిచె.స
రసదక్షిణదిశకనిలజుని, హరి పిలిచి ముద్రిక సీత కొసఁగు-
మని యొసఁగెఁ బొసఁగ॥ రా॥ ౩

శ్రీరామునిచే నా-శీర్వాదములు గాంచి-మారుతిముఖ్యు
లరిగి, గిరిసరిత్కుంజభూధరదుర్గము ల్దిరిగి, వింధ్యాటవి, నీరు
పట్టున డస్సి నీరపక్షులు గుహ-ద్వారము వెడలి రాఁగాఁ గని

బిలములోఁగా, వా రేఁగి సింహాసనస్థలి-వరనియతినున్న యో
గినిఁగని, కోరి మ్రొక్కిన వీ రెవరనుచుఁ జెలి యనుగఁ-
గా రామదూతల మన వారి ఫలములుఁ గొన గ సెలవిచ్చె
సతి మదిని హెచ్చె॥రామా॥ ౪

జలఫలతృప్తులై, లలనసీ వెన రనిన సలవిశ్వకర్మసుతన,
యను హేమ యందురు ననుఁ, దొలుత నాట్యమునం దిరి,
నయను మెప్పించిన, లలితసద్వస్తుని,స్తులమౌ నీపుర మిచ్చె
నలినాక్షుఁ డదిమొన లీగతి నుందుఁ బోవలి, యలఘుమతు
లార యని వారల-ననిచి తాఁ బోయి శేషా,చల నిలయు,
డగు రఘువరుపదాంబు-జముల కెరగి శ్రుతిసూక్తి సతినుతిఁ
సలిపి చెలి బదరికా-శ్రమమునను గై వల్య మొందెను॥రా॥

౭. గౌళీరాగము-ఆటతాళము.

పల్లవి.—ఇందిరారమణు చరితము వినవే-సుందరీమణి.

అను.—మందయానమునఁ జని కపులు మాని-క్రింద నాసీ
నులై యెటు పోదము, ఎం దరయుదము సీత ననిన వా
లి-నందనుఁ డను జనకాత్మజను గన్గొనక, యుం దరిగితి
మేని ననుఁ జంపు-ముందుగా రుమాజాని నే,నిందు మృతి
నొందువాఁడననిన నందుఁ, గొందఱిందె యుంద-మొం
దుకు మృతి యనిరి॥ఇంది॥

రామబాణమునకభేద్యము జగ-త్త్రయమునందుఁగలదా
చిత్రత యిట్లను, టేమి తెలివి వల దాగుహ నుంద మనః-
సౌమిత్రికన్న నీవిఁ దఁ జేర్మ- చాలఁ గల దింకొకరహస్య

ము, రాముఁ డనఁగ నారాయణుఁడు సీత-శ్రీమహిళ లక్ష్మ
ణుఁ డాదిశేషుఁడు, స్వామిపార్శ్వదులము మనము మును-వై
కుంఠనివాసులము హరి,భూమిభరము మాన్ప దాశరథియై-
పుట్టె నని తెలిపె నంగదునకుఁ బావని॥ఇం॥ ౧
మనము రామకార్యనిర్వాహకుల-మయిన శుభము గలు
గుననిన నందఱీ,ఘనునిబుద్ధి మెలఁగుటే మే లని చని-చని
మహేంద్రాచల మెక్కి తరుచరుల్, ఘనమకర కమఠకర్క
టజలూక ఘనతిమితిమింగలాదిజలచరా-భంగమై తరంగాలిం
గితస్వర్గంగా, మనోజ్ఞాంగవల్లియై తనరు-వనధిఁ జూచి భీతిల్లి
యిది, మనము దాఁటు టేడ రావణుఁ డేడ-ననుచుఁ బ్రా
యోపవేశపరులై రఘుకు॥ఇంది॥ ౨
గిరిగుహ వెలువడి సంపాతి యనుఖ-గేంద్రుఁడు వానరుల
గని పొరిగొందు, నిరతముఁ దిందుఁగరులవలె నున్నా రని-
పరువిడి రా దుర్మృతిభీతిఁ కపుల్ హరి, హరి జటాయు వెం
త సుకృతియై-మరణ మొందె నన వారి సంపాతి సహో,ద
రుని మృతి దెలియ విని హరి-వరు లచ్చటికి వచ్చుటయు నె
ఱిఁగి వారును జలధికి రా, నరిగి తమ్మునకుఁ దిలోదకము లి
డి-మరలునతని సీతనడి యడిగి రగచరు॥లింది॥ ౩
నగశిఖర మెక్కి నిక్కి లంకలో-నశోకవని నవనిసుతఁగం
టినదె, మొగమోటము గాదని పల్కి సంపాతి-తగ నిట్లను
నాతమ్ముని జంపిన, పగ దీర రావణుని దుర్నీతుఁ-బటుయు
గము లేకునికి నగుఁరలేను చిన్ననాఁ డోమహాత్ములార, పంత

ము మీఱఁగ, నోగి జటాయు వేను రవిమండ-లోన్నతం బె
గురఁగాను అరు, ణాగభ స్థితి స్థితిచే తెక్క లవిసి-పొగ రడఁగి
పడితి నతఁడు వను బెఱుఁగ ననె॥నిండి॥ ౪

ప్రాణములు మూఁడుదినములకు వచ్చి-పరగ శేషశైలవా
సునిదయ, నేను దెలివొంది చాలనగ సోముఁ డగ-మానిఁ
జేరఁ జని మొ్రక్కినఁ గని సం-పాతి నీ కీవిహూప మెటు వ
చ్చె మేను గృశించు టేమనిన జగతిలో-మీఱ రెఱుఁగని దేమి
సంయమిస్వామి,యైన వినుమని మదీయచేష్టిత-మంతయుఁ దె
లుప విని కడ, లేనియడ లూరియున్న న న్నూర-డించ ము
ని దలఁచె ననెఁ గపులకు ఖగపతి॥యింది॥ ౫

౯. పూర్వీరాగము-ఆదితాళము.

పల్లవి.—వినవె రామచరిత్రము, దాక్షాయణీ-వినవె.

అను.—మునిచంద్రుఁడా చంద్రమునకు-తనుఁ దెల్పురీతి సం
పాతి, యనియెఁ గపులతో శోకమూల మీ-తనువు తను
కారణము కర్మ మనుచు॥

నేను దేహి ననెడి బుద్ధిచేతఁ బురుషు-నికర్మమును. నాది
మయవిద్యవల్ల, నౌను కాఁగినయినుమువలె -దాను మాయా
యుతుఁడై వెలి,లోనుగుణమయమై యీ-మేను నేననిభ్రమసి
తేను తెలివి మట్టౌను-దాన సంసారమాయెఁ దానా యవికా
రి దురభి,మానమునఁ గర్మముల జేసి ఫలా-ధీనుఁ డగుచుఁ
జెడి తిరుగు జీవుఁడనె॥వినవె॥ ౧

యాగాదులు చేసి స్వర్గ-భోగ మొంది యాఫలము తోఁ

గా భువిపై బడి నరుఁడు-బాగా చతుర్విధభోజనస, రాగస్త్రీ
పురుష సం-యోగమున రేతోమయుఁడై, వేగమె స్త్రీగర్భ
ము-లోఁగాఁ జొచ్చి నెత్తుటఁ, దోఁగి యొకనాఁటఁగలల-మై
గట్టియై యైదునాళ్లఁగ బుగ్గవలెనై పదియవదినము-రాఁగ
మాంసపేశి యౌనని తెలిపె॥వినవె॥ ౨

పదియేనహముల కామాంసపు-పొది నెత్తుటఁ జొత్తిల్లు
నం,డమై యంకుర మిరువదియై-దుదినమ్ముల కుప్పతిల్లు నెల,
మొదలు తల మెడ మూఁపు వీఁపు-నుదర మివి యైదుఁ బొ
డముఁ గర,పదపార్శ్వకటిజానూరువు-లుదుకై యెసఁగు రె
న్నెల లా,ముదిత గర్భిణికోర్కె-విదితమౌ మూఁడవనెలను,
పొదలనంగసంధు లఖిలాంగుళము-లుదయమౌ నాల్గునెలల
కని పలికె॥వినవె॥ ౩

తెలిగన్నులు ముక్కుఁజెవులు బలువ-న్నెలచాలు నఖము
లైదవ, నెలఁ గల్గు నాఱవనెలను గర్త-బిలగుహ్యగుదములు
పొ,క్కిలియొదవు రోమ-ములును బెన్నెరులందముగను, మొ
లచు నాఱును నొక్కటౌ-నెలను ఎనిమిదవనెలను, లలితావ
యవోజ్జ్వల మౌన-స్ఖలితజ్ఞానియై జీవుఁ, డలరి మాతృభుక్తి
సారమైనవ-నెల మొదల్ సచేతనుఁడై కొను ననె॥వినవె॥ ౪

నానాయోనుల జన్మించి-నే నాఱుబిడ్డలకై, హీనవృత్తికిఁ
జొచ్చి-యైనను కుటుంబభరణమం,దే నామది నిల్చెఁ గల
లో-నైనను హరిని దలఁచనైతిఁ, గాన ననుభవించెద-నీనా
టిగర్భనరకము, నేను తొలఁగిన మఱచి-పోను హరి నని శిశు

వు, మేను కదలి వెడలు మాతృగర్భము-లోనుండి పదవనెల
హరి దయ నని॥వినవె॥ ౫

తానుబ్రహ్మానందా-న్వయఘనత త్త్వబోధాత్ముఁగాఁ,దనుఁ
దానెఱిఁగిన సజ్ఞాన-జనిత మగుమోహ మడఁగును, వినతా
పౌత్రా మది నిది జే-కొని తాలిమిఁ జెందు మనెమాని,యని
తా ఖగపతి వానరుఁ-గని తద్దయు మ్రొక్కి తెక్క,లనువా
ర వచ్చె శేషా-ద్రినివాసుని దలఁచిన గ్ర,క్కున భవాబ్ధి ఖ
లుఁడయిన దాఁటు భ-క్తులకు మీ కీవనధి యెంతని చనె॥వి.

౯. ముఖారిరాగము-అటతాళము.

పల్లవి.—కోరి శ్రీగౌరి భవ్యచరిత్రము వినవే॥

అను.—వారినిధి వానరముఖ్యులు-చేరి దాఁటుదారి గానక
యొకరొకరి మొగములు-సారెకుఁ జూచుకొనుచు దైన్య
ము, దేఱ నున్నవనౌకసులఁ గని-తారకోమపుఁడు వలికె
నల వేర్పడ గఁ॥గోరి॥

కడలి యిందివ్వఁగఁ-గడచి సీతను గని రాఁ-గలవాఁడు
వా డెల్లఁ, గడు ప్రాణబంధుఁ డా-ఘనుఁడె రక్షకుఁడు రా-
ఘవసుగ్రీవుల కెలమి చెల్ల, దడవు వలదు మీమీ బలములు-
నుడువుఁ డనవుడు మోహమునఁ గపు, లుడుగక పది మొదలు
దొంబది-యోజనములదనుక మే మీ,జడధి దాఁటఁగఁగల
మనిన విని-జాంబవంతుఁడు యువరాజుతోఁ బలికెఁ॥గోరి॥ ౧

మును త్రివిక్రమదేవునకు-ముయ్యేడుమా ర్లొనరఁ, బ్రద
క్షిణముల నొనరించినా నిప్పు-డొదవె వార్థకము దాఁటను

జాల శతయోజనములు, అనిన వాలితనయుఁ-డంబుధి దాఁటి
చనిన రాఁగలనో రాలేనో యనెను, అనఘ నినుఁ బొమ్మనఁ
దగునే మ-మ్మంపఁదగు దీవు రాజ,వని ఋక్షపతివలికె నం
గదుఁ-డంతఁ బ్రాయోపవేశము సుఖ మనెను॥కోరి॥ ౨

బలవంతు హనుమంతుఁ-బ్రస్తుతించ మితఁడు-గలుగఁ జిం
తిల నేటికిఁ, జలధి దాఁటి యీజానకిని జూచి రాఁ-గలఁడని
డాసి ముమ్మాటికిఁ, దెలిసి నిన్నెన్నఁ, దరమే నుముఁగావ-
వలసి పొమ్మనిలతనయ, పవనుఁడె, చెలఁగితో డగు నీ కను
డు నా-శీర్వాదము లెనసి చేసి, యలరించ బ్రహ్మపుత్రుని
గని-యాంజనేయుఁడు త్రివిక్రమువలెఁ బ్రబలెఁ॥గోరి॥ ౩

మారుతి బ్రహ్మాండ మగల నార్చి పలికె-నీరధి యుత్తరిం
చి, ఆరావణునిఁ ద్రుంచి యవనిజఁ దెత్తు నో-ధీరులార మే
లెంచి, ఆరాక్షసపతిఁగట్టి లంకతో-నే రామునిసన్నిధికిఁ దె
త్తునో త్వరఁగాఁ, జేరి త్రిజగన్మాతయైన-సీతను జూచి రానో
యనవుడు, బౌరుషము మీఁద నగు నవనిజఁ-బరికించి రమ్ము
నిరి కపు లందఱును॥కోరి. ౪

తుహినాద్రిసముఁ డత్య-ద్భుతస్వర్ణ వర్ణుఁడుమహితా,రు
ణాననుఁడు,అహికులసార్వభౌ-మాభదీర్ఘవాలుఁ-డనుపమయ
శోవిశాలుఁడు, అహితాంతకుఁడా-హనుమంతుఁడొప్పె-నా,
మహేంద్రాచలమ స్తకమునఁ జూడ, రహి మీఱ శ్రీమద
ధ్యాత్మ-రామాయణమునఁ గిష్కింధాకాండము, బహుళా
ర్థమది తెనిఁగించె సు-బ్రహ్మణ్యకవి శేషగిరిపతిపేరఁ.గోరి. ౫

కిష్కింధాకాండము సంపూర్ణము.

— —

శ్రీ ర స్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు.

## సుందరకాండము.

౧. సౌరాష్ట్రరాగము-ఆదితాళము.

పల్లవి.—శ్రీరజతాద్రిసదనా వేడుకొ-శేషాద్రిశుచరిత్ర వి సవిన.

అను.—మారుతి సాగరము శతయోజన-దూర మొకనిబ్బర మున దాఁటఁగ, గోరి యానందకందళితుఁ డయి-శ్రీరా ముని భజించి కపులఁ గాంచి, కూరిమి వనచరులారా క ను-గొనుఁడీ నన్ను లంకఁ జేర, భూరి వేగమునఁ జని జా నకిఁ గని-పొసఁగ వత్తు యశము దెత్తు మీకనియను. శ్రీ.

నేనుధన్యుఁడను ధన్యుఁడ హరిపద-నీరజముల మరలఁ గం డు నెవ్వం, డైనను మృతికాలమందు రాముని-శ్రీనామస్మ రణనొందు భవాం,భోనిధిఁ బుడిసిటియందు నడచి-మానిత మగఁ బరమపద మాఘనుఁడు, తా నొందు శ్రీజానిదూత నని ముద్రికచేఁ-బూనితి రఘుపతి నెమ్మదిలో, ధ్యానింతు నను వానీజడధి-దాఁటెద నని హనుమంతుఁ డరికృతాంతుఁ డు, పూని బాహువులు చాఁచి మెడ-పొడవుగ నిక్కించి

మీఁదు చూచి, మేను వంచి తోఁకఁ బెంచి పాదము-లూని
యెగసె వాని పొగ రేమి చెప్పుదు.శ్రీర. ౧

పోవుచున్న పవనాత్మజుబల మమ-రావళి చూడఁ దలం
చి సురసా, దేవికి నుపదేశించిపంపినఁ-బావని నది యెదిరించి
పెరిఁగిన, నాపీరుఁడు రెట్టించి ప్రబలె-నావెలఁది మఱియు బ
లియసూక్ష్మతనుఁడై పొంచి యా, దేవికడుపుఁజొచ్చి వెడలి
ననగె-ధీరుని గని మెచ్చి జయ మగు నని, తా వచ్చుట సతి
కిఁ దెల్పి చనె నతఁ-డావలఁ బోవ మైనాకగిరి డగ్గఱి, రావ
య్యా హనుమంతా నీ-రధి పనిచె నాయందు సుంత, నీవు వి
శ్రమించి పొమ్మన నిలక-నే స్పృశించి నేర్పు మించి పోఁ
దొడఁగెను.శ్రీ. ౨

ఎదుటను సింహిక యనురాక్షసి ప్లవ-గేంద్రుమైనీడ మ్రిం
గి త్రోవ, గుదియించ నతఁ డెఱింగి తనఘన-పదమునఁ ద
న్నినఁ ద్రుంగి కెడసె, నది గని గరుడునిభంగి నభమునఁ-
బొదలుచు హరిపతి యుదధి దాఁటెను బొంగి కడు, ముద
మునను సువేలాచల మెక్కి- య-ద్భుతమతియై శ్రీలఁదనరి
మణి,సదనగోపురప్రాకారసౌధో,జ్జ్వల మౌ దాని లంకారాజ
ధాని, కుదురు గని మెచ్చుచుండఁగరవి-గ్రుంకెఁ దన్నొరు
లెఱుఁగకుండఁ, గడసి వాయుజుఁ డణుమాత్రుఁ డయి లం-
కాపురంబుగోపురంబుఁ జేరి నిలిచె.శ్రీ. ౩

లంకిణి యనురాక్షసి యనిలజుఁ గని-లావు మెఱసి పో
క యోరి, కొంకుకొనరు నింత లేక పోయెదు-లంకిణి నను

గ్గైకోక నాసరా, యింకనైనఁ జెడిపోక యెవఁడవు-మంకుత
నము మాని కలరూపు చెప్పు మని, జంకక యరచేత నది
యడిచిన-సామీరియు భూతతతి బెదరగా, బొంకపుపిడికిటఁ
దానిఁ బొడిచిన-భువిఁ బడి రక్తము గ్రక్కుచు ముక్కుచు
రామ, కింకర పతి నీపాదముల కీదె చెడు-లంక యింక మీఁద
బంకజాసనుని వాక్య మదె యనుచుఁ-బడఁతి రామకథ వి
రామ మింకక తెలిపె.శ్రీ. ౪

రావణునంతఃపురమునఁ గ్రీడా-రణ్యమున నున్నది సీత
రాముని, పావనస్మృతి సంజాత పూత నా కీ-వఱకు సుకృ
తముచేత నినుఁగంటి, శ్రీవరభక్తవ్రాతాగ్రణి నీ-సేవ గల్గె
నే ధన్య నోజయశ్రీసమేత రామ, భూవిభుఁడు నామది రం
జిల్లఁగా-కీవేళ నని మదిని దివి కది చనె, నావారిధి యం
జనాసుతుఁడు దాఁటి-నప్పుడు ధరాసుతకు నాదశగ్రీవునకు,
శ్రీనిలయకారణములై యదరె-నౌవామభుజాక్షులు ధ్రువ
ములై, వేవిధముల శుభసూచకమై రఘు-వీరుదక్షిణోరు వ
క్షమెయదరెను.శ్రీ. ౫

౨. కేదారగౌళరాగము-అటతాళము.

పల్లవి.—నలిననయనుకథాసుధ నప-స్త్రాక్షత్రాంజలులఁ గ్రో
లవే.

అను.—బలియుఁడగు ననిలతనయుఁ డా-వల లంకలోఁ జొచ్చి
యిలాసుతవిలాసతనువల్లి-నెల్లచో నరయుచుఁ దిరిగెఁబురి.
రావణునంతిపురమున కేఁగి జనక-భూవరాత్మజ నందుశో

ధించి వినువక, దేవకిన్నరమరున్నాగ-స్త్రీలు చెలు నున్నకడ నారసి యందుఁ, బావని త్రిలోక పావని నృప-దేవిఁ గానక లంకిణీవాక్యము దలంచి చనె రమ-ణీయ మగు నశోకవనము నకు.నలిన. ౧

రతనంపుమెట్టుల-రంగైన బావులు-రాజిల్లువిరితావులు దేవతాశాఖ, తతుల నతులముగ-జత లగుఖగ-రుతముల కలరు లేడిపిల్లలతీవులు, అతిమృదులమధురఫలభరన-మ్రావనిజ శాఖాలఁ, కృతస్థలులఁ గని మారుతి య-ద్భుతమతి వెదకె క్షితిసుత నచట.నలిన. ౨

అందమై హృదయా-నందమై వనలక్ష్మి-చందమై ఘనమైత్రి గల సుకృతిగతి మి,న్నంది శతశాతకుంభ స్తం-భాన్వితంబగు మేడ గని భూపుత్రి, అందు లేకున్నఁ బోయి మరు-న్నందనుఁడు తిలకించె, ముందరను శింశుపావృక్షము- మొదట సీతను లోకమాతను.నలిన. ౩

దనుజాంగనలమ-ధ్యమున నున్నదాని శ్రీ-తరుణివలె నొప్పు దాని దీనతయు జడగ,ట్టినకురులు నుపవాసములఁ గ్రుశ్సిన మేను మాసినచీర గలదాని, తనుఁ గావ విభుఁడు రామికి నెంతయు వగఁ గన్గవను జడిగొను బాష్ప,కణములదాని రాముని నుడువు-పడఁతిఁ గనెఁ గపిపతి.నలిన. ౪

అవనిజఁ గంటిఁ గృతార్థుఁడ నైతి రా-ఘవుపని నాచేతను సాధింపఁబడె నని, భువికి దిగుతఱి నగరివెలుపలఁ-బుట్టె నాకకలకల మదియుఁ గని నేను, రవికులునిసతి నలరింతు న

ని-పవమానసుతుఁ డుండెఁ,-బవళించి రావణుఁడు కల రఘు-
పతి భటుని వానరుఁ గని లేచె.నలిన. ౫

ఇది దుస్స్వప్న మని క్రీడావనికి దశ-వదనుఁడు రాఁ గాం
తాళత, పదకటకములరొదలు విని నిశిచర-పతిఁ గనిబలుదిగు
లునసడఁగి తలవంచుక చింతా,పదమైనమది శేషశిఖరి-సదను
డా శాముని గదియించి చిత్తరుప్రతిమవలెఁ-గదల కిట్లుండె
నళికి కలికి. నలిన. ౬

౩ బేగడరాగము-ఝంపాతాళము.

పల్లవి.—వింటివా నీ రేజపాణి వాణీ-వినుతగీర్వాణీ భవానీ.

అను.—తుంటవిల్తునిబారి తారి సురవైరి-తుదిదైవమాడిం
ప వైదేహిఁ జేరి వా, ల్గంటిరో యింకమీఁద దయరా
దా-లలిత మగునీకటాక్షవీక్షణమున నన్నుఁ, గంటివా
పట్టంపు రాణిఁ జేతు వరింపు-దంటతన మేలనే బాల
తాళఁజాలననె. వింటి.

పేదమానవుని రాఘవుని నమ్మి యతఁ-డే దిక్కని త
లంచెదవు నీ, బోధ కేమందు నేమందువిభుఁ డిందు-రాఁ
డలఁచినాడేమోకాని కపులగుములందు, సాదై నృపుఁ డు
న్నాఁ డనివిన్నా-సత్వహీను నభిమానహీనుని గుణహీనుఁ,
నాదరింపకు నీవు మునుపటివలె నెంచినావు-లేదతని పొందబ
ల ననుఁబొందుమనె రావణుఁడు. వింటి.

దశముఖునిపలుకు విని సీ-త పలికెఁ ద్రుణ మంతరువు
గాఁ గొని కినుకచేత, దశరథసుతున కళికి కాదా యొక బీ

ద-తపసివై కన్నొలఁగి ననుఁ దెచ్చుట కిర్యాడ, పస హా విన్ను డక్క గొనుచెక్క-వెన ననుభవింతు వాఫలంబు రామబాణ, విశకలాంగుఁడవై లయ మొందుతఱి నృపాల-శశి నతిఁగెద పురథి దాఁటి వచ్చి పొగరడంచు ననె. వింటి. ౨

పిడుగులకన్నఁ గడిఁదిఁగాను మాట లను-పడఁతి నసి గొని వేయఁ బూను, దుష్కురక్కసులవొర నెదిరి మందోదరి-తొఁగలేని చెలులు పదు వేవు రున్నాడు మఱి, గడుసరి యిది మనుజాంగన దనుజా-గ్రిణి దీనిపైఁ బ్రేమ మాని పోదము రమ్మ, నుడు ద్విమాసముల నాపొం దొల్ల దేని దీని-యొడలు కావలివారు తినుఁ డని చనియె రావణుఁడు. వింటి. 3

అవనిజను స్వకర్జముల బెదరించి-రసురాంగనలు బహువిధముల, సవినయముగఁ బల్కఁ డీసతికి రఘుపతికి-జయమైరావతము నెక్కి రామలక్ష్మణు లిచ్చిటికి, వచ్చి, తవిలి లంకగాల్చి యరిఁ గూల్చి-ధరణిజను గొని యయోధ్యఁ జేరఁగఁ గల గంటి, విపసనుండై త్రైల మంటిఁసగుంట గూల-విఁశతిభుజుఁగంటి నిది తప్ప దని త్రిజట పలికె. వింటి. ౪

లంక విభీషణుఁ డేలఁ గంటి జానకి రా-మాంకమున నుండఁ గలఁ గంటి. నింక భూసుతకు వలగొనుఁడీ మే లనుఁడీ యను-నింతనుడి విని మొక్కి చెలులు నదిర్చి రలజడిఁ-బంకజాక్షి సీత శ్రమచేత-వడియెలుం గత్తి యేడ్చె ఘుంటారవంబునఁ, గొంక కీతఱి శేషగిరిరాముఁ డభిలాష-గొని

రా నిదేమి తనువని త్యజింప నూహించెను. వింటి.

౪. నాటకురంజిరాగము-ఆదితాళము.

పల్లవి.—వినురఘువరుచరితముపార్వతీ-వినుతమేచకాకృతీ॥

అను.—హనుమంతుఁడు జానకితో భాషింపంగ-ననువొతతి యిది యని తాఁ బలికెను. విను.

భానువంశ్యుఁడు దశరథుఁ డనునృపుఁ డిలఁ-దనరు నాదొరకు నల్వురు, తనయులు రామలక్ష్మణభరతశత్రుఘ్న-లను వారలు రాముఁ డగ్రజుఁ డానల్వురకు, జనకాజ్ఞ నడవి కేఁగి సీతాల-క్ష్మణులతోఁ బంచవటి నుండ రావణుఁడు సీత, నినకులులను వంచించి కొని-చనె వెదకి జటాయువుఁ గాంచి జనపతిఁ జూడ నేనుసుగ్రీవుచెలిమి-గని వాలిని గీటడంచె నని మారుతి. విను.

వైదేహి నరయ నాల్గుదిక్కులకు-వానరులను బంపఁ గొందఱమేము, ఈదెస వెదకఁగ వచ్చితి ముందు నే-నీవారిధి దాఁటి లంకఁ జొచ్చి తిలకింపఁ నాదుభాగ్యరమ యన నశోకవని-నవ్వృక్షంపుపాతరువుక్రింద నాతల్లి, నీదేవతామతల్లిఁ దనునిం-దితహైరణ్మయవల్లి, నే దర్శించితి సీత నను మాట-మేదినీసుతవిని మహాద్భుత మొందెనెద. విను.

మిన్నుమ్రోఁతయో పవనునిపలుకో-కన్నకలయో నేను రామకథ, యెన్నాళ్ళకు వింటిఁ గర్ణామృతముగ-నెన్నఁడు నిద్ర లేదు కల గాదు సత్య మైతేను, కన్నులయెదుటఁ బ్రసన్నుఁడౌఁగా-కన్న మ్రాను దిగి వచ్చి మ్రొక్కె, [illegible]న్నపి

చ్చి కంతటివాఁడై-వినతారుణముఖుఁడై యచటివా, రె
న్న నంజనాసుతుఁడ శేషాచ-లేశుఁడైన రామునిదూత నే
ననెను. విను.

౫. శహానరాగము-త్రిపుటతాళము.

పల్లవి.—వినవే యాననజితచంద్రబింబ హేరంబ-జనని వర
స రసగుణమణినికురుంబ.

అను.—జనకసుత చిఱుతతను వొందినహనుమం-తుని గని
రావణునిమాయ లని పలుకక యుండె. వినవే.

తల్లి నే మాయఁకుఁడ గాను నానందవల్లి గుణములపాల-
వెల్లినాయం దరమరలు మాను మిఁకను వింత సేయఁ-జెల్లు
నాకోసలపురీధాముఁడై తగు, నల్లశ్రీరామదాసుఁడనుమారు
త సుతుఁడ-నల్ల సుగ్రీవుని మంత్రి నేను, కల్లగా దంచు నం
జలి యొనరించు-కపిఁ జూచి సరవానరుల కెట్లు పొందగు న
నె సీత. వినవే.

మాయమృగ రావణుఁడు నిర్ గొని చనిన-చాయ వెద
కుచు నృపుడు, బోయచెలిచే నీతెఱఁగు విని పఁపకడ నృ
సింప, రాము బార మంపె నను సుగ్రీవుఁ డచటికి-బ్రహ్మ
చారినై చని వారలయభి, ప్రాయ మెఱిగి-రాకొమరులఁ
దెచ్చితి, నాయెనరవానరేంద్రులకుఁ జెలిమి ఖలుఁ-డౌ వా
లిని రాఘవుఁడు చంపె ననె నంజనాసుతుఁడు. వినవే. ౨

మాత నిన్నారయ గపుల బంచి నీచేత నన్నియు నగు
ను. ఖాతాత్మజ మనలక్ష్మణుని మేలు నా సేమము దెల్పి, సీ

తాపతి కిమ్మ్న ముద్దుటుంగర మని హరి యొసగ-జేకొని ప్రి
యత్నమున దెచ్చితి నృపతి, చేతిముద్రిక యని-సీత కత
డిచ్చెను, ప్రీతిచే గొని శేషాద్రిశుడా రామ-విభురామాం
గుళీయక మౌదల దాల్చెను సీత. వినవే.

౭. యదుకులకాంభోజిరాగము-అటతాళము

పల్లవి.—రామదాసుడ వౌ డీవు హనుమంతా-రావయ్య
యనె గాంతా.

అను.—క్షేమమా సూర్యవంశాంబుధిపూర్ణ-సోము డైన
శ్రీరాముడు ఆలక్ష్మణుడు. రామ.

ప్రాణదాతవు జగత్ప్రాణకుమారా- భూనుతవిహార పుణ్య
విచార, మానితకల్యాణక్షోణిధరాకార- మహితానందసారా
కంటివా నాయుడుములు భూనాథునిదయ-రా నామనవి పవ
మానాత్మజ తెలువు, మానాథు నే నాడినమాటల-కలుగ
వల దని నామజదితో, భానుసన్నిభునితో దెలుపుము-పర
మధార్మికత ధారుణి విలసిల్లుము. రామ. ౧

గడువు రెన్నెలలదాకా హరిరా కున్న-జెనుగురాక్షసులు
భక్షింతురు నన్నా, అడి సేయురావణుని-మడియించి జ
యము గొన్న, గడు కీర్తి యున వన్న పతితో-దడవు వల
దని, నుకువు కరి తుంగమడువు జొచ్చిన-వడువునను లంక,
పడి జొచ్చి దానవుల (వచ్చియ-వార్యత ఖగేంద్రు డమృత
ము గొను, కడక రాముడు నన్న గొని చన-గా బ్రియత్న
ము సుయత్నముగ జేయు. రామ.

నాచే నీయునికి విన్నపుడె సానుజుడై-రాచూలి వచ్చి రావణు దునిమించి ఘనుడై, యేచి యయోధ్యకు నిదె నిన్ను గొని చను-నింద్రాదిసురనుతుడై యన, నో బాలకనీ వెట్లు దాటితి వబ్ధి-నిక వా రెట్లు దాటుదు రనిన, ఓచంద్రముఖీ రాఘవుల నా-మూపున వహించి తెత్తునిటకు, నాచేతి కానవాలి మ్మనినను-నమ్మి నెమ్మి జూడామణి యొసగె.

శ్రీరాము డొకనాడు-చిత్రకూటగిరి-జేరి నాతొడలపై-గూర్కి-యున్నతఱి, మీాఱి యొకకాకి యా-మిష మని నాకాలిబొటన వ్రేలి జింపెను డగ్గఱి నిద్ర, దీరి మారీచవైరి కాకిపై-బూరి మంత్రించి కేరి యేయ శరమై, కారింప ముజ్జగము దిరిగి-కావు మని రాముని వేడగ, న్నీరు నీరధి సమము గాదనక-న్నిచ్చి చనె నది యెఱుకసేయుము పతికి. ౪

చిఱుత వీరక్కసుల-చిక్కుల బడక-జరుగ నెట్లగు ననిన-జనని నానడక, యెఱుగవు మి న్నంది-పెరిగెద భయముపడక-వీక్షింపు మని కడక దెలియ, హరివీరుడు దాల్చె-నరి వీరభయంకరవిగ్రహము శ్రీహరి విష్ణుడు త్రివిక్రమకీరమును, ధరించు తెఱంగున-ధరణీధరాభ మగు సీతను, వరయ నాతరమె శేషాద్రీశ్వరుని రఘు-వరుని జేరగ జను మింకను. రామ.

౬. సారంగరాగము-ఆదితాళము.

పల్లవి.—రఘుప్రవరుచరితము-రాజముఖి సఖ వినవే.

అను.—అఘప్రహారి యాహనుమంతు-డవనిజాతకు నమ
స్కరించి వన, విఘట్టనమునను గాని కామసుర-విపక్షు
నిన మక్షమనుచు దలంచె.రఘు.

ఫలములు డుల్చి విరుల్ రాల్చి తరు-పంక్తులు పడగూల్చి
యళి, కులము జోపి పెరలు రేపి వాపీ-కూపజలములయడు
సు పైకి దేల్చి, అలచి త్తరువుమేడ మరు త్తనయు-డాగ్రహ
మున దన్ని నేల గలిపిన, నెలమి వారు రావణుని కెఱిగింప-
గెరలి లక్ష రాక్షసభటుల బనిచె.రఘు.

దండిమగలు గండు మిగిలి రా గని-కుండె లగుల నార్చి
గదా, దండము గొని ఖండించె నగచరా-ఖండలు డది విని
యమరారి పేర్చి, మండిపడి పంచసేనాధిపతుల-జండకోప
కాండ చాపధరులై, దండనాథు లెదుగ గా గపి, జము-దం
డ కనిచె వారి రావణుం డులికె.రఘు. ౨

దశముఖుకు సప్తమంత్రికుమారుల-దగువీరుల బంప వా
రసముశూలభిండివాలకరవా-లాదిసాధనముల ననిలజు నొంప
ననమానబలాఢ్యులై యీశ్వర-నుగసిమసంగి తోరణ స్తంభ
మున, వెస నుండె హతశేషులవలన వినియసురేంద్రు డక్ష
కుమారు ననిచె.రఘు.

కతులు హారులు నరదములు భటు లసం-ఖ్యాతము లేతే
రబం, ధురక్తృపాణతనుత్రాణసబాణ-తూణధనుర్ధరుడై యే
పు మీఱగ, నరివీరు డన నేగి యక్షుడు-శరముల నొంప
మారుతి యలిగి ముద్గరముచే వ్రేసి యతనిజంపి సై-న్యము

ను ద్రుంచె రావణు డదియు విని.రఘు. ౪

కనుల నశ్రుకణములు నెలుగున-గద్గదిక యడరగాను రా,
వణు డింద్రజిత్తు గని గజిబిజిగా-వానరు డొక డింతచేసితే
ను,కని సహించు టెట్లు వాని జంపెద-ననిన దేవ నీవు పోవ
నేటికి, వనచరుని బట్టి తెత్తు నిచటి కని-చనియె మేఘనా
థుడు సేనతో.రఘు.

వాలు పలక గద విల్ తూపువ-జ్రాలజోడు దాల్చి ర,
త్నాలసౌరు దేఱు తేరు ధీరో-న్నతి నెక్కి చని సామీరి నద
ల్చి, వాలమ్ముల్లై దెనిమి దాఱు నొకటి-ఫాలహృదయప
దవాలమున నసుర, గీలింప గనలిగరుడు డన నెగసి-కీశవిభు
డు గూల్చె రథరథ్యముల.రఘు.

ఎంతవాడు వీడని వేలోకతే-రెక్కి బ్రహ్మాస్త్రము దను
జ, కాంతు డేసి యంత డాసి యతిధీ-మంతు హనుమంతు
బంధించె క్షణము, సంతత మెవని బేర్కొనినజను ల-జ్ఞాన
కర్మ బంధములూడి ముక్తి, గాంతు రట్టి శేషగిరీశు డగురా-
ఘవ దాసుని కితరబంధము లెంత.రఘు. ౭

౫. గుమ్మకాంభోజిరాగము-అటతాళము.

పల్లవి.—నారీమణి వినవే యీకథానరణి.నారీ.

అను.—ఆరాక్షసేశ్వరుపట్టితేర గట్టబడి వచ్చువాని న,నీ
రాత్మునివలె బురము గనువాని-వీరహనుమంతు గుద్దు
చు, బాకులు చేరి రా-బ్రహ్మాస్త్ర మొకక్షణము తను
వంటి చనుట, వీరుడెఱిగియు గార్య-గౌరవముచే,నూరక

చనియె బేరోలగమున-నున్న దనుజవిభునెదుట రావణి యిడె నతని.నారీ.

పూని బ్రహ్మాస్త్ర-మున గట్టువడె వీను-మానులు విఱి చె,వీనిచే దనుజుల్ కారాకులు గాలి-చే నౌరలుగతి బడి రనే కులు శా స్త్రి, వీని కెయ్యదియో వివేకులు చెప్పిన-దానిఁ జే యింపు ముల్లోకులు మెచ్చ, గానీ వనిన నుతుమాట లంకా-జాని విని ప్రహస్తు డనుమంతుని, తేరి జూచి పలికె వీ డె వ్వఁడో-తా నిచ్చటికి వచ్చు టెమో క్రీడా, కాననము బెఱు కు టేమో-కాక సుభటుల జంపు టేమో యీ,వానరుని న డుగుమన-వాడటులేయడిగి వనచర, నేను విడిపింతు నిన్ను భయము-మాని నిజ మాడు సభలో ననె.నారీ,

రావణా లోకత్రియవి-ద్రావణ వినరోరి సకల, జీవహృ దయస్థుడై మిఱి దేవ-దేవుఁడా శ్రీరామశౌరిపాద, సేవకు డను రా సురారి మారా-మానవేంద్రునినారీమణిని, నీవు శునకము హవిస్సు గొనుగతి దెచ్చినావు ఇట్లా యేలరా చెడి పో,యేవు ఇంక నాబుద్ధివింటె బ్రతి-కేవు రఘుపతి ఋష్యమూ కమున సు,గ్రీవు డనుకపిరాజుతో జె-లిమి చేసి యొకతూపున, వాలిఁ జంపి కపులకుఁ బతి-ని జేసి రవిజుని కపి, దేవుఁ డవ నిజను జూడ నంపఁ-గా వచ్చితిని బవనజుండ ననె॥నారీ॥ ౨

కంటిరా తమ్మి-కంటి సీతను.సేనతోడ నీతోఁటఁ గూల్చి తిఁ,గొంటుచేష్టల-కోఁతి నౌటఁ జంపెద, నంటవచ్చి చచ్చె నే-నాపూటా అన్నిటి, కంటె మెప్రియ మను మాట వినవే

వింటి నీకొడుకు నన్ను సాధించె-నంట పొంగినావు
బ్రహ్మాస్త్రము, ఒంట నంటి చనె నీకుఁ బ్రియముఁ జెప్పె-
నంట బంధునివలె దయచే వచ్చితిఁ, గంటకపుమతి త్యజిం
పుము జ-గముగతి విచారింపుము, బంటుగొన మెఱుక యది
ము క్తిదము-పౌల స్త్యతతులనీ, వంటివాని కసురత్వము తను-
వాత్మా నెన్నుట ననె నతఁడు॥నారీ॥ ౩

మేనుకంటెను నే నన్యుఁ డనిన యెంచి-తేనిపరాపరమైన
వస్తు వౌదువు, గా నీవరయఁ బ్రాణబుద్ధీంద్రియదుఃఖ-శ్రేణి
లే దజ్ఞానమె మూల మని, దీని దెలిసితే నీకు మేలు కడ-
లేని దీవిగతిగాను దనువు,లో నీవున్నా వంట-యేను తనసం
సృతి బంధ మగు నది, మాను చిన్మాత్రుఁడ నజుఁడ నతు
రుఁడను-ఆనందస్వభావుఁడ ననరా, మేను ప్రాణము మనసు
మతి మొద-లౌనివి భూమిమరుదహ మిక ప్రకృతివికారజాత
ము, లౌ నం దెనయఁడు నిరభిమాని నిరుపాధికుఁ డీశ్వరుడు-
తా నని యెఱుంగ ఘనుఁ డగు ననె॥నారీ॥ ౪

దశముఖ సావ-ధానమతివై యొకటి వినరా ము క్తి, వెస
నబ్బు హరిభక్తిఁ గనరా దాన, నిశితజ్ఞానము గల్గి మనరా
ధ్యానా, భ్యసనమునను సోహ మనరా దాన, ననమాంభవ
ము చేకొనరా యోరి, దశరథాత్మజుడు ప్రకృతికంటెను బ
రుఁడు-బిసరుహాక్షుడు విష్ణుడు శ్రీదేవి, వసుంధాపుత్రి యాచెలి
మున్నిడుకొని, రత్నసమూహముతో వచ్చి యిచ్చి శరణను
వాసనీవె యపరాధి నను మతఁడు శరణాగతప్రియు, డొసఁ

గున భయము శేషగిరివిభుఁడు అని పవనసుతు డమ్ర్ము, తసమూనముగ బల్కు-పల్కు-ల-కసు రేంద్రి డలిగి నలిరేగెను॥నారీ॥

౯. కర్ణాటకసారంగరాగము-ఆదితాళము.

పల్లవి.—తరుణీ యీచరిత్రము-సరణి సుజనాదరణీయము॥

అను.—ఇరువదికన్నులను రోషానల-మిరనై ప్రజ్వరిల్లను రావణుఁడు, హరిదాసుని హనుమంతుఁ గని వన-చరాధమా నిను ద్రుంతు సీతను వధింతు, తఱిమి రామలక్ష్మణుల-నరిమురి జంపి కపికులాగ్రిణుల, తరణిసుతాంగదాదులబొరిగొందు-ధరణియందుయశముగందునని యెను॥ తనూజుకోట్లరావణకీటములు నాతో-ను సమానమా సురారి నేను, శ్రీరామదూతనై మీాఱినాను నా-పేరు హనుమంతుఁ డొక,సారి గుర్తిద్దితేనోరి నీపని దీఱు నీవు నీ-వారు నా కెంతమాత్రమురా దోసకారి యని, మారుతిపోనాడిని కిన్క-చే-నారాక్షసచూడామణి యాతిక్క-, దారికోఁతి కండలు తెగవ్రేసి భూ-తములకు బలిసేయు డని సెలవీయ, జేరిచంప గడగెడుభటుల ని-వారించి తనయన్నను గని, సారభాషణు డైన విభీషణుడు-చారు లెందు నవధ్యు లంచు రనెను॥తరుణి. ౧

వానరు జంపుట పాప మదిగాక వార్త లెవరు దెలుపువారు వీని,చే నింతయు విని రాగోరు శ్రీరామ భూనాథునితో బోను వేవేగ,మే నీకు జేకూరు నోదానవేంద్ర వీనికిఁ దగినశాస్తిమీారు సేయ, గా నియమింపు డన దమ్మునినుశి

తా నెద నిడి రావణాసురుడు కపుల, ప్రాణపదము తోఁక య
దికాల్చి వీనిఁబోనిండని పల్క దనుజభటు లల్క, మానక య
నిలజు గట్టి బహువస్త్రచయము తోఁకకు జుట్టి, నూనెలో
నద్ది వహ్నిఁదరికొల్పి యానగరమందు ద్రిప్పి రేమఁదు. ద.

పావని చిఱుతమే నొందె నంతనె వదలె బంధముల్ ఘన
తనుఁడై తనవెంట వచ్చు, కావలివారల ద్రుంచి యింటింట
నిజవాల దావాగ్ని బెట్టి బూడిదపెంట జేసె బుర, మావిభీ
షణు నిలు వినా మంట తోఁకనంటక, పావకుఁడు చల్లనాయె
గరు వలిచెలిసీతాస్తుతి గంట గపిపతి, యావసథిలో లాఁగూ
లము ముంచి చల్లార్చె నేవిభునామము మూలము దెలిసిన జ
నులు, పావనులై తాపత్రియానలము బాయుదు రారఘువ
రుభటు డీవైశ్వానరుని, చే నగునే తత్క్షణము చవి సీతాసతి
కి ప్రదక్షిణము, గావించి మ్రొక్కి రామసన్నిధికి దేవి సెల
విమ్మనిన బలికె గొమ్మ. తరు. 3

నిన్ను జూచి యూఱడి యుంటిని నేనెట్లు నిచట నిర్వ
హింతు ననిన, గన్నతల్లి మూఁపున ధరింతు రామునితో ని
న్ను గూర్చి వినుతి గాంతు ననిన మ, రున్నందనుని భక్తిమం
తు గని విను మన్న నే నేవగనై నా ప్రాణముల్ ధరింతుని
వావా, సాన్నిధి యుంకించియైన బంధించియైన రాముఁడు వ
చ్చి యనిలోన దశకంఠు జంపి, నన్ను జేకొనిన గీర్తి యం
దాక మిన్న కుండు బొమ్మా హరి దోడితెమ్మా, యన్న
నాంజనేయుడు చని సువేలాచల మెక్కి యార్చెను విని,

మెన్ని రంగదజాంబవత్ప్రముఖులు ఇది వాయుసుతుని విజ
యనాద మని. తరు. ౪

తరుచరపతి చరణము లూనినతఱి గిరి ధరిత్రికి సరిగాఁ
గ్రుంగి మెగురు, తఱి ముప్పది యోజనముల్ నింగి కెగరె సా
గరము దాటి ఖగరాజుభంగి మహేంద్రి, ధరణీధర మెక్క
ను బొంగి సామీరిని నరసి కౌఁగిలించిరి యంగదాదులు చె
లంగి పోయివపని, నెఱవేతెనా యనిన మీాకృపచే గంటి ధ
రణిజ నని నడచిన తెఱ గంత దెల్ప, హరివీరు లనిలజుని కొ
నియాడిరి యానందమున నాడిరి తోఁకముద్దాడిరి, పఱచి మ
ధువనమునకు జని మధు ఫలము లడుగ శేషాద్రిపతి, కరుణ
గలుగ ఫలంబుల కేమీా యని మరుత్సుతు డిచ్చె సెల వెల
మి హెచ్చి. తరు. ౫

౧౦. నవరోజురాగము-ఆటతాళము.

పల్లవి.—సరిగా రీసచ్చరిత్రము వినువారి కరయ నెవ్వారిల
ను గారీ.

అను.—తరుచరు లమ్మధువనపాలకుల నెన్నక తేనె లాని
ఫలములు గొని కాపరుల, జరణతలతాడితుల జేసిన వె
ఱచఱచి దధిముఖాదులు చని, తరణిసుతున కెఱిగి వన
భంగ సరణి దెలిపిన నత డెక బొదలె. సరిగా.

చూచి వచ్చె హనుమంతుడు సీతా సుందరీమణి నీనా
మధువన, మాచెల్వమున జొచ్చి రనురవిజుని మాట హరి
వీను లలర విని, నాచెవి కవనిజ చేరొక్కనిన ట్లున్నదనిన నా

నోమహాత్మా, రాచకార్యము నెఱపి హనుమ త్ప్రముఖు లిదె
వచ్చి రన పిలువ వ, నేచరుల నంపఁ జని మిముఁ గపి-నేత
ముదమున రమ్మనె ననిరి॥సరిగా॥ ౧

మిన్ను ముట్టి యాడుచు వానరులు మ-రున్నందనాంగ
దుల ప్రాపున రాము,సన్నిధిఁ బెన్నిదిఁ గన్నట్లు గని మ్రొ
క్కి-రున్నతి మదిఁ బొదలఁ, జెన్నలరఁ గంటి సీతను లోక
మాత మీ-సేమ మరసె రామచంద్ర రాజేంద్ర, విన్నప
మశోకవని జానకి-యున్నది కృశించి జడ గట్టిన, పెన్నెఱుల
తో రామరామా- యన్న నుడితోడ నని మారుతి॥సరిగా॥౨

నేను శింశుపాతరుశాఖలనుండి-నీకథ వివరించిన విని భూ
పుత్రి, వీనుల కమృతసమానముగాఁ ;బలుక-వీఁ డెవ్వఁ డని
యెంచిన, మానవతీమణియెదుట వానరశిశువు-నై నిలిచి
మ్రొక్కి- నమ్మిక పుట్టునట్టుగాఁ, బూని యాద్యంతములు తే
టము-గా నెఱుఁగఁ జెప్పి ముద్రిక విభుఁ, డానవా లంపిరని
యొసఁగిన-నంది మిన్నందె ననెఁ బావని॥సరిగా॥ ౩

నను నమ్మి మాయమ్మ వల్కె- రా-ముని కెట్లు నామీఁద
దయారసము, జనియించు నట్లు విన్నవించు నాయిడుములు-
గనిన వాఁడవుగావా, అనిన రాఘవుఁడు నిన్నెడఁబాసినది
మొదలు-హా సీతా యని శోకించుచున్నాఁడు నేఁ,జని నీయు
నికి దెల్ప నృపుఁ డను-జార్కసుతయుతుఁడై కపులఁ దో,డ్తో
ని వచ్చి యరి వ్రచ్చి నినుఁ జే-కొను నంటి నని నంజనీ
సుతుఁడు॥సరిగా॥ ౪

ఆనతీవమ్మ రామునియొద్ది కన నభి-జ్ఞానార్థముగఁ జూడా
రత్న మొసఁగి, ఆనాఁడు కాకము మన మడఁచుట దెల్పు-
మనె సామి నీతోడ, నేను నామఱఁది లక్ష్మణుని దుర్భాష
ల-జ్ఞానమున నంటి నది శమింపు మని, ఆనెఱఁత కన్నీరు ము
న్నీ-రన నించ నూఱడించి ఘనో,ద్యాన మగిలించి యక్ష
ముఖ-దనుజుల వధించితి నని నతఁడు॥సరిగా॥ ౫

కొంకక రావణుఁ గాంచి భాషించి-లంకాపురిఁ గాల్చి
సీతాజ్ఞచే, బొంకముగా వచ్చితి రామ నీపాదాం-బుజము
లౌదలఁ దాల్చి, కింకరుఁడ దయఁ జూడు మని వాయుజుఁడు
ప-ల్కిన రాఘువేంద్రుఁ డానందసాంద్రుఁడై, పంకజభవా
దుల కశక్యము-పవనసుత నీకే తగు నీపని, నీకొరులు సాటి
గా రని కది-యించెఁ గౌఁగిట రాముఁ డనిలజు.సరిగా. ౬

పరమాత్ముఁడ నౌనా పరిరంభణము దుర్లభము విను సా
మీరి యనె నెవ్వని, చరణాబ్జయుగళతులసీదళమ్ములఁబూజ
సలిపిన శ్రీమీఱి పరమపద మందు,ను రారామునిచే నాలిం
గి తుఁ డయ్యె హనుమంతుఁ డేమందు, గరిమ నధ్యాత్మరా
మాయణ కావ్యమున సుందరకాండ మిది, యరసి తెలిఁగిం
చె సుబ్రహ్మణ్యకవి శేషగిరీశుపేరిట. సరిగా. ౭

సుందరకాండము

సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు.

## యుద్ధకాండము.

౧. భైరవిరాగము-ఆదితాళము.

పల్లవి.—శ్రీరాజరాజేశ్వరీ యీచరిత్ర మార్యనుతిపాత్రము॥

అను.—చేరి దాశరథి మోదము మది మీఱ దయాశరధి
యై పలికె, మారుతిచేసినపని దేవతలచేఁ దీఱ దొరుల
తరమె సాగర మె,వ్వారు దాఁటువారు లంక యెవ్వరికిఁ
గాల్చిరాఁ దీఱు సా,మీరివలన నేను రఘుకులము సౌ
మిత్రియు రవిసుతుఁడును బ్రతుకఁ గలిగె ననె. శ్రీ.

ఈ సుగ్రీవునిభాగ్యమహిమ నుతి యింపఁ దరము గాదు
కడలి నక్రాహి, వైసారిణములకు పాదు ఇది దాఁట నేసరణి
నో నిఁకమీఁదు రావ,ణాసురు గెల్చి యెట్లా సీతఁ జేకొన
నగు నిదేటివాదు, మోస మాయె బలా యనిన రాముని
గని ప్లవగకులాగ్రణి పలికె, నీసముద్ర మెంత రావణుఁ డెం
త యేమిటి కీచింత గెలుపు వింత, నీసరి లేరవని విల్లుఁగొని
నిల్వ నిన్నెదుర నెవరివశము, వే సంద్రము దాఁట నూ
హింపు రఘువీర రావణుని మృతునిగఁ దలంపు మనె. శ్రీ.

వానరవీరులు కామరూపు లని వార్యబలులు చూచు నీవ
నిక్కై యగ్ని,లో నైన( జొర నున్నారు నే( డనిభక్తి మా
నుషము తేర్పడ నాడుభాను, సూనువాక్యముల కలరి యంజ
నా సుతు( గని పుడమితే(డు, నే నీచే లంకారూపము విని
దాని పొంక మింక( జేతు నన(గా, భూనుత దివ్యతేజోధిక
మై లంకాపురి త్రికూటగిరిపై నున్నది యొరపై, దానిచుట్టు
వారాన్నిధి యగడ్త యగుకోట మణిహైరణ్మయము, పూ
ని ధర్మార్థకామమోక్షములు నానలరు( జతుర్ద్వారముల ననె
నతె(డు. శ్రీ. ౨

తరణిశశాంకులపై విరోధమున( దనువారలకన్న మున్నె
అసె నన్న, కరణి గోపురములు మిన్నావరించె ను ప్పరిగలు
గృహముల నన్న మేల్చి, తరువుకూటముల మణికవాట
ముల( దనరు సుప్రసన్న, సరసోద్యానముల నడబావుల( జ
లువచప్పరముల వరవిపణి, సరణుల దేవాలయముల ముత్య
పు సరుల తోరణాల: దనరె శ్రీల, కిర వప్పూరి నిక్కి చూడ
లే( డిందు్రి(డైన నలు చక్కికరుల, హరులరథసహస్రముల
నెక్కి సక లాస్త్రకుశలు లసురు లరయుదు రనె నతె(డు. శ్రీ.

రాజసింహ యిట్లున్న రావణుబల రాజ నాల్గవపాలు హ
తమయ్యె నాచే, జేజే రామ పదివేలు ప్రణతుల్ నే( జేసెద
న న్నేలు బంట నోజయశ్రీరమణ యనిన హరి యొప్పగ
హనుమంతుని మేలు, పూజ వాక్సుమముల( జేసి తపన పు
త్రు(గని సైన్యముల నడపింపు మి,దే జయముహూర్తమని

రాముఁ డాన తీయఁ బ్రయాణభేరి వేయించె శౌరి, ఆజికగ
చరేంద్రపాలిత కపిబలాళి యిల యీనగతి నడచె దక్షి
ణము. శ్రీరా. ౪

తరుచరు లెగురుచుఁ బరువు లిడుచు రుచికరము లయిన
పండ్లు దిని తేనె లాని, గిరు లెత్తుచుఁ బుట్టచెండ్లు నానె గుర
నైచుచు గొప్పగుంప్లు దాఁటుచు, హరి మేమే. దశాస్య
దుర్మతు మేఁగెద మరము రేలన నాత్రేండ్లు, మఱి రేఁబగ
లనక వింధ్యసహ్యమలయామ్రిలు ఘనకాననములును, ఉ
రువడి దాఁటి కర్కాటకకమఠ మకరఝషోగ్రాభంగరంగ
త్తరంగా, కరమై భీకర మైనరత్నాకరముఁ జేరి యాదోర
మైత్రిఁ గని, మురువుగ నిట సేన విడియ నియమించు మ
నిన స్వామి మహాప్రసాద మనెను ॥శ్రీరా॥ ౫

ఆవేళ సీతను దలఁచి రాముఁడా - హా యని విరహార్తి
నొందె నే మందు, నావిభుఁడు సత్యజ్ఞానస్ఫూర్తిప్రజ్ఞానఘన
కేవలానంద మూర్తి యోగ, కోవిదభావానువర్తి సుకీర్తి
దేవతాచక్రవర్తి, శ్రీవిభు నెఱిఁగిన దుఃఖాదులు చెందనేర
వాగి నాఘను నెనయునే, జీవాభిమానికే దుఃఖజాలముచి
ద్రూపమహా పరమాత్మను లేదుమా, భావమునకే శోకాదు
లు నిదురవోవఁ గలవె యొఱుకే కా నిలిచెఁ, గావున శే
షాద్రిపతి రాముఁడు సకలసాక్షి యని తలఁప నయ్యె బు
ధులచే॥శ్రీరాజ॥ ౬

౨. శంకరాభరణము-ఆదితాళము.

పల్లవి.—వినవే మదనతీ సతీ-వినయదయాదాక్షిణ్య సన్మతీ॥

అను.—హనుమంతునిచే నైనసాహసము- గని సిగ్గునఁ దలవంచి రావణుఁడు, చనదు సురల చేనైన నిటు సేయనని మంత్రులఁ బిలువ నంపి పలికె ॥వినవె॥

హితులారా కదనవిజితవి-మతులారా ప్రభంజన, సుతుఁడు చేసినపని గంటిరె శూరత మీఱఁ, గోతుకక లంకఁ బ్రవేశించి భూ-సుతఁ గాంచి యక్షాదులఁ బొలియించి, వితత మగులంకఁ గాల్చి గెల్చి చనె- వెర వేమి చెప్పుఁ డనె దనుజపతి ॥వినవె॥ ౧

ఓ దేవా గానముదితమ-హాదేవా వలదు నీ,తాదయితువలని భయము జగ-త్త్రయజయపరిభావా, ఆ దేవేంద్రుఁ జెఱ నిడె నీకొడుఁ-కలకాపతి యలికి పుష్పక మొసఁగె, నాదరింపవు వరుణుని యమునికి భ-యము నొంద విడెం తనిరి హితులు ॥వినవె॥ ౨

మయుఁడు బాలామణి నీ కొసఁగి-నయము చాలఁ గాంచె నీ, దయను హనుమంతుఁ డిటు చేసె నని- దనుజలోకపాతా, మయమునఁ బడనేల కోఁతి యని యే- మఱి యుంటి మతఁడందున బ్రదికి చనె, నియమింపు మొనర్తు మిల నమర్త్యముగ- నిర్వానరముగా నని రసురులు ॥వినవె॥ ౩

నిదుర దేఱి కుంభకర్ణుఁడు- చదురుఁ జేరి యీమాటల,

యెదుటు గాంచి రావణునిఁ దిలకించి-యోదోసకారి, పద రి యేమిపనిఁ జేసితివి దీన-ఫల మేమి నీ కిదె చేటుకాలము, చిదచిదాత్మకుఁడు రాముఁడు శ్రీహరి-సీతాపతి శ్రీదేవి య నెను॥విన వె ౪

రామసౌమిత్రులఁ గప్పుల సం-గ్రామభూమిఁ బోరిగొం డు, సామి నేఁ గల్గ నీమదికి వి-చార మేమిరా, శేముషీజితా బ్జజ యని యింద్ర-జిత్తు వల్క సత్త్రజిని భాగవత, గ్రామణి విభీషణుఁడు శేషాచల - కాంతాంఘ్రి లెద నిడి సభకుఁ జనె.వినవె. ౫

3. కల్యాణిరాగము-ఝంపాతాళము.

పల్లవి.—కాళీ విను సుజ్ఞానజనమానస-కాసార కేళీ విహా ర మరాళి.

అను.—మేలు గోరి సురారికోమలాంఘ్రులకుఁ- గేలు గదియించి విభీషణుఁ డన్న మన్నన, చాలఁ జెంది సభికులఁ దిలకించి దనుజే-శ్వరుని కామాతురుని గాంచి పలికె శ్రీ. కాళీ విను.

రావణా యీకుంభకర్ణుఁడు నీయిం-ద్రజిత్తు మహోదర మహాపార్శ్వులు, దేవా యీకుంభనికుంభాతికాయు లీ-దే వాంతక నరాంతకులు మొదలౌవీరులు నినుఁ, గావలే రా రఘుకులేశ్వరుని బారి-నీవు పడు వేళ నినుసీతయనుబల్గాల ము, గావుగొన్నది వెర వెన్న మఱి లేదు సీత-నీవలెఁ హ రిశర ణనెఁ .గాళీ. ౧

ఇనకులాగ్రణిబాణముల్ లంకాపురి-ఘనంబుగ నిండి రా
క్షసులప్రాణముల్, గొనకమున్నే జానకిని రాఘవున కొసంగఁ
దగుఁ గులగోత్రాకారులు నఖదంష్ట్రాయుధుల్ వనచరులు
నిరుపమ బలుల్ లంకఁ జొచ్చి-వారక కలంచకమును రాము
నకు సతి ని,మ్మనఘ నీవు బ్రదుక లేవు హరిసురేంద్రాదు
లాదరించిన నిను హరించు రాముఁ డనెఁ .గాళీ. ౨

రాముఁడె నీపాలిమృత్యువు పాతాళలోకమున కేఁగినఁ
బోనిచ్చునా, యే మందు ని న్ననితమ్మునిహితోక్తు ల-
హితమాయె నన్న కౌషధము రోగి మెచ్చునా, యామినీ
చరగ్రామణి విధివశుఁడై- యామెయి విభీషణుని గని యో
రి సేనొసగు, కామితార్థముల సమర్థత నొంది పొగరునఁ-
గాఱు లాడుచు వైరులఁ బొగడెద వనెఁ ॥గాళీ॥ 3

కలిగినాఁడు విభీషణుఁ డనుశత్రుఁడు-ఖలుఁడు కృతఘ్నుఁ
డతనితోఁ జెలిమి,నలఁపఁ గూడునా దాయాది చెడఁగోరు
నను-పలుకు నిజ మాయె నొకఁ డిటు పలికిన బలిమిఁ, దల
తెగ వ్రేతును బగదీఱ నసుర-కులాధమా నినుఁ గాల్పనే య
ని దశముఖుఁడు పలుక విని రోషమున విభీషణుఁడు నల్వురు
మం-త్రులును దా నెగసెను గదాయతభుజుఁడై ॥కాళీ॥ ౪

గగనమార్గమునందు నిల్చి విభీషణుఁడు-గంభీరరవంబున
బల్కెను రావణా, అగడుఁ జెంది చెడిపోకు ప్రియవాది నై
హిత-మాచరించుననుఁ దిరస్కరించితి వట్టినాకుఁ, దగినమ
న్నన కెన్న మత్పితృసముఁడవు- దశరథతనూజుఁడై య

వతరించెఁ గాలుఁడు, జగతి రామరూపమై మహీ-జాత సీత
యనఁగ జనించెను జనకునింట ననె నతఁడు. కాళీ. ౫

ధరణీభారము మాన్ప సీతారాములు-దలంచిరి విధిప్రేరి
తుఁడవై నేఁ, గఱపినహితవాక్యములు వినవైతివి ప్రకృతి-
కరయ సాక్షి భూతములవెలి లోను తానె, వెరయ నానా
రూపనామభేదముల భిన్నునివలెఁ దరువులం దనలుఁ డొకఁ
డైన, కరణి రాగవస్తుయోగమున రక్తస్ఫటి-క మనినట్లా
హరి గుణాకరుఁడగు ననెఁ. గాళి. ౬

కాల మవ్యక్తము ప్రధానపురుషు లన-గ నాల్గు ప్రధా
నపురుషులచే జగము, లీలఁ దనరు భగవంతుఁడు రాముఁడై
సంహ-రించు నిన్ను నీవారితో నిది నిజమ్మ, బాళి నేఁ
జని హరికి నేమమున మ్రొక్కి-శ్రీలలర నుండు నని విభీష
ణుఁడు వారల, జోలి మాలి భ్రమలఁ దోలి శేషాద్రిపతి య
శోవిశాలుని సేవఁ జేయ నపుడె చనెఁ. గాళీ. ౭

౪. సావేరిరాగము- అటతాళము.

పల్లవి.—కామలీలా కార్ముకవిజయభ్రూలతా - ఖలపావనసు
వ్రతా హిమశైలసుతా వినవే॥

అను.—ధీమంతుఁ డగువిభీషణుఁడు నల్వు-రామంత్రులతో
వచ్చిదివిని నిల్చి రాముని, శ్రీమహితనాముని పాదనీ- రే
జాతములఁజూచి నతుఁడై, రామా రాజీవలోచననా-సా
మీ వినుమని పలికె ఘనమేగను జెవులపండుగను॥ కామ

నేవిభీషణుఁడ నీసతిని ముచ్చిలినట్టి- రావణుఁనితమ్ముఁ
డను రామా నన్న,చే విడువఁబడితి గుణధామా యింక-నీ
వే గతిఘనశ్యామాసీతా,దేవిని రామునికిమ్మని దశముఖు
నితో-దెలిపినఁ జంపవచ్చెను రణభీమాలి,దేవారికి వెఱచి నే
వచ్చితినేనీ- సేవార్థము దేవదేవ దీనులకు, నీవేదిక్కనినను
విని సు-గ్రీవుఁడితని నమ్మకుముమా, యావిపగతునియనుజుఁ
డు బలియు-డనఘ సెలవిమ్మనుచింతు సచివులతో ననిమొర
ఘుపతితో వినవె॥కామలీ॥ ౧

ఇనకులమణి రవిజునిమాట విని నవ్వి-యనె నేఁదలఁచిన
మాత్రమున జగము,లను జగత్పతుల నిముషమునఁ ద్రుంతు-
జనన మొందింతు వేగమునఁ దెమ్మా, దనుజునిసకలభూతా
భయ- దానకంకణము గట్టితి నేలోకమున ననిన, జననాయ
కుఁ బొగడి దినసాథాత్మజుఁడో- యన నావిభీషణనాముని
దెచ్చి కనుపింప గని మ్రొక్కి- రాముని- ఘనశ్యామునివిశా
లాక్షుని, మనోజ్ఞముఖాబ్జునిధనుశ్శర- మహికతరుని ప్రశాం
తుని లక్ష్మణాన్వితుఁబొగడఁదొడంగె వినుః॥ కామలీ॥ ౨

శ్రీరామ రాజలలామ మ్రొక్కెద నీకు సీతాహృదయా
భిరామా ధను, ర్ధారి పూరితభక్తకామా శాంతా-కారాయ
నంత శ్రీధామా నమ, స్కారము సుగ్రీవమిత్ర జేజేనీ కం
జలి రఘువర సార్వభౌమా జగము, గోరి పుట్టింపఁ జేరి ర
క్షింప-మాఱి శిక్షింప నీరీతుల కాది, కారణం బగునీకు నతి
త్రిజగద్గురుఁడవై తనునీకు జో,హా రనాదిగృహస్థ వగునీ-క

మితసాష్టాంగములు చేతు హరీ నుతవాగ్గరీయ నెను విను॥కా

చరాచరభూతములు వెలి లో వ్యాపక-స్వరూపమున నసించి యుండు, తెలియఁగ రజ్జులు మాయ నుండి యెఱుక మఱచి జన్మమృతులు గాంచి యెప్పుడు, తిరుగుచుందురు శరణాగతులఁ బ్రోవవే-దేవ దయారసము నించి సుజనా, దరణీయము గాదు ధరణీధర లోక-సరణి శుక్తిరజతముకరణి భ్రమయని, యరయ కజ్జులు పుత్రదారగృ-హాదులం దాస సేయుచు వి,ష యరతు లగుదురు తుద నవి శోక-కరము లగు సుజనుఁ డిది గను వరదా పాలితద్విరదా యనెను॥కాను

నీవే యిందుఁ డీశానుఁ డాద్యంత మైనది ద్దేవతలు నీ వణువుకన్న నణువు, నీవు గొప్పకన్నఁ ద్రిభువ-నావళితలి తండ్రి వన్న నీవె, నీ వాదిమధ్యాంతరహితుఁడవు పూర్ణుఁడవు- నీవవ్యయుఁడవు సుప్రసన్న శిరో, గ్రీవశ్రోత్రచక్షుర్వాక్నేత్ర- శ్రేణివర్జితుఁడవు మాయావాసనాసాక్షివి, నీవు ద్రష్టవు శ్రోతవు గుణా-న్వితపంచకోశాతీతుఁడవు, నీ వనాశ్రియుఁడ వవికారివి- భావరహితుఁడ వాదిపురుషుఁడవు ప్రకృతి కవ్వలివాఁడ వనెఁ. గాను. ౫

మాయచే నిజరూపు మఱు విశి నరునివలె మహిఁ జూప ట్రితి నగుణియంచును ని, ర్మాయికు నిగాను నిలుచు మహితధీయుతుఁడు మోక్షము గాంచుఁ గాన, నీయంఘ్రిభక్తియును నిచ్చెనచేఁ గంను నీచిత్సుఖపుమేడనంచు యోగి, ధ్యేయ సుజనవిధేయ శుభనామ ధేయ ప్రణతగాధేయ న

నుఁ బ్రోవుము, శ్రీయుతాంఘ్రులకు నతి యని నుతిఁ-జేసి
నవిభీషణుని గని రఘు, నాయకుఁడు హితము గోరుమ యి
పు డే యొసంగుదు దనుజకులతిల- కాయని పలుక నతఁ డు
ప్పొంగెఁ॥ గామ॥ ౬

నేను ధన్యుఁడఁ గృతకృత్యుఁడ నైతి-నినుఁ గంటి నీద
యగంటి బ్రహ్మానందము చేకొంటి జగతి-లో నెవ్వఁడు న
నువంటి ఘనుఁడు, నే నొల్ల సతీసుతసంపదల హరి- నీయం
దే భక్తియుండవలె నంటినట్లు, కానిమ్మనసురజానిఁ మది
మెచ్చి- ననెమ్మదిలో నిన్నె నమ్మితి ననిన, వానిమది సీతా
సమేతుఁడనై నిల్తు నకుటిలుఁడ వైనను, ధ్యానింపు భవజ
లధి దాఁటు మనన్య మీ స్తవము- దీనిఁ బఠించునతఁడు కోర్కు
లుగాంచుననె॥ గామ॥ ౭

ననుఁ గన్న ఫల మిప్పుడే కాంచు వీఁడు లక్ష్మణా లంక
యేలింతుఁ జూడు జలము, గొని తెమ్మభిషేకింతు నేఁడు సిరు
లీ-దనర దీవింతు సీతోడనె, దనుజుని చంద్రార్కు లెందా
కనా కథ యెం-దాఁక నుండు నందాఁక వీఁడు రాజ్య, మును జే
యునటంచు మనుజేంద్రుఁడు పల్కి-దనుజేశుఁ బట్టభద్రునిఁ
జేసె మంత్రులతో వనచరు లలరి రినజుఁ డాలిం,గనము చేసి
విభీషణా రావణవధకుఁ దోడు-గమ్మని పలికిన కీర్తిసాంద్రుఁ
డగు శేషగిరీంద్రుని సేవ యొనరింత మనెఁ॥ గామ॥ ౮

౫. కాపీరాగము- ఆదితాళము.

పల్లవి.—అళినీలకుటిలాలకాని- స్తులకస్తూరికాలంకృతఫాల

ఫలకా సఖీజనతిలకా విను॥

అను.—అలపంక్తికంఠుఁ డంపశుకుఁడను నసురుఁడటువచ్చి
విను వీథి నిల్చి, పలికె సుగ్రీవ, మహారాజు రా-వణుండు
నిన్ గఱపు మనినమాట లనెను॥ అలి॥

మంచికులమున జనించినావు కపి- మండలాధిపతివై నా
వు, ఎంచినా ననుజసమునిగా నిను- నెపుడు•నధముతోడఁగు
డువక పోవునో,హించి రాకొమరుసతిఁ దెచ్చితేనీ- కేమిపు
రి కేఁగు మిఁక నీవు, మించి సురలు లంకఁజొరలే రెంత-మీ
రని దశముఖుఁడు దెల్పెనని శుకుఁ॥ డలి॥ ౧

వానరు లానఁడి విని పట్టి కట్టి- వానిఁ గొట్టిన నొచ్చి రా
మా, భానువంశాబ్ధిసోమ దూత ల-వధ్యులనక చంపెదరఘు
విరామ దయ, చే నివారింపు మనిన నభయ మి-చ్చితివెఱవ
ల దనెను రామ, తాన్మనాధుఁడు కపిసేన శుకుఁ డరసిమా
దొర-తో నేమందు నిసజ యనె॥ నలి॥ ౨

వాలి మాయన్న మెటులట్ల నీవు-వధ కర్హుఁడ వనురాఘ
మా, కాలమైవచ్చె నీకుసకులము-గా నినుఁ జంపు రాముఁడ
ని తెలుపుమాయని, ఈలీల నాదిత్యసుతుఁడు వలుక వాఁడేఁగి
రావణునితో నుపమ, వాలియే యని యదంతయును దెల్పి
నవి పాదహృదయుఁడై యుండె దనుజపతి॥ యలి॥ ౩

అఁటుమీఁదట రాముఁ డబ్ధి యుప్పొం-గుటఁ గని కను
లెఱ్ఱఁగఁ జేసి, కుటిలభ్రుకుటియై పలికెఁ గనుఁ-గొను లక్ష్మణ
ననుఁ గనక వారాశి ది, క్తటము లాక్రమింపఁ గడఁగె వీని

మ-న మడంతుఁ గపులు శ్రమముఁ బాసి, చటులగతి నడిచి పోదురుగా కని-చాప మెక్కిడి మహాశుగము దొడిగె॥నళి॥

గడగడవడఁకెను బుడమి దిశ లవిసెఁ-గడలి దివ్యతనువు ధరించి, వడిగా వచ్చి సన్మణులను రఘు-వరునుందర నుంచి నమస్కరించి నే, జడుఁడను శ్రీరామ శుభనామ నా-యెఱుఁ దప్పులను మన్నించి, కను దయ గావు కావు భూతపంచ-క ములకు జడిమ స్వధర్మ మని పలికె॥నళి॥ ౫

నీవు నిర్గుణుఁడ వవికారివి మా-యావి వౌతటి విరాడ్రూపు, నీ వంగీకరించి జగముల-నేర్పవ సృజింతు వారసీనైపులో, దేవ నీసత్త్వమున సురలయిరి వి-ధిప్రముఖులకు నీవే ప్రాపు, భావజాగ నీకినుకచేఁ బొడమె- భవ్యగుణసాంద్ర రాఘవేంద్ర యనె॥నళి॥ ౬

పుండరీకాక్ష మాయామనుజత-నుండ వని నినుఁ దెలియ గలనే, దండమే మూర్ఖులకు సన్మార్గ-దము పశువులకు ములు కోలవలె నే నిఁక నీ, దండఁ జేరితి దండము కో-దండ ధారి యభయ మి మ్మింక నే, నింకుభక్తి లంకకుఁ ద్రోవ యిత్తు- నీ కనుచు సరిత్పతి విన్నవించె॥నళి॥ ౭

రిత్తవో దీమహాశరము దీని-కి త్తఱి గుఱిఁ జూపు మని హరి, యొత్తి వల్క నన్ను బాధించుచు-న్నారు ఖలులు దుర్మకుల్య మనుదరి నా, మొత్తముపై వేయు మని పల్కె-ను స-ముద్రుఁడు రఘువీరుఁడు నలరి, సత్తుగ శరము నేయు నాభీరుల-రి త్తఁ జేసి యప్పుడె పొదిఁ జేరె నది॥నళి॥ ౮

చెలఁగి విశ్వకర్మసుతుఁ డానలునిచే సేతు వొనరింపు మి
త్తఁడు, తొలుతనే వరము గొనె నిందు కని పలికి హరి కెరఁగి
చనెసాగరుఁడు కడు, నలరె లక్ష్మణకపీంద్రులతో శే షాచ
లేశుఁ డగురఘువిభుఁడు, నలుని జలధికి సేతువు గట్టు మని-
సెల వొసనగె నగచరులు హర్షించి॥రళినీల॥ ౯

౬. సురటరాగము-అటతాళము.

పల్లవి.—రామలింగా వృషభ తురంగా రాజతాంగా॥ రా॥
అను.—కామితప్రద సత్కరుణాపాంగా కామగర్వభంగా
గంగోత్తమాంగా॥ రా.

అమరాచలచాప అజ్ఞానాంధదీప, శమనాంతకరరూప సు
గుణకలాప అమితప్రతాప, శమితసమజ్జనజన్మసంచితపాప-
విమతాంతకరూప విశ్వనిక్లేప. రామ. ౧

బాలేందుకిరీట-భవ్యజటాజూట, శ్రీలసల్లలాట శ్రుతిచ
య ఘోట-త్రిపురదానవకృపీట, లీలాహాసనిర్మూలితనిశాట-
శూలాయుధఖేట సుజనహేమకూట. రామ. ౨

సోమార్కానలనేత్ర సుందరీజనచైత్ర, హైమవతీకళ
త్ర సన్నుతిపాత్ర కోమలతాలవిత్ర, సామజాసురజైత్ర-స
కలలోకసూత్ర, శ్రీమచ్చరిత్ర శేషాద్రిశమిత్ర. రామ. ౩

తాంతకిటతకతకిటరిమరిస రీతహత ఝం మపధత కుంద
ఝంతారి తధపధమప, తాహకిటతక ఝంతారిస్సరిగరీ స
నిసరీసనిధప తాంతకిట తకతకనుమపనిధ పమధళాంగు ధిమి
తకదధిగిణతోం. రామ. ౪

౭. బిలహరిరాగము-ఆదితాళము.

పల్లవి.—విను సర్వమంగళా నయనకళా విజితాంబుదశ శంఖసుందరగళా.

అను.—ఇనకులమణి సేతువు మొదటను రా మేశ్వరు నొన రించి పూజించి యే, మనుజుఁడు సేతుస్నానము రామలిం గదర్శన సన్మానము, గను నతఁడు పంచమహాపాతకము-లను జయించు నాదయ నటంచు బలికెను. విను.

నరుఁడు కాశికి బోయి గంగాజలము గొని యరుదెంచి రామేశ్వరుని నభిషేకించి, పరగ జలధిలో బడవైవ బ్రహ్మ హత్యం డా నని యాకరణి, తరణికులాబ్ధిసోముడు శ్రీరా ముడు పల్క తరుచరు లుత్సహించి చలము రెట్టించి, గురు గులగతి దొంతరగా బలు గిరు లురుతరగతి గొనితరలగా, అరుదుగ నలు డందినాడు సేతు వొ నరిచె నోజ బదునాలు యోజనము లిక. విను. ౧

ఇరువై యిరువై యొక్కటి యిరువై రెం డిరువయిమూ డు మఱునాడు మూఁడననాడు చతుర్థపంచవా, సరముల శ తయోజనములు కపులు సేతువు పరువిడి గట్టిరి చూడు హరి, వరపరివృతులయి దాశరథులు హనుమంగదుల నెక్కి మై పొ దల, మెఱసి సువేలాదిశకిజని-రాం చిరి పరిఘుధ్వజతోరణమ ణి, హిరణ్మయప్రాకారసౌధగృహ వరవిటంకమై తనరులంక పొంకము. విను. ౨

పదితలలను మణికిరీటము లుంచి చెవుల స్వర్ణకుండలము

లు పెట్టి చేతుల, గదియ రతనాలకడియాలు గీలుకొల్పి-కలి తాంగుళములనుంగరములు, పదిలపఱచి ఱొమ్మున వేల్పు టేనుఁగుఁకొమ్ము పదకమై తనరార ఘనరుచి దేర, త్రిదశుల గెలిచిన బీరము తనపాదము న దగు గండపెండేరము, చదుర నుత్తరపు గోపురముమీఁద దశాననుండు కొలువుండె నిండు మనమున. విన. ౩

అపుడు శుకు డనుచారు డారావణుని గని విపుల మా దనుజసేనకు గపిసేనకు, నెప్పుడు సంధి గాదు దేవాసురులవలె-నిక నొకపని తడవు సేయకు, నృపకుంజరునకు వైదేహి నిచ్చు టొండె జగడ మిచ్చు టొండె రాముడు సుగుణాభిరాముడు విపులాత్మజ నేబలము గొని వెఱవక తెచ్చితి వాబలము, ఇప్పుడు చూపు నీసతుల లంక రమి యింపు మని నీతో దెల్పు మని పలికె ననె. విను. ౩

శ్రీరామలక్ష్మణులు సుగ్రీవవిభీషణుల్ చెలగి నల్వురొక్కచో నున్నారు చూడు, వీరె లంక నశింపజేయ జాలుదురితర వీరు లనేకులున్నారెన్నుచో, సారమా ప్లవగ సేనసంఖ్య సేయ నాతరమా మేరుమందరతుల్యులు యోధాగ్రేసరులు, చేరి విను లంక కెదురై పలు మా అదల్చుచు ధృతికిఁ గుదురై, మీఱి యూథపులు నూఱువేల్గొలువ మెలగు నతఁడు దివాకరసుతుఁ డని పలికె॥విను॥ ౪

ఇత డగ్ని నందనుడు సేనాపతి నీలుడు ఇతడు వాలికొడు కంగదుడు యువరా, జిత డక్షహంత యాహనుమంతు-డీ

ఘనుడౌ సీత వీక్షించి చనె రామునికడకు, నితఁడు శ్వేతుఁడు రంభు డితఁడు శరభుఁడు పనసుఁ, డితఁడు మైందుఁడు ద్వివిదుం డితఁడౌ యోధాగ్రేసరుం, డితఁడు విశ్వకర్మసుతుఁడు నలుం-డీబలము లెన్న లేఁ డీశుం, డతులశౌర్య లతిబలాఢ్యులుండఱు - చతురు లసురవధకు దనుజనర యనియెను॥వి॥

ఇరువదియొక్క వేలకోటు లిరువదియొక వేలశంఖము- లిరువదియొక వేలబృందములు సుగ్రీవుని మంత్రి, వరసేన లన్యుల బలము లెక్క పెట్ట నా-వశము గాదు రేయుఁ బగలుఁ, బరమాత్ముఁ డాదినారాయణుఁడు రాముఁడు-పరాశక్తి భూపుత్రి లోక జనయిత్రి, మఱి వారివలన జగము సం-భవమాయె వారితో వైరము, కొఱగా దఖిలమాత సీత నీవు-గోరి తెచ్చుకొనుట కార్చిచ్చు తెఱఁ గనె॥విను॥ ౭

జలబుద్బుదమువలెఁ జంచలము సంసారము-క్షణభంగురము కాయము పంచభూతముల, వలననై పంచవింశతితత్త్వాత్మకమై జడమై-పొలుపొందునట్టిది తెలియ మాయము, ఇలనెవఁడు దీనియందు మమత సేయు-మలమూత్రాదులగం పరోఁతకొంప హంకృతి తెంప, నలుపు లేనిటికిఁ గలుషము సుఖా-దులఁ జెందు నేది యది దేహము, కలుగ కర్త నను టజీవునకు జ-న్మలయంబు లటు గాన మమత లణఁపుమనె.విను.

అతిశుద్ధ మతినిర్మల మాత్మ విజ్ఞానరూప-మచల మవ్యయంబు స్వజ్ఞానమున, వెతఁజెంది జీవుఁడు మోహితుఁడౌ

గాన నీవుస-న్మతిచే నాత్మ ననిశంబు, నుతియింపు దారపు
త్రాదులయం-దు విరక్తిఁ జెందు, సుతుడవు విశ్రవసునకు-
సుఖముల్ సత మనకు క్షితి,సుత రామున కిచ్చి రాజీవా-
క్షుని మఱుంగుఁ జొచ్చి, బ్రతుకు మిల శేషశైలపతిభక్తి
రావణాయని-పల్కె శుకుఁ డామెడ నిఁక .విను. ౯

౭. అసావేరిరాగము-అటతాళము.

పల్లవి.——పొలఁతి యీచరితము-పోలఁ దిలకింపవే॥

అను.——లలితములౌ శుకునిపలుకులు విని పది-తలలవాఁ
డలిగి శిఖవలెనై వానితోఁ, బలికెఁ బ్రియ మాడి బ్రతికెడి
నీవు సిగ్గు లేక జగ-త్ప్రభుని నను బోధింప వచ్చేవు ఇపుడె
చంపుదు నినుఁ, దలఁప వధ కర్హుండవు గా విఁకఁ-దలఁగి పో
మూఢుఁడా యన వి,హ్వలతచేఁ జనె శుకుఁడు ముసు-బ్రా
హ్మణుఁడు వానప్రస్థగతి నుండెఁ .బొల.

సురలకు మేల్ కీడ-సురులకుఁ జేయగఁ, సరణి శుకుఁడు
సేయు జన్నములు చెఱుప వజ్రదంష్ట్రు, డరయఁగ నొకనాఁ
డాధరణి-సురుని డాయ నగస్త్యముని, యరుదేరఁ బూజించి
యతఁ డారగించి పో-మ్మన మునియొప్పి పాయసాన్నము సే
యఁ, దఱి వేచి వజ్రదంష్ట్రాసురుఁ డగస్త్యుఁడై వచ్చి తగ
మాంసాన్నము వేయు మని వేఁడినఁ, ద్వర ఛాగమాంసము
వంటకము వండిరి మునీ-శ్వరుఁడు భుజింప నయ్యెడ వచ్చికూ
ర్చున్న, తఱి శుకునిభార్య నావేశించి రక్కసుఁడు మానికి,
నరమాంస మిడి చనియె భ్రమియించి కూడుగూరలు ముని

వరుఁ డరసి మనుజామిష మయోగ్య మిది పెట్టితి వని శపిం
చె న,సుర వగుమనుచు నెఱుఁగ నని శుకుఁ-డఅవఁగా ధ్యా
నించి ముని పలికెఁ .బొలతి. ౧

ఆవిచారముచే ని ట్లయ్యె నానుడి దప్ప-దనఘ త్రేతా
యుగమున రావణుఁ జంప, రవికులమున హరి రాముఁడై
పుట్టి సీ-రథి గట్టుసమయమున దశముఖుఁ డంపఁ, దవిలి దూ
తకృత్యమునకుఁ జని రాముని-దర్శించెదవు ముదమున నక
లంకమా, నవనీసురత్వము నీ కబ్బు నని చనెఁ గుఃభ- భ
వుఁడు శుకుఁడావిధమున సద్ద్విజుఁ డయ్యె, నవలమాతామ
హుఁ డగుమాల్యవంతుఁడు-సవినయమున దానవవిభుని గని
రాజా, అవనిసుత పురిఁ జేరి నది మొదలు దుర్నిమిత్తము
లొ-దవె వినాశకరములై మేఘములు గురిసె నెత్తురుజడి, శి
వలింగములు రోదనముఁ జే-సెడిఁ గరుల కొమ్ములు నల్లనై
నవి యావు లీనె ఖరములఁ గని-కవిసె నెలుకలు పిల్లితో
ననియెఁ .బొలఁ. ౨

ఒకవింత దనుజేంద్ర యొకబోడి మగవాఁ డూ-రక యి
ల్లిల్లు దిరుగు నిర్భయమున, వికటదంష్ట్రానవివరము దెఱ
చుచు నీరాక్ష-సకులము మను తెఱఁగు విను సీతను, సకలే
శుఁ డగురాము చందుృన కిచ్చి మ-చ్చిక వచ్చి నీమఱుఁగుఁ
జొచ్చితి నను, అకుటిలకరుణాఢ్యుఁడై నిన్నుఁ గాచు శ్రీ-
హరి రాముఁడై పరఁగు నని తత్త్వము, ప్రకటముగా మా
ల్యవంతుఁడు దెల్ప రో-షకషాయితలోచను,డై రావణుఁడు

మా, టికి దిక్పతుల గెలిచినాఁ డనని దేవమునిహాపుని-ఒక పేట మానవుని రాఘవుని శర ణొందు నామి, స్నక లంచ ములు రిపులచేఁ గొని - నా వేమో కాన పొగడెడ నరి, నీఁక బుద్ధి గా మునుగు తాతని - యెంచినాను పొమ్మనిన నతఁ డరిగెఁ. బాలఁ. 3

రావణాసురునై భవముఁ జూచి రాముఁడు లక్ష్మణుని-చే విలు గొని యర్ధచంద్రాస్త్రము, మావింటఁ దొడిగి నిండారఁ దీసి యేయ-నది యసురాధిపుపైఁ జని యొక్కటి పదినూ, తై వెయ్యి సంఖ్యలను గనచి పదితలలకిరీటములు పడఁగొని వెలిగొడుగుల-వే వే ద్రుంచి యవలీలఁ బొదిఁ జేరెశర, మా వేళ దనుజాగ్రిణి సిగ్గునఁ గుంది వేవేగ నంతఃపురావాసము న కేఁగి ధీవరుల వెరవరుల రావించి భావించి, లావు నిర్భ యము వరోత్సాహము నాపై దయయుఁ గల-దే వీనులకు వార లాహానము సేయఁ జనుఁడు మదా, జ్ఞానిముఖుల రణ భయులఁ బీ-చ మణంతు నన శేషాచల, దేవు, డగు రాఘ వుచే నని-దెగిన మే లని తలంచి రందఱును. బాల. ౪

---

—: ప్రథమయుద్ధారంభము. :—

౯. నాటరాగము-ఝంపాతాళము.

పల్లవి.—— గౌరీ వచోవిజిత- శారీ విను శ్రీ మీనాక్షి॥

అను.——శూరు లై యనికి దివి- జారు లేఁగుచో రణ, భేరీ మృదంగముల్- పృథులశంఖారవముల్, వారక మ్రో

యించి మహిషఖరహరికరి-వాహనముల నారోహించి ఘన
వైరిభయదకరవాలగదాశూలభిండి-వాలచాపములు ధరించి
యాయతం బైరి. గారీ.

అటకు మున్నే రాఘ-వాజ్ఞచే వానరుల్, పటుఘోషభీ
షణ- స్ఫుటశౌర్యులై మహా, విటపముల్ బలుగిరుల్-పెక
లించికొని వచ్చి, కుటిలరావణుబలము- గూలు రాముఁడు
గెల్చుఁ, జటులజయ మొందు ల-క్ష్మణుఁ డినజుఁ డరి నో
ర్చు, నిటు చూడుఁ డటంచుఁ దలపడి రరులతో- నేపుమీ
ఱి రణ మొనరించు నా, ర్భటుల హనుమదంగదనీలకుముద
శర-భనలజాంబవత్సు షేణాదియోధవరులు . గారీ.౧

లంకవాకిళ్ళని-లాపుమై గపులు ని, శ్శంక నసురుల
నఖా-స్త్రముల విదళింపఁగా, బింకములు దనుజులె-మ్మెయిఁ
బల్కి- నలిరేఁగి, పొంకమగా పురద్వార-ముల వెడలి యసి
తోమ, రాంకుశశరాళిచే-నగచరుల గీలించి, అంకెలు వైవఁ
గనిప్లవగులహితులబీ-రంబడంచి రాజితస్థలిని బహు,పంకమై
మేదోమాంసరాశి నెత్తురు-పంకలై పఱచె మహాద్భుతముగ
చయ్యెడను॥గారీ॥ ౨

మరలి దితిజులు కరుల-హరులఁ దేరుల నతి,త్వరగఁ బురి
కొల్పినం-గరకేళి సల్పి ర, త్తఱి వనేచరులు న-ట్లనఁ బేర్చిరి
జయేచ్ఛఁ, తరు చరుల్ రామభ-ద్రదయార్ద్రదృష్టిచే, వె
రపుబలమును గల్గి-వెలసి రమృతము గొనిన, సురలవలె రా
వణాసురు, డలసీతా-చోరుఁ డైనపాపమువలన నిశి,చరులు

దొరలు దరలిరిలఁ జతుర్థాంశశేష-సైన్యములు పఱచె భయ
ద్రుతంబు లయి కలఁగి॥ గారీ॥ ౩

తనబలము లిట్లాటఁ-గని కనత్కోపుఁడై, ఘనుఁ డింద్ర
జిత్తు మే-ఘములలోఁ డాఁగి క్రిన్నన శితాశుగవితా-నము
లోలి వర్షించెన్, వనజసంభవునివర-మునఁ గన్న బ్రహ్మాస్త్ర,
మున మర్కటానీక-ముల నెల్లఁ బడఁ జేసె, దినకులమణి కో
దండదీక్షాగురుఁడ-య్యును బ్రహ్మాస్త్రమును మన్నించి తత్
క్షణ మూరక యుండి-స్వబలములు గూలు టరసి, యనలస
న్నిభజ్వలద్భ-యదనేత్రుఁ డయ్యె॥ గారీ॥ ౪

ధనువుఁ దే లక్ష్మణా-దనుజు భస్మీకరింతును బ్రహ్మ
సాయకం-బునఁ జూడు నాబలం, బని శేషాద్రిపతి ప-ల్కిన
వాఁడు చన నంత, వనచరులు పడుటఁ గనుఁ-గొని రాముఁ
డడలి యో, హనుమంత క్షీరాబ్ధి-కావల దివ్యౌషధి,-జనక
మగుద్రోణనామగిరి గలదది వే-గొనివచ్చి కపులఁ బ్రోవు
మనఁ బో, వని జవమునఁ జని తెచ్చి వనౌకసుల సజీ-వను
లఁ జేసి నగము మున్నటిచో నిడి వచ్చె. గారీ. ౫

౧౦. ఆరభిరాగము-అటతాళము.

పల్లవి.—సారదయాధురీణ-సంగీతవిద్యాప్రవీణా వినవే.

అను.—ధీరులై వానరులు చెలఁగి భీక-రారవములను అంకె
లువైచి, మీఱిన నది విని రావణుఁడు మదిని-నారసి
వందురి రాముఁడు నాకెన్న దేవతానిర్మితుఁ డైనవైరి,
ఘోర నతని జంప యూధము లెల్ల - బొం డిటు సేయని

వారి జంపుడు ననెను. సార.

రావణానతి సబలులై చని ధూమ్రాక్షయూపాక్షశోణి తాక్షమ,హావీరసాహాకాయప్రహస్తాకంపనమహోదరమహా పార్శ్వులు, దేవాంతకనరాంతకాతికాయ-త్రిశిరః ప్రజంఘ కుంభనికుంభు, లావనచరౌఘముతోఁ దలపడి రా-రావీరియ ద్భుతరాదద్రిరసము లే మసం ధగు గదాముసలాశుగతతు,రీవి శేష సాధనాళిచే విదళించిరి దానవులు కపిసేనాపతుల.సా

మర్కటుల్ బలియురై కొండలఁ బెనుమ్రాకులఁ బం డ్ల గేళ్ళ బిడికిళ్ళ, గర్కశపదఘట్టనశిలోరు - కరకపోలోదర ముఖాంగముల గలస, మూర్కొని నైచి మోది కఱచి చీరి మర్దించి తన్నిన వెఱ వసువు లె, దుర్కొనరైరి లంక కై పాఱిరి- కుర్కురశబ్దము లాబలీముఖులు-కోలం దిడక బలు తఱిమిన ప్రహస్తు, డర్కకులచరిత్రి ముదితాగచరబలాం బుధి జెల్లెలికట్టకై వడి నిలిపె. సార. ౨

ఒకని బదింట నూట వెయ్యింట న నొకసుల నొక్కొ క్కముల గూల్చి, నికషాత్మజమంత్రి జయప్రశస్తి నెఱయ నీలు డదలించి పేర్చి కడిమి, నొకతరువు బూని వానితేరి మీఁదికి బోయి సూతు జంపి హయముల, మకు రడచి విలు దుగ్రించ నిల నిలిచి తికమక నొందక నాకేగతనుం డిభంబు గతి రోఁకట నడవ నీలు, డొకట నొలసి తెలిసి పెన్గిరి నై చి-యురవడి రావణుమాతులుఁ బొరిగొనియె. సార. ౩

తలలు వీడ రక్కసుల్ పర్వ గని తారాసూను పై నరాం

తకొడు చలమున హయము దోలి శక్తి సేయ జలమున నం
గదుడు వాజి పడ నడచెఁ, తలకొందక వాఁడురస్థలి, బిడికిఁ
టఁ వ్రేయ సోలి వాలికొడుకట దెలివొంది ముష్టిఁ బొ
డువ గుంది, పొలిసె నరారియు దేవాంతకు డప్పు డంగదు
ని దాక హనుమంతు డా, కలి గొనిన పులి యన నెడఁ
జొచ్చి ఘను డగు దేవాంతకుని రూపు మడంచె. సార. ౪

అంత కాభీలు డగు నీలుడు పెల్లార్వ మహోదరు డదల్చి
తన, దంతిని ధే యని డీకొల్పి పరిఘ దాటించిన గపిసేనా
ని నొచ్చి, పంతంబు మీఱ నగంబు గొని సత్వరంబుగఁ
సేయ గరిశో నొరలి, గంతుగొనె మహోదరు డంతసే-జా
తర మనం ద్రిశిరు డనిలసుతుని శరావృతుని జేయ నతఁ
డరద మిఁ, తింతలుగ జేసి వారిమూఁకుతల లిల గూల్చె
వజ్రము గిరిం గూల్చులాగున. సార. ౫

అంజనీతనయుని గదఁ గొని ధూమ్రాక్షు డేసిన బిట్టు
లిగి ప్లవగ, కుంజరుడు శైలము దెచ్చి వైవ గూలె వజ్రిధా
ర బలుబలునికరణి, గంజాయకను ల్మడివడిన బొమలు పెం
జీఁకటి నేలుమైతొడవుల రంజిల నకంపనుడు తే రెక్కి వీఁ
కన్ శింజిని మ్రోయించి పావనిపై నిశితాస్త్రముల జించ
గ నకోపుడై ప్రి, భంజనాత్మజుడు మ్రోనిచే వాని భం
జించెన్ దేవతలు జేజే యనగ. సార. ౬

గద బట్టుక ద్రిప్పి మహాపార్శ్వుడు కాలాగ్నిసన్నిభు
ఋషభు సేయ, జదికిలబడి మూర్ఛిలి తేఱి యొమ్మ్న పృథు

లకీ శవరుడు పొడువ వా డీల్గెన్, విదితుడై మహాకాయుడ-
రదంబు వెసన్ పఱపి సజ్యకార్ముకుడై, బెదరకుడీకపులారా
వినుడీ కదనము వీరాగ్రేసరు డగురాఘవేశుతో గాని సేయ
మాతం,డి్రదివిజుల గెలిచె గైలాన మెత్తె నే పను గావున
నలతిగా నని పల్కె. సార. ౭

అంగదుడు మహాకాయుని గని యా హా రజ్జు లేల విూ
యయ్యను నె, అంగుదు దోకను జట్టి పయోధి లో ముం
చడె మాతం డ్రి మున్నె అగవా వెంగలీ యనుచు బాదపము
వైవ విశిఖంబున ద్రుంచి బాణవృష్టి, నంగదు ముంచి గదన్
గొన పొలయగ దొంగ దొరంగబడెగ గపు లడలన్ సురారి
యైదింట బదంట నొకట జె, లంగి మూట నూ టవలని-ల
గవయగజగవాక్షానిలసుతాదుల నేసె. సార. ౮

అంత నంగదుకు తెలి వొంది ఘనగ దాయుతభుజుడై
మహాకాయుర, థాంతమునకు జని హరిసూత కే తనచాపముల్
నుఱుమాడె నిర్వురు గదల్, వింతగా గొని పోర నవి వొడి
యమ్యె వెసన్ మల్లయుద్ధమున దుందుభి, నంత మొనర్చిన
వాలి యన లావునకు నందఅ నద్ధనుజు బొడిచి వడిన్ రణో
ర్వి దలం దెవ్వ శ్రీరఘురాము, చెంత కేగి మ్రొక్కనవా
లిసుతుం శేషగిరీందు్రడు గాంగిలించెను జెలంగి॥ సారద॥ ౯

## అతికాయయుద్ధము.

౧౧. శ్రీరాగము- త్రిపుటతాళము.

పల్లవి.—ఆర్యసమ్మతమైహితం బగు నార్య యీచరితము
వినవే॥

అను.—శౌర్యఘనగాంభీర్య సమరచాతుర్యాదిసహాయుఁడై
యతికాయుఁడై,శ్వర్యవిభవము లనుసరింప న వార్యమై
గుణరవము మోఁియఁగ, సూర్యనిభ మగు రథముఁబఱపి
య సురాళి నోడకుఁ డని పలికె॥ నార్య॥

బాణాసారమున వనచర సేనానాయకులత్రుళ్ళడఁగించి
దీ నానాథులఁ జపక రామత్మానాథు నెదిరి సు జ్ఞానమూ
హించి రావణసూనుఁడదలించి, మానమే లేదు ఏనెళవుగా
దు ఏనీతియు రాదు మాతో వాదుఁ, బూని మానిసి వై నా
వుగుణ హీనుఁడవు కులగోత్ర మెఱుఁగని, వాని కీపు డోదవె
నిన్నియును సమానుఁడవె మాతో నని పలికె॥ నార్య॥ ౧

మీనై యంబుధిఁ జొచ్చినం గాని గట్టు మోసినంగాని,
క్షోణి క్రోడీకరించినం.గాని మానెక్కి పండ్లిగిలించినం,గాని
భిక్షుఁడనై నటించినఁ గాని గూనిబాఁప డవైనం,గాని దో
రతనము మాని మాని వైనర మఁసలివైనం, గానీ శాంతి
గాని పోరుడిగినఁ గతికి వయినంగాని నినుఁబో, నీను నీమోఁ
దనిడీన తలఁపు మాన నసె హరితో ననువవుఁ॥డార్య॥ ౨

జ్వాలాభీలం బౌడవాగ్ని లీల లక్ష్మణదేవుఁ డెదిరించి,

యేలరా పసుచ రజ్జులు చాలా పేరెదవు చక్కఁగా నిలువు
నీక్రొవ్వడంతు జేజేలలర ననిన, చాలు సౌమిత్రి గోలవు నీ
వి క్కాలముల తెఱఁగు లెఱు గవు జరుగు, కాలభుజగాభశ
రజాలము పాలు గావల దన దనుజు ను ద్వేలఘాలమున నెత్తు
రొలుక వాలమ్ము గీలించె లక్ష్మణుఁ॥ జార్య॥ ౩

దాసఁబల్ నొచ్చి యీఘనుఁ డేననోర్వఁగఁ జాలు నని
యంప, వాసచేమించె రావణి రా మానుజు సతఁ డ,స్త్రి
నలముచే దాని మాన్పివగ వానిపై దూపుల, వేనవే ల్నిం
చఁగా నిష్ఫలమయ్యె హీనునకుఁ జేసినమేల్కరణినా లోనఁ
బవనుఁడు వచ్చియజుచే దానవుఁడు వజ్రకవచము గొని,పూ
నెనని తెలిపి చన రఘుకులు డానిశాటునికవచమును దుని
మె॥ నార్య॥ ౪

ధీకుల్ దానవమానవరాజవీరు ల్దివ్యాస్త్రము ల్పరగించి,
పేరల్కన్ హరిహరికరికరి నొరసినపరసునఁ బెఱు శివకగెలు
పునుబ్బునఁ బోరిరరుదారన్, ఘోరశరక్షతశకీరులై గైరికా
రక్తశైలము లననొప్పిరి కలన, నారినరిఁబోసి బ్రహ్మాస్త్రము
దారమంత్రాన్వితముగ నిం, డాఁకఁ తీసి మనుకులుఁడేయ సు
రారిసుతుతలఁ దునిమెఁ దుది నది॥ యార్య॥ ౫

ఆలో దేవత లానందమునఁ బూలవానలు గురియించిరి,
చాలాభక్తినతుల్ చేసినతమ్ము నాలింగనముఁ జేసి మౌనిమిరెఁ
గరమున డ,యాలోలుఁ డయ్యె నృహరి బాళిఁ గపులు ని-
ర్వేలహర్షాబ్ధిఁదేలిరది చూచిసైఁచక యేచి, కాలయములనఁ

గుంభనికుంభు లోలిరణకేళినగచరులు, దోలితరిమినఁవాఁరి
జంపిరి వాలితమ్ముఁడు నతనికొమరుఁడు॥ నార్య॥ ౬

యూపాక్షుండు ప్రజంఘుఁడు మైందు తోపోరాడి రణో
ర్వీఁగూలిరి, కోపోద్దీపితుఁడై శోణితాక్షుని రూపణ ద్వివిదుఁ
డుపొడిచి పాదమునఁ బ్రామోఁ బ్రి, తాప మను వొంద-బా
పురెయని ధూమ్రాక్షుని హనుమంతుఁ, డేపునఁ దెగటార్చి
యార్చెను బేర్చి-ఆపదలఁ బడి పఱచి హతశేషాసురులురా
వణునకెఱుఁగఁగ, రూపించి రతికాయుఁ డీల్గుట-యును శేష
గిరీశుని రామునిజయ॥ మార్య॥ ౭

---

రావణుని ప్రథమయుద్ధము.

౧౨. గౌళరాగము-ఆదితాళము.

పల్లవి.—సూరిజనసౌఖ్యదాయినీ యీసుచరితము సుధీనుత
ము కాత్యాయనీ॥

అను.—ఘోర నతికాయాదిఘనుల్ పడుట- కారాటపడి రా
వణుఁడు కను ల్నమీరసంయుతాగ్ని నెనయఁగా ఖ-రా
రిపైఁజనఁగా మది నెంచిపగ, మీఱి నింద్రజిత్తు లంకకా
పాడిన-మిదూర్జితంబైబలంబు నడువఁగ, భూరిసాయుధము
గురథమెక్కి-పొగరున నిక్కినడచెను దొ్రిక్కి॥సూరి॥

వింటగొనయమిడి కపులనద-రంట శరముల నేసి చంపె,
దంట యనుచు నినసు-తాదులవెంట నంటి, మంటఁడరునా
రాచములచే-మద మడంచి బెబ్బులిపేరాఁకట, నొంటిఁబడి

వచ్చుపోల్కి దశాననుండు హరిఁ గదిసె నదిగని త్రిదశ,కంటకు నెదిరి విభీషణుఁడు గదా-కనకద్బాహుఁడై తాఁకె నతనిపై, నంటినపగ మయదత్తశక్తి-నన్నసశక్తి నేసెనుయుక్తి॥ సూరి॥

అయ్యస్త్రముగని నాచే వర-మియ్యఁబడినతఁడు వధకుఁ దగఁ, డయ్యాయని సౌమిత్రినృపు-నెయ్య మెఱింగి, చయ్యనఁ బిఱిందికి విభీషణు-నొయ్యఁ దిగిచి విల్గొని యనికిఁగు, రియుండై నిలిచె శక్తివచ్చి న-రేంద్రసుతుఁ జొచ్చి వెలిఁగెను హెచ్చి, డయ్యఁడయ్యె సకలశక్త్యాశ్రయుం-డనంతుఁడుహరి కితనువు నగునతని, కెయ్యెది దుర్భరం బటులైన- నిలఁ బడె దాన వరభావన॥ సూరి॥ ౨

సోలి పడియున్న లక్ష్మణుని-జాలి కరముల నెత్తఁబోయి వాఁలి రావణుఁడు సిగ్గుపడెఁ-జాలి జగతి, మూలమైతగువిరాట్పురుషుఁడై - పాదలువిష్ణుగఁదలఁపఁగ సురారి, కేలీలనగురావణుఁగని యొ-కింతలోనఁ జనిపావని యశనిఁ బోలుపిడికిటనుఁబొడువ మోఁకాళ్ళ-భువిఁ మోదఁబడియతఁడు ముక్కులఁ, జాలరుధిరము గ్రక్క లక్ష్మణుఁ-సామీరి ఘనుండై కొనిచనెను॥ సూరి॥ ౩

రామత్మోనాథుఁ డనిలజు-సామర్థ్యముఁ బ్రియముఁ గని పొగడె, భీమాటోపమున ధనుర్ధరుఁడై మారుతినెక్కి, కాముగెలుచునాఁటి రుద్రునివలె-గడియఁ దెలిసిదనుజకిరీటి మ, హాహర్షమునఁ దేరెక్కి రాఁగ న-రాధిపుఁడు బాగాఅదల్చి

పోఁగాఁ, బామరాధమా బ్రతికి పోలేవ-పరాధము సర్వసముఁ
డనైననా, కేమిటికిఁ జేసితివి నినుబలి యిల-కిడుదు బలియు
నేఁగడుఁ గెరలి॥ సూరి॥ ౪

శ్రీరాముని నుడి విని వాహనమై రా-జిలు హనుమంతు నే
సెఁ, గ్రూరాస్త్రముల రావణుఁడు కపి-వీరాగ్రణి నొచ్చి,
భూరి తేజో బలంబున వృద్ధిఁ-బొందె ఘృతమ్ముచే నగ్ని వలెఁ
రఘు, వీరుఁ డప్పు డంజనకొమరుని-విక్షతస్రవణునిఁ గని రా
వణుని, తేరు గుఱ్ఱములు గొడుగు విల్సార-థి కేతువులఁ ద్రుం
చి యరచందురులకోరి నిలఁ బడల్చెఁ గిరీటము-లూల్చె ర
విసముల్లసత్ప్రభముల్ .సూరి. ౫

బాణావళి నొచ్చినా విపుడు-ప్రాణాలతోఁ బో శ్రమము
దీఱఁ, గోణాధిపా నాబల మరయ-జాణవై రేపురా, కానీ
యని నృహరి పలుక వా-క్కాండములను నొచ్చి సిగ్గరి క,
రేణుపతి మృగపతిచేఁ బడి య-రిగెడు విధువ,బడి పఱుచు
క్కై వడి, మాన మేది రావణుఁడు పాటి కడు-వడిఁ లంకఁ
జొచ్చి మది నెంచె నా, శ్రీనివాసుఁడే రాము,డు ధరణి-శే
షగిరిధని యనఁబరఁగె నని .సూరి. ౬

౧౩. తోడిరాగము-ఆటతాళము.

పల్లవి.—కామసంజీవనౌషధికల్పలతా-శ్రీమేనకాసుతా
వినవే॥

అను.—ఆమీఁద వగచె రామచంద్రుఁడు-హా లక్ష్మణా
హా యని విలపించెను .కామ.

తాను విష్ణుఁడై నను మాయ-చేను జగము నెల్లను మో
హింపఁ, గాను మది నెంచి నెనరు మించి-క్షోణిపైఁ బడి
మూర్ఛ స్రుక్కి యున్న, వానిఁ జూచి కన్నీరు నించి-నానో
ముఫలమా నాపెన్నిధానమా, నానీడ నాతోడ నే నీతోడఁ
బూని రాఁదలఁచి నినుఁ బిలిచినఁ గాని పల్క వదే కోప
మా, నే నన్యుఁడనే కరుణఁ జూడఁగదే నన్నుఁ గన్న లల
రఁగ ననె నృహరి .కామ. ౧

అంత రాముఁడు చింతాకులుఁడై ధీ-మంతా యోహను,
మంతా రా నాసంతాపముఁ దీర్చ-మా సంజీవిని, పంతము
తోఁ దెచ్చి ప్రాణము లిచ్చి యీ పట్ల తమ్మునిఁ జేర్చుమా
మంతు కెక్క నీమహిమనినఁ గొం-డంతై పావని మ్రొక్కి
చనె నాచక్కి, నంతయును జారులవలన విని- యసురపతి
కాలనేమి గృహా, భ్యంతరముఁ జేర వాఁ డతని స-పర్యలఁ
దనిపి కార్య మేమని యడిగెఁ .గామ. ౨

రామానుజప్రాణ-మిా మారుతి దివ్యసామగ్రికిఁ బోయె,
నామార్గమున విఘ్న-మౌమాయలు పన్ని యీ రేయిఁ గడ
పు, నీమేలు మఱవ ననిన దశాస్యునిఁ గాల,నేమి బోధించె
నెన్ని మా మారీచుఁ, డేమాయె నట్లనె నే ననుమాన-మే
ది రావణా నీజీవన, మేమి హితసుతపౌత్రిబాంధవు- లీల్గి
రవనిజచే సిరులచే, నేమి తను వేల హరికి సీత-నీరాజ్యము
విభీషణు కిమ్మనెను .కా. ౩

మునివై యడవికిఁ జని వైదికకర్మ-ఖనివై విజనస్థలి వై

తగు ననికి,గాని వైరాగ్యమున విషయాసక్తిఁ-జనునింద్రియ
ములమె, ల్లనఁదిగిచి పరమాత్మ-నెనయుంచి చిత్తమున, నిను
ప్రకృతికి విలక్షణు-నిగాఁదలపోయు, మనఘ చరాచరజగము
బుద్ధ్యాదికము కన-వినఁబడెడి దేది చతురా, ననుఁడు ముని
తృణము తుదయానిది-విను ప్రకృతిజన, జననలయ కారణ
మదియె మాయ-యనఁబడు ననె నతఁడు॥కామ॥ ౪

శ్యామారుణశుక్లధామాకృతిఁ బ్రజల-నామాయ సృజి
యించి కామక్రోధాది, నామాద్భుతసుతులను హింసేచ్ఛా
ది-భామినులఁ గని యది బహుబాళిఁ జెందించఁ బరమాత్మ
నీగతులను, ఏమి యెల్లని యాత్మేశునం దది స్వగుణ-స్తోమ
ము నారోపించు దీపించు, స్వామి నిర్మలుఁ డైనను బ్రకృతి
సంగియై వెలి గని భ్రమసి తనుఁ, దా మఱచి గుణమోహి
తుసిగాఁ-దలఁచి తనుఁ దెలియుక్రియ విను మనె నతఁడు॥కా

ఏకాలమున వివేకాఢ్యుం డయిన- శ్రీకారణగురునిచేఁ
గాయికమోహఁ శోకాదికము లేనివానిగాఁ దెలియఁ-జేకు
ఉ నత్తఱి మరల్చి చూడ్కిఁ గను నాత్మ జీవన్ ముక్తుఁడ
యి పాప్రిణి, ప్రాకృతగుణములచేఁ బడక నీవు నిన్నుఁ-బరిశీ
లించుమహాసీకళి, ఉపాకరణదక్షుఁడ వయి ప్రకృతి- కవెలి
వెలుఁ గని యాత్మనుఁ దెలియు, నీ కొదవు ముక్తి యది బ
రువే-ని సగుణాత్మధ్యానమును జేయు మనెఁ .గామ. ౬

ఉదయార్కోజ్జ్వల హృదయా బ్జకర్ణికా-భ్యుదయాన
నమున సదయామతి సీత, గదియ నలరువాని కన్గవయుదు

మై-పొదలువాని మెఱపుఁబోలుచేలమువాని, కదలునందెల
వాని విదిత వనమాలాన్వితునిఁ గౌస్తుభహారాం-గదకటకకి
రీటుని వీరాసనుని, ముద మొదవఁ గేలుదోయి విల్ల-మ్ములఁ
దాల్చి కొల్చులక్ష్మణుతో, సరసహాసముగఁ బల్కు-రామ-
చంద్రు ధ్యానింపు మధిపా యనె నతఁడు .కామ. ౭

ఈరీతిగ హరిచారిత్రము వినుము-చేరి శుభము లవ్వారి
జన్మను, సారిగా వచ్చినదురితౌఘములు- తారి చెడుఁ గా
ర్చిచ్చు, దారిలో దూదికంట్లము నిల్చి హెచ్చునా-సారాచా
రవిచార పౌలస్త్య, వీరవైరము మాని-భక్తుఁ బూని శ్రీరా
ముఁ బరిపూర్ణు నొకని సదారూఢభావభావితుని శంకర నా
మరహితుని శేషాద్రినివాసుఁ దలఁపు మనె మారీచజుఁడు
.కామ. ౮

౧౪. కన్నడరాగము-ఝంపాతాళము.

పల్లవి.—శరణాగతసంభరణా- వరకుండలయుగళీకృతతు
హినకర చండకిరణా వినవే॥

అను.—పరతత్త్వాశ్రియమహత్త్వాద్యసుధాత్వ-సరణీఁ బ
ల్కు కాలనేమిపయిన్ రావణుఁడు, కెరలి తప్తఘృతంబున
జలంబుపడినక్రియ మెఱసి నిను నీచుఁ దు్రింతు నామాల
మీఱితి వరులచే లంచములు గ్రహించి రామకిం, కరుడవై
గురునిపోల్కి బోధించెద-వరరే యనఁ గినుట వల దంచుఁ
గదలె వాఁడు ॥శరణా॥

హిమవన్నగపార్శ్వమున వ-నము రచియించి కాలనే,

మి మునివలె నుండెను మించి స-మీరసుతుని భ్రమించఁ దలంచి, యమితజవంబునను గపివంశమణి వై-హాయసాధ్వ నేగుఁచో ఋష్యాశ్రమము గని, తెమలి తోవ తొలఁగె నని కలఁగి యాసం-యమి నడిగి పోద మనుచుఁ బోయి తత్పా దములకు మ్రొక్కి- దేవ-తా రామభద్రుదూతను హ,నుమం తుఁ డనఁ దగువాఁడఁ దృష్ణాతురుఁడనుద-కముఁ జూపు త్రా వి పోయెద నని పలికె.శరణా. ౧

అమృతోపమమౌ కమండలంబుతో- యంబు ద్రాపు ఫల నిచయంబు దిను వినుతంబు, సమంత్రముగ నిత్తు నౌషధంబు సమరతలంబునఁ బడినలక్ష్మణుఁ డెలమి నమరసర్వాంగా వేత్తను గానఁ దెలిసెను శ్రమము దీర్చుక రేపు పొమ్ము రేపకడ తమకనిన మున మౌని పలుకఁ గుంభజలమల్పము-కొమరున సరస్సున వ టుని బంపి చూపింపు, సుమహిత మనుపమాననుతువెంట శి ష్యుసం-పి మడువుఁ జూపి ర మ్మనెఁ గపటముని॥శరణా॥ ౨

కొలనాద్విజుచే ననిలజుఁడు గాంచి-కోర్కి మించి కను లు ముకుళించి ప్రవేశించి, జలంబు ద్రావెను సంభ్రమించి- బలుమకరి మ్రింగెను హరిప్రవరుఁ దడఁబడ కతండు హస్త, ముల సడువఁగ వెనమొసలి తల వ-గిలి మృతియై మదవతియై చూపట్టె, బలియుఁడ భవద్దయను శాండిల్యశాపము-పోలిసె నే ధ్యానమాలి యనఁగ సురాంగనను, వలదు ముని యనుచు నమ్మ నిటముఁగ గనిన-వాని జంపి విజయముం జేయు మని య ది చనె॥శరణా॥

అతివేగమె యాంజనేయుఁ డటు వోవ-హో యిదేమి యిం
తకు రాని యుపదేశ మి త్తుత త్త్వదక్షిణ యీ గురుస్వామి
కుతుకము నందిన మే లనన్ - గొ మ్మనుచుఁ గుటిల,యతి
ని ముష్టిఁ బొడువ సురా హితుఁ డపుడు-మతకములు పన్నం
గ మరున్నందనుఁ డన్ని, వితగా నొనర్చి కాలనేమిని వధిం
చె-వితతమాయి కుని భటుండు మాయలన్ బకునె, శ్రిత
హితుఁ డాక్షీరాబ్ధి దాఁటి ద్రోణగి-రినౌషధములను గానక
గిరిఁ దెచ్చె॥శరణా॥ ౪

ధరణీధర మత్తెత్తి మారుతి డించి రామ-ధరణీశుపాద
సరోరుహముల జోహారు, శిరం బొరయ సల్పెను వేమాఱు-
నరహరి యాదరణ మెఱయఁ బ్లవగ కే,సరికుమారుఁ గాఁగి
లించె సుషేణుఁ డౌషధ-వరము గొని సౌమిత్రికి శీఘ్రమిూఱఁ
జికిత్స, నెఱపె నట నిద్రవోయి లేచినటుల నెంచి-నిలు నిలు
దశానన పోరిగొందు నీ వెచటఁ, జోరఁగల వనుననుజన్మ
శేషాచలేశుఁ డగురఘుపతి-శిరము మూర్కొని యెదనుంచె॥
శరణా॥ ౫

౧౫. ఉసేనిరాగము-ఆదితాళము

పల్లవి.—మాంగళ్యమూర్తి లస-మానకీర్తి హృతాంగజార్తి
వినవే॥

అను.—ఉప్పొంగి రామభూజాని ప్లవఁగ-పుంగవులతోడ
నప్పుడు విభీషణోపాయ,సంగతుఁడై పోరికిఁ గడఁగె-నం
గదాదులు, తుంగగిరిశృంగతరుధరులై-సింగములభంగిని

జెలంగిరి. మాం.

రావణుండు కొలువు-లో వసించి రాక్ష-సావళిన్ గాంచి
యనె రాముఁడు నరుఁడా, భావింప మదిని నారాయణ-దే
వుఁడు విధినిర్ణయ మతనిచేఁ, జావు నాకిది ని-శ్చయ-మిందు
కై వగవఁ దుదిని విన నరణ్యుఁ డౌ, భూవిభుఁడు ననుఁ
దిట్టై-మావంశజుఁడై హరి నిను, నీవారిఁ జంపు నని పూనెఁ
గావలయుఁ బని గాక కుంభకర్ణు ని, ద్రావశుఁ దోడితెం
డని పంపభటు లేఁగి-వేవిధముల బోధ-గావింప మేలుకొని
సురఁ, ద్రావిభుజియించి చని సభ న-గ్రజుపదములకు ద్రొ
క్కె ననుజుఁడు. మాంగ. ౧

ఆదరించి తొడమీఁద నిడుకొని-మాదశగ్రీవుఁ డనియెఁ
దమ్ముఁడా, పోఁద్రోయ రానివెత వచ్చె నిం-కేది గతి దీనికి
ననిలోఁ గ్రి, వ్యాసవరులని,ర్మూలన మాయె-నీసుకృపాణి
చేఁ గాని రా, మాదిశత్రువులగర్వ మడఁగ-దనిన నవ్విభ
తఁ డన్నను గన్గొని ము,న్నేఁ దెల్పలేదా దీన చేటగు నని
సీ-తాదయిత సాక్షాన్నారాయణుఁడు ఈ, వాడు లేల నా
రదమౌని యొకనాఁటినిశి గిరి-మీఁద నే నున్నతఱి రా న
ద్రముఁడనై యుదంత మడిగితి ననె. మాంగ. ౨

దేవతలు మీచేనం జెడిపోయి-రావణకుంభకర్ణాసురుల
చెట్ట మీ,తో విన్నవింప వచ్చితి మన శ్రీ-దేవుఁ డనుకంప
మతి నెఱమాన్చి, వేవే నిలింపావనుఁడై పరమ-పావనరఘు
కులోద్భవుఁడయ్యె నని సురముని పనివినె గణుతింప రా,

మానవతారసహస్రాంశసమ మాహరిలీ-లావతారము లెవ్వ
డైన రాముఁడు శివుఁడు, నీవు రామునిభక్తి సేవింపు మెవ్వ
రావిభు భావింతు-రనఘులై వా-రవ్యయసుఖము గాంతు
రనె దైత్యుఁడు. మాం౧. ౩

కుంభకర్ణువాగ్దంభము విని యార-క్తాంభోజముక్రియ ముఖ
మొప్పఁగ, జంభాహితారాతి నిను రణవి-స్రంభముకై రా
వించితిఁ గాన, దంభము మేరా రాఘవాస్త్ర-శుంభత్ప్రహా
రహతి నేచి విజృంభించలేవు నిద్రించఁగఁ బొమ్మ తం-డ్రీ
యనె నారారా దు, ర్లంభితశాఖలతాంతబంభరుఁ డితఁడజ
నీ-లాంభోధరమువలె మే నమర, గోట దాఁటి దిక్కుంభిక
రసదృగ్గా స్తంభవిన్యస్తనిస్తుల-దంభోళిసమధికగదావష్టంభుఁ
డై వెడలె ఘటకర్ణుఁడు. మాం. ౪

పౌలస్త్యుఁ డబ్ధియుల్లోలముగ నార్చి-యాలమునఁ గపులకీ
లెడలించి జము, పోలిక రాఁగా నన్నకు మ్రొక్కి-లీల నను
రా గావహదృష్టి ననుఁ, బాలింపు వేగ విభీషణుఁడ-మేలెం
చి బాగా బోధించితి, నే లంకేదుర్ని జగ-న్నేత రాముఁడు
సీత ని మ్మతని కనిన, నాలోఁగాఁ గరవాల మెత్తి చంపఁ
గడఁగి నిన్నుఁ బోఁ, దోలె రామునిచరణ-తోయజముల్
చేరితి, నాలసన్ముఖుఁడై యతం డతనిఁ గాఁగిలించెను, శ్రీల
నొంది చిరంజీవి వయి-శేషగిరిపతిదయ మను మనెను. మా.

౧౬. మధ్యమావతిరాగము-ఆదితాళము.

పల్లవి.—సారవచనరచనావిశారద - క్రూరదానవఖండనవి
శారదా.

అను.—ధీరుఁడై కుంభకర్ణుఁ డనుజుని- నూఱడించి మదిం
చియుండుట, వైరుం డొప్పు డని తెలియ దని సమద-
వారణమువలె మాఱె గప్పుల. సార.

దండిమగల నగలించ గని కోదండ మెక్కిడి యఖండా
శుగములు, చండభానుకులుండు దనుజవరు గండడంచి మిం
చి, నిండుకోపమున ననలాస్త్రమున ఖండించెను వానివల కేల్
మెండుగా దానిక్రింద నగచరులు బెండాబెడసరె పడిరి విను
సార. ౧

పెఱికినపగచే సాలవృక్షము బెఱికికొని నృకేసరికెదురై
వా డెదురుగా నరుదెర గని రామ ధరణీపతి చెంగలువ, స
రము బాగొనరెతూపుల జూవి పఱపు బాహువు నఱికె నైం
ద్రిమున, బరువుతో రా నసురకాళ్ళుద్రుంచె బలే యన నే
ల పిల్లతూపుల. సార. ౨

దొర్లి దొర్లి బడబాముఖముక్రియ దొడరి నోరు దెఱచి
చంద్రునిభ్రమింగ, దర్పరాహెవుమాడ్కి రామనే దార్పగని
యుప్పొంగ, దీర్ఘ వాయొల్ల నిలిచి తలయిల ద్రెళ్ళ నేసెను
రాముఁ డైంద్రమునఁ, బొర్లిగింత లిడి పడె శిరము లంక-
జోరనఁ దనువు నీరధిఁ బడెను॥ సార॥ 3

లంకగోపురము గూలెఁ దలతోఁ-బొంక మేది జలధి క్షిమిం
గిలాది, సంకులం బయి తనువు పడి చదిసె-జంతుకోటి వెలఁ
డి, జంకు జేఱ నతించివిరులజడి - పొంకముగ సురలు కురిసిరి
అరుణ పంకజాతనేత్రుని ధనుర్బాణ- పాణి యగు కోదండ

రాముని॥ సార॥ ౪

రామునిగనుఁగొన దేవమునివరు- లాముకొన్న ప్రేమ నేఁ
గుదెంచిరి, ధామముచే దిశలు వెలుఁగ నుతించె-దైవతముని
హారిని రామచంద్రుని గురునికువలయ- శ్యామసుందరశరీరు
ని దయా, సామదృక్కుమితనిజాశ్రితార్తిని- సామిని శేషశై
లాధిపుని॥ సార॥ ౫

౧౮. పూరిరాగము- త్రిపుటతాళము.

పల్లవి.—శ్రీజగన్నాథ హేరఘువర దయానిధే. శ్రీజగ.
అను.—ఓజసా తేజధారణాశ్రయపరమాత్మన్. శ్రీజగ.

కారణకారణా పాపనివారణా- నారాయణ, ధారణాశ్రి
య పరమాత్మన్ శ్రీజగ. ౧

నిఖిలలోకాధార సాక్షి- న్విశ్వస్య బోధాకర, సుఖరూప
మాయామనుజశరీర. శ్రీజగ. ౨

పూర్వోఽపిసర్వేషాం నవిభాసి-స్ఫురసిత్వమమలాత్మనాం,
కర్తధారో భవాంబుధే. శ్రీజగ. ౩

ఉన్మీలయ న్నేత్రేసృజసి జగ-దుపసంహరిసి, చిన్మాత్రే
త్వయి సన్మనోనిమీలనేన. శ్రీజగ. ౪

యస్మిన్ భాతీదం చరాచరం- యస్మాద్భవతీదం, తస్మై
బ్రహ్మణే తేనమః. శ్రీజగ. ౫

ప్రకృతిపురుష కాలవ్యక్తావ్యక్త- బహురూపిణం జానంతి
యం, సుకృతినోఽముష్మై రామాత్మనే నమః. శ్రీజగ. ౬

త్వాం సర్వజగదాధారమూర్తిమితి- వదతిశ్రుతి రవికా

రం సా, శంసతి జ్ఞానరూపమూర్తిం. శ్రీజగ. ౭

నాధిగచ్ఛంతి బుధా. శ్రుతి- వాదిన స్త్వత్ప్రసాదంవినా విరోధాద్వైతికా ద్దేవనిశ్చయం. శ్రీజగ. ౮

విలసతో మాయయా నక్వచిదపి- భేదో రవేరివ తే, జలదర్పణాదిభి ర్దృశ్యతే రామ. శ్రీజగ. ౯

రామత్వయి భ్రాంత్యా కల్ప్యతే మనసా వి-షయాః తవ రూపం దృశ్యాం కథంక, థయదృశ్యాభావే ధ్యానం కథం. శ్రీజగన్నాథ. ౧౦

హేహరే తేఽవతారేషు రూపాణి సుహృదో ధ్యాయతియే, తే హితరతి సంసారార్ణవం॥ శ్రీజగ॥ ౧౧

కామాదయ శ్శత్రవో భీషయంతి- మామర న్మార్గాలాయ, థా మూషకాః తథా ధర్మసేతో॥ శ్రీజగ॥ ౧౨

మానసవాక్కాయిక్తై స్సద్గురురూప- ధ్యానస్మరణార్చనేషుఘు, రీణానాం సంసృతి ర్గోష్పదాజాయతే॥ శ్రీజగ॥ ౧౩

మా మన సేవే త్వాం శేషాచల- స్వామిః మణేరఘూణాం సు, నామః శ్రీయోధామః॥ శ్రీజగ॥ ౧౪

౧౮. పంతువరాళిరాగము-ఆదితాళము.

పల్లవి.—భాషాపతినుతగుణ-భాషా పరితోషా-యోషా మణిరో వినవే॥

అను.—దోషాచరాంతకుని-భూషించి నారదుఁడు తా, రాషాణ్ముఖ్యులఁ గూడి-భాషింపుచుఁ జనెను, భీషణాకృతిని గుంభకర్ణుఁడు-పేర్చి మృతుఁ డౌట విని దశాననుఁడు,

రోషశోకములు పెనగొనఁ గొలువు-లో నేలపైఁ బడి
మూర్ఛిల్లెను॥ భాషా॥

భోరునఁ గన్నుల నీరు వరదలై పాఱ-నోరు దెఱచి య
డలెను అనుజుఁడా యని, పేరు నుడివి బడలెను-వీరుఁ డా
యింద్రజిత్తు, కారుణ్యమున నెత్తి-శూరు లేస్తురె నేను, పోరు
న రాఘవు బీరమున్ బిరు దితం డన మాన్చి-నీరుణంబు
దీర్చెద ననుఁ బంపఁగ, దే రాత్రించరశేఖరా యన-గారవ
మున సెల వొసంగెను. భాషా. ౧

సన్నాహసేనలతో-విన్నాణియై రావణి-కన్నవా రెల్లఁ
జెలఁగఁ గని కుంభిలలో, నున్న యనలుఁడు వెలుగఁ-జెన్నా
రు చెంగల్వలు సిగఁ జుట్టి సూర్యపుటము, పన్నె పటము కటిఁ
గట్టి-మిన్నా కెంజాయపూఁత, సన్నఁగా నలఁది స్రుక్స్రువాది
కు-శోన్నతా స్తరణుఁడై హవిస్సు వ్రి, సన్నమతి నగ్నయే-
స్వాహా యని నిష్ఠ తా వదలక వ్రేల్చె॥ భాషా॥ ౨

ధూమసంతతి భూన-భోమండలము నిండ, రామావనీం
ద్రుఁడు గని విభీషణునిచే-నామార్గము లెల్ల విని, యా మా
యావిఁ ద్రుంతు నే-నాగ్నేయాస్త్రమునఁ జూడు, మా మి
త్రా యనిన నాతో-సౌమిత్రిని బంపు, యామినీచరునికి ప
దునాల్గేం-డ్లాహారనిద్రలు లేనివాని, చే మృతి యనిన నెచ్చెలి
మెచ్చి భూమీశుఁడు తమ్మునిఁ జూచె॥ భాషా॥ 3

శాంతాకారాయ ఆనందాత్మనే నమ-శ్చింతాలతాచ్ఛే
దినే రామాయ సీతా, కాంతాయ పరమాత్మనే యన ల

క్ష్మణుని-సంతోషించి మన్నించి యింతింతనరాని ప్రేమ, నెం
తో దీవించి యానతిచ్చెన్ దాశరథి హను-మంతుపై నెక్కి-
లక్ష్మణుఁడు కపి,సంతతు ల్గొలువ విభీషణునితో, మంతు గ
న్నపరాక్రమాలాపము-లంతంతన్ బలుకుచుఁ జనెను॥ భా॥ ౪

మితి మేర లేనిబల-ప్రతతి గొలువ భల్లూక, పతి జాంబ
వంతుఁడు-బరాబరి సల్ప॥ వాలి, సుతుఁడు సురటి విసరఁజతు
రుఁడై నల్వురు, సచివులతో విభీషణుఁ డా-నతుఁడై కొలువ
నెఱదొ,రతనమున రామానుజుఁడు రణ-రతి మదిన్ ముప్పిరి
గొని నికుంభిలకు వెసన్ జని తదేకనిష్ఠా, న్వితుని నసురవర
సుతుని గనుఁగొనెను-విల్ శేషాద్రిపతిని దలఁచి॥ భాసా॥ ౫

౧౯. శుద్ధసావేరిరాగము-ఆటయశము.

పల్లవి.—శచీసందర్శితమణిదర్పణా మహారణనిపుణా-సమ
దారిదమనా॥ విన వే॥

అను.—శుచిప్రమితాశుగముల నాజి-సుతుఁ డాజిఁజిలుక తే
జీవొర, రుచిం దనరి యింద్రజిత్తుమే ను-రువడించి చలి
యించఁగఁ బంచి, సచరాచరమా జగంబునకు-ప్రచుర
కంటకుఁ డనన్ జనుగ, న్నిచటఁ ద్రుంచి ప్రభూతబలి-
యిడుదుఁ జూడు మని కడఁకతోఁ బలికె॥ శచీ॥

ద్రోహి నీమంత్రములు పనిగొన-వీహుతాశనున కిదె ని
నుఁ బూ, ర్ణాహుతి చేతు నన లేచి-యసురవరసుతుఁ డతని
జూచి, బాహుబలమున నిన్నుఁ జంపెగ-బ్రతికి పోలేవని రథ
మెక్కి-, సాహసంబునఁ జాప మెక్కి డి-శరము లురువడిఁ బఱ

చె నరుడుగ, వే హనుమంతు న్గాగం బగల నేసి-పినతండ్రినిం
గని నీ, దేహ మేల గాల్పనే నను వ-ధింపించం గడఁగితి వని
పలికె॥శచీ॥ ౧

ఓరి నీ విటు చూడు మని చల-పోరి గెలు పెదఁ గోరి
ముంచెను, నారసపుబడి సౌమిత్రి సు-రారికొడు కడఁచె నతి
బలులు, కేరి తూఁటి కటారి సూరి క-టారిపేరిడినలకోరీలఁ,
జీరిచీరి బలారివృతుల- దారి నెఱ నడి వారి మొరవడివడి,
యేరికి నైనన్ జగంబులను-నేఱుంగ మాపాదలిక కదలిక,
మారుమారు మనునదల్పులను- తీర దాకని నొకనోటఁ బొ
గడ॥శచీ॥ ౨

భానునిభ మగుచూడ్కి- నాతీవ్ర బాణములు లక్ష్మణు
ననిలజుని, వీనుల ముఖాబ్జమునఁ బదింట విభీషణు నూటను
నేసి, వానరుల గజగవయగవాక్ష వాలిసుతముఖ్యుల బడల్చి
న, దానవాగ్రిణివి ల్గునిమి రా మానుజుడు వా డెన్నివిం
డ్లైత్రిన, మానక పొడి జేసి సామ్మసిల గా నేసిన బడిమూర్ఛ
దేఱి, పూని యన్యథనువున శరములు పుంఖానుపుంఖములు
గ పనిచె॥శచీ॥ ౩

మేటిమాయల వీడొక పాటివా డనక తెగటార్ప వి,
దేటికి ననువిభీషణునుడి పాటించి యారాజమౌళి, సాటిలేక
శ్రీరామచంద్రుడు సత్యసంధుడు విజయశాలియు, నేటి మా
ట నిజమేని వీని గీటడంచు నని యైంద్రిబాణము, నూత
నమణికుండలములు సకి రీటరుచిరతిలకం బగుతల, పాటిదప్పి

యిలపై బడె సుర కోటి పొగడె సృకిరీటి యనుచు. శచి. ౪
ఒత్తెశంఖము స్వర్ణపుంఖము హత్తి ధ్వని జగము నిండగ రఘు, సత్తము డరసి యిది తమ్ముని జయనాద మని పొదలె మదిని, క్రొత్తగాయముల దగుమైత్రో గువలయేశ్వరు పాదయుగళి, నొత్తమిల్లిన గ్రుచ్చి కౌఁగిట నునిచె లక్ష్మణు నాపై రమ్మనిన, జిత్తము కరుణాయత్త మగుట జేసి గెలుపు గొని వచ్చితి బురు షోత్తమాఖ్య నొనరి శేషగిరి నుండు హరి పనుచు బలికె సతము. శచీ. ౫

౨౦. శంకరాభరణరాగము-ఆదితాళము.

పల్లవి.—వినవే రమాదత్తకర్పూరవీటి వినుతాంచితగుణపేటి

అను.—వినవే రావణుఁ డింద్రజిత్తగచరులమేటి వీరులఁ గూల్చి కూలె సౌమిత్రి జయధాటి. వినవే.

ఇల బడి మూర్ఛ మునిఁగి లేచి పెంచు వలె నోరుపగుల బలవించు దిశలు, తిలకించు దలవంచు హా దైవమాయంచు ధృతి డించు దను వేటి కని యెంచు నుస్సురంచు. వినవే. ౧
ఈతనిగుణము లెన్న నూఱో వెయ్యో యిఁక గెల్పు పాతరో నుయ్యో గొయ్యో తల, పోత లాయెను విన నవ్వులా యెగుయ్యో మొఱ్ఱో యనునిలిం పులగుంపుల కయ్యో యనెను. విన. ౨
బ్రతు కేమిటి కని యింతటికి సీతా సతి హేతు వని లోకమాత యనక,కతరుడై కత్తి దూసి వ్రేయఁగడఁగె బ్రాత మితి యనవలె నిది రావణున కేటిసేఁత.విన. ౩

స్వామి బ్రహ్మకులమునందుఁ బుట్టి-చంపుదురా స్త్రీలఁ
బట్టి శ్రీ, రామావనీంద్రుని గెల్వుమని గిట్టి- రమ్మని తిగిచె
ను సుపార్శ్వుఁడు చేపట్టి॥ విన॥ ౪

తిరుగ వచ్చి కొలువుకూటముఁ జేరి- త్వరగా మంత్రులఁ
జేరి కరి, తురగాదుల నెక్కి రమ్మని శేషగిరి-హరిఁగాఁ దలఁ
చె రామచంద్రుని మాయదారి॥ విన॥ ౫

౨౧. కన్నడగౌళరాగము- ఆదితాళము.

పల్లవి.—వినవే కోదండధారిణి-విమలయోగిమానససంచా
రిణి॥

అను.—ఘణంఘణమని భేరి మ్రోయ రా- వణుండు లోకవి
ద్రావణుఁడు వెడలె, దనయుఁ డింద్రజి త్తరిచేఁబడినఁ-
దాఁబంతమున నరికి సేనలతో॥ విన॥

బాణతూణకృపాణధనురాదిబహుసా - ధనములఁ దనరు
తేరెక్కి వెళవెళంద్రొక్కి పొగరెక్కి, తానిక్కి చూచె రా
మునిచక్కి-నాగెమగు విల్లెక్కిడి నృపతియు, నూనమైన నారా
చతతి నొంచె-మేను స్రుక్క నెత్తురుల్ గ్రక్కదలమించె నొ
క్కనినైనఁ జిక్కనీక. విన. ౧

మిసుత లగ్నిలోనఁబడి కాలిన-వసువై దళములు నృహ
రిచే, బడిసనదిగని నొచ్చి వెన్నిచ్చి- కడువడిఁబఱచి లంకఁ
జొచ్చి, ఘుడమితేఁ దేడ నే నేడ నని-పొగడెఁ బదినోళ్ళహ
రిని రావణుఁడు. విన. ౨

నేను రావణుఁడ నిది లంక యని-తానెఱిఁగి శుక్రిసన్ని

ధిఁజేరి, పూని మ్రొక్కి కోర్కి వినువైరి-నే నోర్వఁగ నెల విమ్మనిన నోరి, దానవాధిప యవిఘ్నముగఁ బా-తాళహోమ మొనరింపు సపరికర, మైనరథ మగ్నియం దొగిఁ బుట్టు-న దెక్కి శేషగిరీశు గెల్వుమనె. విన. 3

౨౨. నాదనామక్రియరాగము- ఝంపాతాళము.

పల్లవి.—వినవే ఘన వేదాంతవనపాలికాదివ్య - మణిమాలికాబాలికా.

అను.—దనుజాగ్రిణియనేక దానవానీకములఁ - దనచుట్టు కావలుంచి హర్షించి, మొనసిపాతాళగుహ-ననలునిఁబ్రతిష్ఠించు, మనుచు గురుసూక్తిహో-మము సేయగాఁదొడఁగె. విన.

ధూమసంతతి భూనభోమండలము నిండ-శ్రీమన్నృపాల తిలక యభిచార, హోమ మిది యనుచుఁ బలుక విభీషణుఁడు- ప్రేమగొనియాడఁ బంపెను హనుమదాదులను, శ్రీమీఱ నంగదునితోఁ ద్వరతో- రామువిభునికి మ్రొక్కి లంక కోటలు దాఁటి, వేమాఱు వానరులు- వెదకిరి దశాననుని. వినవె- ౧

సరమ యనుచెలి విభీ-షణునిపత్ని యతఁడున్న తెఱఁగు చేసన్నఁజూప గుహావాకి- మఱుఁగుశిల మరుగుఁ బాపఁగఁ గప్పులువడిఁ, జొఱఁబడి మహామాన-ధరుడైన రావణుని, శిరములుగనఁగ గుదియల మోఁదఁజల, మఱియచలుఁడై యున్న-తఱిని మందోదరిని, కురులు పట్టీడ్చి- గొనివచ్చె

సంగదుఁడు. విన. ౨

రైకముశి వీడెఁజీ-రయుఁ బోఁకముశివీడె, శ్రీకరం బగు
మొగంబు- చెలు వెడలె, నాకుమారరత్నంబు లేమి నిటు-
చేకూడెన నేఁ గాకలీకలరవ- కోకిలకంఠముగ నడలెను, ఈక
ష్టునకు లేదు-యింతైన సిగ్గు ఇఁక, రాకొమరుచేఁజావ-రాదే
యని పొగిలె. విన. ౩

వాలుగొనిలేచి సతి-వదలుమని యసురపతి, వాలి కొడుః
కును వ్రేసెను హోమవిధి, చాలించిమది రోసెను కపులుచ
ని-రాలోలనయనను లాలనముఁ జేసివగ, పేల దైవాధీనము
ఈజన్మము, బాలజ్ఞానావలం- బన మొందు మజ్ఞాన, మూలం
బు దుఃఖమోహా-ము లహమ్మతియు ననెను. విన. ౪

దేహాద్యనాత్మలం- దీయహంబుద్ధివల, దిహసంసృతిమూ
లము అజ్ఞాన, దోహాలము లింద్రిజాలము ఇది చాలు, సోహ
మనవలె నాత్మ- శుద్ధుఁడజరుఁడుమమ, త్వాహంకృతివిరహి
తుఁడు సాక్షియుతుఁడు దేహేంద్రియప్రాణ- ధీకాలకర్మన,
న్మోహాదులకు ద్వంద్వా-దులకు ననె దశముఖుఁడు. విన. ౫

నేను రాఘవులనని- లోనణఁచి వత్తునిటు, రానేరకున్నఁ
జత్తుము క్రియనుని, ధ్యానంబుఁ జూరఁ బుత్తునెటులైన, గాని
మ్మవల సీత-ఖడ్గమునఁ దునిమి నీ,మే నగ్ని వేయవే ననుడా
యవే, నానాతినాఁడ జగ- న్నాయకుఁడతనిగెల్వఁ,గా నీకుఁ
గాదన్య-గుణదుర్జయుండనెను, విన. ౬

మును మత్స్యకూర్మకిటి- మనుజమృగవామనధ, రణీదే

వతారూపమై నాసామి, మనువంశభూపాల- కనిలింపరాజపి
తృ, గణముల సముద్ధరించెను ఇపు డిలను, నినకులమున శ్రీ
రాముఁ-డనఁబుట్టి నినుఁజంప, మొనసి పరుఁడు ప్రధాన-పు
రుషేశ్వరుండనెను. విన. ౭

అరసి నృహరికి సీత-నర్పించి తమ్మునికి దొరతనం బిచ్చి
మునివై యడవిలోఁ, దిరుగుమికసుగుణఖనివై యని పలుక,
తరుణిలే దజ్ఞతను సీతలక్ష్మిశ్రీ, హరి రాముఁడగు నతనిచేఁ
జచ్చి చెచ్చెర నైక్యమొందఁ నిటు- చేసితిని శేషగిరి, వరు
నిగిరి గంటి నని-వచ్చె సభ కలసురారి. విన. ౮

౭౩. కేదారగౌళరాగము- ఆదితాళము,

పల్లవి.—రతిసంవీజ్యమానసుచామ-రాలోలనీలాలకావినవే.

అను.—చతురఫణితిసుతాపసనుతగుణజాలకా అతిక్రోధనలు
దివ్యసాధన లగ్నివర్షవృశ్చికసర్పరోమము, లతులబలులుఖడ్గ
రోమాదివీ-రాగ్రేసరులు రణజితారులు, కుతుకముతోఁ దే
రుల్ మదగజ- ఘోటక ఖరముల స్వారుల్ తన, రథము
చుట్టు మతముబిట్టు చూపుదు- రారావణుఁడు శ్రీరాజి
లెను. రతి.

మణికిరీటమకరకుండలముల- రుణకిరణములరుచి మీఱఁ
గా, ఘనచిరత్నరత్నఖచితమగు పత-క మురమునందొరయ
గా, కరమెన న్వేల్పుటేనుఁగుదంతము- తగుతోడవయ్యును
గెలుపు దిశాంతము, లను చాటునీటు దోఁప నన్యులు బ-
లారె యితఁడు బలారివై భవు, డనుచుఁబలుకఁగ దశాననుఁ

డా- హావకేళి కడరేఁ ద్రిదశావళి, దనుకడాకాల గండపెం
డేరము- దాల్చి బిరుదై మేల్చిరాకున. రతి. ౧

ధాణధణమనెడిభేరీరవము- తవిలి భువిని దివిని నిండ,నా
నెమగువాహనములఁ ద్రిప్పువి- న్నాణము కోర్కి- పండ,బా
ణతూణకృపాణాదు లిరు- వదికరముల నిరవై తనరెనెర,నా
ణిముత్యపుసరు లఱుత మెఱయఁ బ్ర-వీణతననికివెల్వడె సభ,
జాణ యగుట గాంచి హరి విభీ-షణునిమాట లాలించియీ,
షాణి మెచటఁ గాన మని తల యూఁచి- పొంగారుబంగారు
విల్లో నెరతి.

వీనె విూటిన సూటిగా వకా-ర్వి టంకృతిఁ జేసి, తూణ
యుగళి వెడలిపారలు శరాళి, మెరయఁగఁ గేలఁ దీసి, పా
ణిలాఘవము రణపటిష్ఠతఁ-బరులు మెచ్చఁ జేతు నను నిచ్చఁ
గపి, శ్రేణిలో నలరేఁ జుక్కలరే-తేనివడువున శ్రీనివా
సుఁడు, జాణతన మయారె బళి మ-ఝ్ఝారె యని జగతివా రె
ల్లను, వాని నుతించిరి శేషాద్రిపతి పు-రాణపురుషు, డనె
నయమెుత్తఁగి .రతి. ౩

౨౮. నాటరాగము-ఆదితాళము.

పల్లవి.——సుభభవ యనవే-సఖిమణి వినవే. ప్రఖేలనము
గ విభాకరాత్మజ- ముఖాగచరవీరులనొంచి నిజ,

అను—— సఖాళి నలరించి మొఱఁ బెంచి లిఖించి నటుల,
జరించి వైరుల, ముఖాముఖిగ నెదిరించి చలము మించి ద
ట్టించి దశ,ముఖుం డఖిలాస్త్ర-ములను బరఁగించి, యఖండ

గతి నలయించెఁ గపిబలము .సుఖ.

రావణా యిటు రమ్మని హనుమ్మని యావాయుజుఁడు పిడికిటఁ బొడువ సోలి వ్రాలి, చావు దప్పె సాలికేల నాల మనుబాళి- దేలెఁబో నెత్తురుల్ పదినోళ్ళ, బావిసీ శ్లోఘ్యకపి లేలో యనఁ గా వెడలెఁ దలలో మెద డదరె, దేవుఁ డెఱుఁగు నీదెబ్బ కబ్బ యని-భావించి యాంజనేయ బళిబళి పరాజేయ నీ-లావు మెచ్చవచ్చు నన బ్రదికి యు-న్నావిదే టి బలంబనెఁ బ్లవగమణి .సుఖ. ౧

ఐన నీపోటు గని మాటుకొని నే నవల నిను వ్రేతు బ్రతికెదవో నా, నానరాశనుం డఱచె నడచెసుంతలో నా-కొను విర్వొరఁబోవ నంతలోఁ, దానిలం దొరంగె నంతలో ననె మేనెఱిఁగి యింతలో హిత వొదవె హా నిశాచరా యన్న యదరున, దానవుఁడు మార్కొని పైఁ జని మెన లేని బలు పెనుపై యున్న, మానెఁ బోరు హనుమంతుఁ డల వాలి సూనుఁడును నలుఁడు నీలుఁడు నమరిరి .సు. ౨

ఓరి యగ్నివర్త యిటురా పటుముష్టి నొంతు నని కృతాంతుఁ డనడాసి, మాఱుమా టాడనీ కనిలజుఁడు పేరడచెవాని సర్వరోముని, తారకొడుకు నేర్చరో యన ద్రుంచె దీరె నలునిచే ఖడ్గరోముము, సారాహిపవనభీముడు తెగ టారెను వృశ్చికరోముడు ఘో, రారికాలు డగుసీలిచే నొంతహాయి జెందె జనము రామునిచెంత .సుఖ. ౩

లంకానాథు డంతట నొకట లాతిచేత హితులు తెగుట

గని, బింకం బొనర మార్వి మీాటి యుర్వి పీఁచ గర్వి యను కిన్కఁగ, శంక లేక రఘునాయకు నెదిరి శరాసారమున ముం చెను హరి, మంకుగొని యలంచెను కలంచెను కంకపత్రి ఖలాస్త్రములనహో, శాంకరి నే నేమందునే జగములం దె ఱుఁగ ముందుఱక, లంకె ఘోరరామరావణులిటు లాహవం బొనర్చి కనులవిందు .సుభి. ౪

భూమిపై నిలిచి హరి రథముపై యామినీచరు డుండ వేల్పుల, సామి మాతలీ రథంబు రామమనుజపతి కీయ, వే మిా మిాదాసుడఁగ గ్రహింపు మి దెందు జయదమని మ నవిగా దెల్పు, నామేలని త్వరగా రథము తగ వామి దెచ్చి కౌసలేయ యిదిసు, త్రాము డంపెతే రెక్కి రావణు గొ ను మని మ్రొక్కి ధను, ఏ మహాస్త్రముల్ తురగముల్ నే ని వెల్ల శేషగిరివరా నీ వనెను .సుభి. ౫

౨౫. కేసుప్తి రాగము-ఆదితాళము.

పల్లవి.—కౌమారి రామరావణులసం గ్రామనిపుణతలు విను శ్రీమిాక్షి.

అను. సామజరవముల్ వశానిమిత్త సామర్షములై పరస్ప రంబు దీమసంబున నిలఁగ గలుగుక్రియఁగ భీమవిక్రమములం దలపడిరి, హైమపుంఖకంకపత్రిశితసా యకసహస్రములు మహోమహములై, సాము జేసి యేసి రెంచి నుతించ దామర నగర్భున కలవి గా దనగ .గౌమా.

అగతప్పునరాగతాది సమమోగ ప్రయోగకృతప్రతికృతు

లయి, యాగి యొక్కరి నొకరు హుంకరించిరి ఏగి మార్కొ-
నిరి తొలుత సఖి గరిమ ధనుర్జ్యాలతాటంకృతుల్ భూనభోం
తరంబు నిండ, గా గుణింపుచు గురుల్ దప్పక కళాగురుత్వ
ముల బల్ పొదలికల బాగుగను శిలీముఖము లలవు మయి బ
అపి పరాక్రమముల సింహముతో, నాగ బోరిరనిని జేరి
యామానవదజ. గౌమా.

వింటనుదశవదనుడు పదిటబండ్రెంట నిరువదింట గడున్
వడి సేయ, నంటి వాని నన్నింటి తూపుల బో గొంటినో నేసె
రామవిభుడు సుర, కంటకు నపు డాజ్యాహుతి ననలు కై నడి
నత డాగ్రహించి యేబ, దింట నొంట నూటః గనలి పవి
వంటియంబు వాటంబుగను మి, న్నంటి కవాటంబనబరగు
వాని యురము లక్షించి యిలాధిపు డద రంట నేయ నల్ల
మాయలరావణాసురుడు సోలి తెలిసెను సొక్కనను . గౌ.

మాతలి తెచ్చినహరిస్యందనము నాతఁడె నెక్కి నృహరి స
కోదండాతతశరుడై జ్యారవమున బ్రహ్మాండము నిండ మో
హరించెను, చాతురి నసురాధీశుడుః స చేతనుడై రామాధి
పునెదిరి, జాతరూపరత్నాంచితతాణ- జాతము బ్రయత్నం
బుగనేసె, సీతాపతి మేరుస్థిర ధృతియై తనవి, ఖ్యాతి హెచ్చ
నంత నెచ్చరించిక-నాటులలరననురు లదరఁజేర్చెఁ. గౌమా.

రావణుఁ డనలాస్త్రము నేయ శ్రీ-రాఘవుఁ డనలాస్త్ర
మునసె మాన్చె, దైవమున నేదైవాస్త్రము మరల్చె- దైనత
నృపవతంసము అస్త్ర, కోవిదుఁడై రాక్షసరాజు కా-కోదర

క్రూరాస్త్రముఁ బరఁగింప, దావశిఖాముఖముల్ భుజగములు రావెడందనఖముల్ గలగరుడా, ఖ్యానపుంఖాస్త్రము పుం రత్నం బరసిప్రయోగించె జయోన్నతిన్, యావిహంగమా స్త్రములింగాభ గాంబకము లయ్యహిశరములఁ ద్రుంచెఁ. గామా. ౪

నాగాస్త్రము ప్రతిహతం బయిన బాణము లడరించెను శతంబు సహస్ర, మాఘురుభుజుపై లంకేంద్రుఁడొకట హరి సారథి నొంచి యతంద్రితుఁ, డై గననై యాశక్రి కేతువు- ననినిం బడఁగ నాక్షణమున నేసి, శీఘ్రగరుచ్ఛరములఁ బూన్చి పరిహరించె వాహనముల నైందరిమున, మూఁగినసురఖేచ రవరాప్సరో-మునులు విభీషణుఁడును భీతిలి రి,గాగచరులు యూథవరులు మైనా- కాదియనఁగా దశముఖుఁడు గర్జించె. గామా. ౫

నిటలతటభృకుటియై కన్గవగ,న్నెరు కెంజాయకుఁడీశుడో యనఁ, బటుతరక్రోధాగ్ని నసుర కాలినను వనఁగవి నృప కిరీటి విలు, దిటవుగఁగొని టంకారముఁ జేసి చటులశరముల లంకాపతినేసి యు,దుటు నగండడంచి కపులకును-తోషము గావించి యాక్రమించి, కుటిలాత్మకునుడు కార్వఁగను జగద్గు రుకోపం బౌదవఁబ్రతాపంబునఁ, బటిమ నంతకుం డనం దగెను హరి పరుసునఁ జరాచరములు నెరబెదరెఁ. గామా.

పుడమి గడగడవడఁకె రావణున కెడదభయంబు దొడఁ గెఁగుపితుఁ డగు,పుడమి తేని కానిశాటేంద్రునికిఁ బోరనుప

మమయ్యె నిఁకెట్లొకో, గడు సిదియనుచు సురల్ విమానా-
గ్రములనుండి కిన్నరుల్ గనుంగొని, కడక రెండురూపులు
దాల్చెననంగా ధృతశరచాపులు దలపడి, యుడుగక సప్తాహో
రాత్రములు స-మున్నతి నొందొరువుల నొంచుచు వా,రడ
రిరందు రఘుకులేంద్రుఁ డగుశే షాచలపతి ప్రబలె సుకృతి
యగుచుఁ. గౌమా. ౮

౨౬. వసంతరాగము- ఆదితాళము.

పల్లవి.—విను చెలి.

అను.—విను చెలి రాముఁడు కడువడి గెరలి- తనువునఁదూ
పులు నినిచి చేసరళి- దనుజునితెక్కెము నఱికెందరలి.
విను చెలి.

తెలిదామరల నేఁబు కనుల హరి చెం-గలువవిరిచెలువుదా
ల్చెను, తలలుపది పదితూపుల దినమణి కులుఁడిలఁ గూల్చె
ను వేవే మొల్చెను. విను, ౧

మఱియొక పదిమార్లు నూఱు మార్లు నెఱయఁగఁ దలల్
ద్రుంచెను, శిరములు గళములు కరములు ద్రుంప సు- కర
ములౌటఁ గని హరికోపించెను. విను. ౨

మణికిరీటములు మకరకుండలములు మంజుముక్తామణిహా
రముల్, మ చకచ్చకల సనువగుతాళికల్ కేల్ కడెములుగ
లతనువుల్ చేరెబల్. విను. ౩

తలతొడవులు పీనులసా-మ్ము లను పాపతకముల్ చేసర
ముల్గల, ఖలురావణదేహము లెప్పటివలె వెలుఁగ వచ్చెరు

వాఁడె నృపమౌళి బల. విను. ౪

వేసి నే నలసితి నటికి వేసారితి వీనికిఁ జావు లేదాయెను
ఈశరము లెట్లొ వైరులఁ బొరిగొన నీవి విత్తాయె నని హరి
చింతిల్లెను. విను. ౫

కారణకారణుడవై య్యు నరునివలెఁ గన్పట్టెదవు ధరలోన
ను, గారడీ మాయన్నకడుపులోపలిసుధా ఘట మగల్పుమ
ని విభీషణుఁ డనెను. విను. ౬

పౌల్లెలు నెక్కినదిట్టమ్ము శ్రీరాముఁ- డట్టె యేయసుధా
కుంభము, మొట్టు గాల్చి శాంతిఁ బడఁ- గొట్టె నసురతలల్
తొమ్మిది పదునెనిమిది దోస్స్తంభముల్॥ విను॥ ౭

మోటమూ్రినవలెఁ జెన్నరి పగ దశ-ముఖుఁ డాడుగలి
చిచేదోయి, పాటపమునఁ బోరెను శేషాచల- పతితోనాలు
నొక్క పగలు రేయి॥ విను॥ ౮

౨౭, కాపీరాగము- అటతాళము.

పల్లవి.—రమణీ రమణీయమె యీచరితము॥

అను.—శ్రమజలబిందులసన్ముఖుడై రామ చంద్రుడు రావ
ణుతో బోరు టెంతో. రమ.

ప్రిదరము లదరంట నేసి పెటపెట పండ్లు కొఱికి పగతు
డాసి, కొదలేనికినుకచే గోదండోల్లాసి, యెదిరె నాదముచే
మ్ము గేంద్రముడాసి, కదిసె గాలము నీ కటంచు యుగాం
తాగ్నివలె రాము డడరెను. రమ. ౧

అసురేంద్రు డట్టహాసమున మీస మట్టె దీటి యుల్లాస

మున, వెస నిన్ను గెల్తు నే నని సాహసమున మసలకు రా
మా రమ్మా యని రోసమున, ననదు గానిచలమున నిరుహూ
పైన చాపున బోరి రిద్దఱు. రమ. ౨

ఈవిధమున సరాసరిగా రామ రావణుల్ హరి కేసరిగా,
దేవ రాఘవ మనవి దెల్పఁగ దక్షిగా భావింప వీని బొంకర
లాడు విరివిగా, దేవకంటకుని బ్రహ్మాస్త్రము చేవేయు మనెను
సురసారథి. రమణీ. ౩

బ్రహ్మాస్త్రం బరిబోసి రఘు పతి సమంత్రిముగ జేసి, సిం
హ మేనుఁగు బట్టి చీల్చినట్టే గాసి బ్రహ్మరాకాసి ప్రాణాలీ
గొన నేసి, బ్రహ్మచే రావణునితల యిల రాల్చి పొది జేర
బ్రహ్మాస్త్రము. రమణీ. ౪

బ్రహ్మాస్త్రమున మితి దీర రావణ-బ్రహ్మ కజుఁడు బ్రా
సె నౌరా యన, బ్రహ్మర్షి సురనరబ్రహ్మరుద్రాదుల-బ్ర
హ్మ స్తంభముగ వాగ్బ్రహ్మమును మనసార, బ్రహ్మసుబ్ర
హ్మణ్యరామ- బ్రహ్మాదిల శేషగిరిహరి యనిరి॥రమణీ॥ ౫

౭౫. గౌళిపంతువరాగము-ఆదితాళము.

పల్లవి.—విన వే కలకంఠలలితకంఠ నుతవైకుంఠ॥

అను.—మనుజేంద్రుని గెల్పు రా-వణుచావు గని యుత్కంఠ
వనచరుల్ చెలంగి మేల్ మే-లని వదంతిఁ జేసిరి సదంతి
కములను॥విన॥

క్రిందుగ సురదుందుభులు మొరసె-రామునిపై దేవ,
మందార పుష్పవృష్టి గురిసె జనవినుమతి చెవుల-విందాయె

వచ్చెరల్ దిగ్దిగ్దాందా మని యాడిరి, ముందు జేజేలరాయని
తను-వందు జ్యోతి వెడలి రాఘవు నెనసె॥విన॥ ౧

సుర లచ్చెరువు నొంది వీఁడు-పరదారరతుఁడు, గురుజన
ద్రోహి యయ్యు నేఁడు ము-క్తుఁడైనాఁడు, హరికి మనము
నత్త్యదేహ-మ్మట్టె నాహరినిఁ గూడు, టొరుల కెవ్వరికి దెప్ప
రమని-సురమునీంద్రుఁ డనియె దేవతలఁ గని॥విన॥ ౨

రావణుఁ డలుక నృహరియందే మది నిల్పుటచే-రాము
వైకుంఠముఁ జెందె మోక్షము నొందె, శ్రీవంద్యుని పగనై
నను చెల్మినైనను బొందుఁ-గేవలబ్రహ్మమై నిలుచును నిశ్ర
ష్టుఁ డైన ఖలుఁడైన ననెను ముని॥విన॥ ౩

అని దశాస్యుఁ దునిమి డాపలిచేవి-ల్వాలపలిచేఁ దూ,పౌ
వర నిల నాసీనుఁడై నిలిచె నింద్రస్తుతిఁ జె-న్నొనరి క్రేగను
లెఱుపై పోట్లఁ మేను రవికోటిప్రభచేఁ, దనరఁగా వీరల
క్ష్మీమణి-నెనయు శేషగిరిరాముఁ డరయఁగను॥విన॥ ౪

౨౯. ఆహిరిరాగము-ఆదితాళము.

పల్లవి.—వినవే హేమదుర్గా స్వర్గానవర్గ.

అను.—ఇనవంశమౌళి విభీషణుతో - నినజానిలజాదులతో
మీతో,డునను నే జయము శ్రీయును గొంటి-ననుపమ మీ
కథ జగతి వాఁక్రువ్వఁ డనె. విన.

కురులు జీరాడఁ గుంకుమరేఖ-కరఁగ మోమువాడ వగ
తోడ, మెఱుఁగుకన్నులనీరు నెరజడితో నీడాడ-నురువుల
యిన బిగిగుబ్బలబరువుచేఁ గొ నసియాడ, సరులు రాల మం

దోదరి మొదల్-సకియ ల్వచ్చిరి హాహారవంబునను. విన. ౧
హానాథ హారావణ హారణశూరా-హాలోకవిద్రావణా జి
త్రై రావణా, దీనుల మగుమముఁ దేర్పఁగ దే రమణ-దాన
వేంద్రాగ్నిహోత్రుని భూనాయకపజ్జన్యుఁ డార్చెనా, నేను
రామునికి సీత నిమ్మని-నినుఁ దెల్పిన వినవైతి వనెను మయ
సుత. విన. ౨
అన్నా యీాపద్దు రామునితో వల-దన్నా యెంత రద్దు
చేసితి, వన్నా మిన్నాసింగముఁ గాలఁ-దన్ను టేటిహద్దు, పి
న్న పెద్ద ల్వద్దువద్దు- అన్నాపని నేమి ఫలము కద్దు, నిన్ను
వంటినెఱ సాహసికు లిల-నున్నా రేయని విభీషణుఁడడలెను.
స్వామి లక్ష్మణునిఁ గని యీావిభీ-షణు బోధింపుమని ప
ల్కిన విని, సౌమిత్రిఁ జేరి పరితపించె-దవు సఖుఁడ నీ, వీ
మెయి నీతఁడు నీకెవ్వఁడు-ఇతనికి నీ వెవ్వఁడ వేమిపని,భూమి
నిసుక నది వేగమునఁ జను-పోల్కి జని మృతులు దైవమా
య ననె. విన. ౪
నేను నీ వను టెల్ల భ్రాంతి మేనుల-మేనుల్ దేహివల్ల
దేహి యా నెల్ల, మానాభిమానానవమానములు కల్ల తాను
జ్ఞానానందబ్రహ్మ, మే నన కున్నవానికి ముక్తి యిల్ల,యీాన
యంబుగ సౌఖ్య మొంది స-మిద్ధతేజము బయల్ సేయు
మనె హరి. విన. ౫
కృపఁ దెల్పు రామానుజునినుఁడి నడల్ దేరి-యిష్టుఁడు
రాఘవునకుఁగల్ వలగొనినపుడె, నిపుణ మీాయన్న యపా

పుఁ డనుచు రాముని-యుపమ మెచ్చి యంతఃపుర, చపలాక్షుల
నూరార్చి యగ్రజుని, నపరిమితముగ దనుజుల్ పూని రా-
నందలమున నిడుకొని చనె విభీషణుఁడు. విన. ౬

వేదవేత్తలతో నాహితాగ్నిసం-విధానముగాను బరలోక
విధుల, వేదోక్తముగ నన్నకు-విభీషణుఁడు సలిపెను, వేదవే
ద్యుఁడగు శేషగిరిశ్రీ-వేంకటరామేంద్రునకు మ్రొక్కిన, సా
దర ప్రియాలింగనమును హరి యొసంగెఁ జిరంజీవ సుఖీ భ
వ యటంచు. వినవే. ౭

30. బిలహరిరాగము-ఝంపతాళము.

పల్లవి.—దేవాదిదేవుని రాముని సత్యవాణి-పూవుఁబోణి
వినవె.

అను.—యావచ్చంద్రశ్చ సూర్యశ్చ-యావత్తిష్ఠతి మేదినీ,
యావద్రామకథా లోకే-తావద్రాజ్యం కరోత్యసౌ, శ్రీ
విభీషణ' యని యానాఁడె పలికితి-వేవేలక్ష్మణా పట్టాభి
షేక మొనర్చు మనె. దేవా.

రామేంద్రునియానతి శిరమునం దిడుకొని-సౌమిత్రి వా
నరులఁ దోడ్కొని వేగమె చని, హేమప్రాకారసౌధము-క్తా
మణితోరణము, శ్రీమత్ప్రతిగృహాంగణము-శ్రీదము లంకాపు
రీంద్రము, వేమఱుం బొగడి కల్యాణనిలయమునను-హేమ
సింహాసనమున నవ్విభీషణు నునిచె. దేవా. ౧

సాముద్రజలమ్ములు-స్వర్ణకుంభముల నించి, శ్రీ మించి
మైత్రిఁ జెప్పించి ధర్మ మొప్పించి, యామినీచరులఁ బాలిం

చి లంక యేలు మని మంచి, ప్రేమించి పట్టముఁ బూన్చి-సా
మాదిశ్రుతుల్ పఠించి, భూమిసురులు తాను విభీషణాభిషే
క-మొనరించెను రామానుజుఁడు సంభ్రమమున. దేవా. ౨

కానుకలతో సఖుఁడు లక్ష్మణుఁ డగ్రమున నే రా-దాన
వేంద్రశ్రీ మీఱ విభీషణుఁడు, దీనావనుఁడై వీరాధివీరుఁ
డు ముందుగౌరవ-మానితుఁడౌ శ్రీరామప్రభుసన్నిధిఁ జేర,
సానతిఁ వచ్చి యభివాదయే-హం నృపచంద్ర శేషాచలేం
ద్రా యని నతు లొనర్చె. దేవా. ౩

౩౧. కాంభోజిరాగము-ఆదితాళము.

పల్లవి.—వీణావాదనాభినయితమస్తకా - విలసత్కారాంచిత పుస్తకా.

అను.—ప్రాణసముని శ్రీమద్విభీషణుని రామ-క్షోణీపతి కోఁ
గిటిలో మన్నించి భువిలో, నాకెమయ్యెఁ గీర్తి కృతకృ
త్యుఁడ-నైతి జయస్ఫూర్తి నని పలికి, జాణయై విభీష
ణానుమతి నాం-జనేయ సీతకు నాగెల్పు తెల్పుమనె. వీ.

మారుతి రామునియానతి లంకానగరిఁ-జేరి శింశుపాత
రువు ప్రాపునఁ జిక్కి, మీఱినవగబరువుచే నెల్లపుడు-శ్రీరా
మ శ్రీరామ శ్రీమత్తారకనామ, కోరి ననుఁ గావవే అని యని
వే-మాఱు పల్కు సీతాపతికి నతి, సారెకొనర్చ హితాగ్రణి
యనుచు-నారమణి దెలిసి దీవనల నిచ్చి, హారమణిగణము-
లనఁ బ్రియోక్తుల మనిచె. వీణా. ౧

అమ్మా సీతమ్మా ; రాముఁడు రావణుని-ననిలో సబల

ముగాఁ బోరిగొనె ననినఁ, గొమ్మవీనులవిందుగా విని యుప్పొంగె-నిమ్మహి నినువంటిఘను లెవరు ముక్కంటి, తమ్మిచూలి సిరిదొర మనుచు నిన్ను రారమ్మా దీవన చేకొమ్మా యని యమ్మ యనిచి సెలవియ్య, సమ్మరుత్సుతుఁడు నృపునిఁ జేరి మా-యమ్మ విూజయము విని మిన్నందె ననె. వీణా.

ఎవరికైన నే నింత చేసితినట్టి-యవనిజ నభిషేకించి యలంకరించి, నవరత్నములమంచిపల్లకి నుంచి-నవరణఁ దోడితేజనువిభీషణా యన, నవనిపతియానతి శిరమునం దిడికొని-పవనజాదిసఖులతోడఁ జని య-భంగసంభ్రమముతో నిపుణులగు, నువిదలను బనుప జడలు విడిపించి-యువతికిని మంగళస్నాన మొనర్చిరి. వీణా. ౩

పట్టుచీర గట్టి బంగారురవిక దొడగి-బొట్టు కస్తూరి,దీర్చి కాటుక కనులఁ, బెట్టి కురులు గూర్చి సరులు చుట్టి-పట్టెడ బన్నసరము బవిరెలు మురువు తాళీల్-పతకము కంఠసరులు కీల్కడెములు, దిట్టమగునొడ్డాణముఅణిము- త్రైపుముంగర రాణముగలందెలు, మట్టెలుఁ జిఱుగజ్జెలును కై చేసి-మంజులాందోళికమున నిడి రతివను. వీణా. ౪

పల్లకిలో సీతాభామ శ్రీరాముపలె-నుల్లసిల్లఁగ రాఁ గని కపిదనుజసేన. లెల్లఁ గన్గొన మునుకొని వేత్రహస్తులు-మళ్లింపఁ గోలాహలమై పరికించి యిలా, వల్లభుఁ డనుమతించి చూడఁగాఁ బంచి-యల్లమాయసీతఁ విడిచి ము న్నగ్ని నిడినసీతఁ దేఁదలఁచి, మెల్లన శిబిక డిగి రమ్మనిన నడిచి-

మృగాక్షి శేషగిరీశుసన్నిధిఁ జేరె.వీణా. ౫

౩౨. సౌరాష్ట్రరాగము-అటతాళము.

పల్లవి.—శృంగారాసంతకల్యాణవతీ-సంగీతభారతీ వినవే.

అను.—ఉప్పొంగుచు సీత రామునికి మ్రొక్కి - చెంగట నిలువ మున్నటినెనరు దక్కి, అంగనామణి రావణుని నేనని జంపి చెఱవిడిపించితిని, సంగతిగ నీమనసు వచ్చిన-జాడలను బొమ్మనెను రఘుపతి. శృంగా.

అనిన రాముని మది భావించి లక్ష్మ-ణునిఁ గాంచికన్నీరునించి, కనికరమున నన్నుఁ గనుఁగొన వన్నా - అనలునిఁ జొచ్చి వచ్చినమీఁద నన్నె, నను జేకొనునో కో మీయన్న అనిన మానినికి కనుసన్న, జనపతి యొనర్ప జ్వల-నునిప్రజ్వలనమొందించె నగచరతతి. శృంగా. ౧

తరుణి ప్రదక్షిణ మొనర్చి విభునికి-దండప్రణామ మొనర్చి, కురు పతి దైవ మని యుంటినేని- పరమపవిత్ర యోపవమానమిత్ర, నరసుఁ డగువిభుని ననుగూర్చి- యరసి రక్షింపుమని పేర్చి యుతికె నగ్నిని జానకి సురా-సుర మనుజకపివరులుపొగడఁగ. శృంగా. ౨

ఇంద్రుఁడు యముఁడు వరుణుఁడు గుబేరుఁడు - వృషవాహనుఁడు నీశానుఁడు చంద్ర సూర్య సిద్ధ చారణవసు- సంయమీంద్రులతో బ్రహ్మ వచ్చి నృసింహ, సాంద్రకీర్తివి జగత్కర్తవు- సాక్షివి జ్ఞానవిగ్రహుఁడవ,తీంద్రియుఁడవు చిదానందమూ-ర్తివటంచు రాముని నుతించెను. శృంగా. ౩

వసువులలో విభావసుఁడవు రుద్రులలో - నసమాక్షుఁడవు
శంకరుఁడవు, వెసఁ జతుర్ముఖబ్రహ్మ వీవె ప్రాణేంద్రియ-
మనసుగానశ్వినుల చంద్రసూర్యులు, పొసఁగఁ గన్నులుజ
గత్క్రియకు- మొదలొకఁడ వచలుఁడ వమేయుఁడ, ననదృ
శుఁడమాయ నరాకృతి - నరినడఁచ. దగితి వని రమరులు.
శృంగా. ౮

ఈనహీని సురలు గొనియాడ బ్రహ్మ- దేవుఁడు ప్రణమి
ల్లి వేఁడ, భావింపఁగాఁ గోరి ప్రణతార్తి-దేవ శేషాద్రివిహా
రిశౌరి, రావణాంతకరూపధారి - రాగరహితమనోనుసారి,,
భావజారిప్రముఖసూరి- ప్రమదకార యని నుతించెను. శృం.

33. రేగుప్తి రాగము- రూపకతాళము.

పల్లవి.—వందే విష్ణుం విష్ణు మశేషస్థితిహేతుం - త్వామ
ధ్యాత్మజ్ఞానిభి రంతర్హృది భావ్యం, హేయాహేయద్వం
ద్వవిహీనం పరమేకం, సత్తామాత్రం సర్వహృదిస్థం దృ
శిరూపమ్. వందే.

ప్రాణాపానౌ నిశ్చయబుద్ధ్యా హృదికృత్వా, ఛిత్వాస
ర్వం సంశయబంధం విషయౌఘాన్, పశ్యంతీశం యం గత
మోహా యతయ స్తం, వందే రామం రత్న కిరీటం రవిభా
సమ్. వందే. ౧

మాయాతీతం మాధవ మాద్యం జగదాదిం, మానాతీ
తం మోహవినాశం మునివంద్యం, యోగిధ్యేయం యోగవి
ధానం పరిపూర్ణం, వందేరామ రంజితలోకం రమణీయమ్.

వందే. ౨

భావాభావప్రత్యయహీనం భవముఖ్యై, ర్భోగానక్తైరర్చి
తపాదాంబుజయుగ్మం, నిత్యంశుద్ధం బుద్ధమనంతం ప్రణవా
ఖ్యం, వందే రామం వీరమశేషాసురదావమ్. వందే. ౩

త్వం మే నాథస్సాధితకార్యోఽఖిలకారీ, మాయాతీతో
మాధవరూపోఽఖిలధారీ, భక్త్యాగమ్యో భావితరూపో భ
వహారీ, యోగాభ్యాసై ర్భావితచేత స్సహచారీ. వందే. ౪

త్వామాద్యంతం లోకతతీనాం పరమీశం,లోకానాంనో
లౌకికమానై రభిగమ్యం, భక్తిశ్రద్ధాభావితచిత్తై ర్భజనీయం
వందే రామం సుందర మిందీవరనీలమ్. వందే. ౫

కోవా జ్ఞాతుం త్వా మతిమానం, మానాసక్తో మాధవ
శక్తో మునిమాన్యమ్, బృందారణ్యే వందిత బృందారకబృం
దం, వందేరామం భవముఖవంద్యం సుఖకందమ్. వందే. ౬

నానాశాస్త్రై ర్వేదపురాణైర ప్రతిపాద్యం, నిత్యానం
దం నిర్విషయజ్ఞాన మనాదిమ్, మత్సేవార్థం మానుషభావం
ప్రతిపన్నం వందే రామం మరకతవర్ణం మథురేశమ్. వం.

శ్రద్ధాయుక్తోయః పఠతీమం స్తవమాద్యం, బ్రాహ్మం!బ
హ్మజ్ఞాన విదానం భువి మర్త్యః, రామం శ్యామం కామిత
కామప్రద మీశం, ధ్యాత్వాధ్యాత్వా పాతకజాలై ర్విగత
స్స్యాత్. వందే. ౭

౩౪. హిందూఘంటారాగము- ఆదితాళము.

పల్లవి.—అని బ్రహ్మ రామచంద్రుని- గొనియాడెా నుని

తిజాడగ్.

అను.—అనలుం డాహరి వేఁడగ్ - జనె జానకితోడగ్. అని.

సీతాపతి మహాధృతి నీ-చేత నిర్ణీత, త్రేతాయుగజాతా రిని-ఖ్యాత సీత లోకమాత. అని. ౧

నీవు నాయందు దాఁచినరమ-ణిగ్ బ్రిపన్నసురమణిన్, దేవచేకో రావణాంతక- దీనపాలకతిలక. అని. ౨

కలువతమ్ములకొలనిలో సిరి-కరణిన్ తగుతరుణిన్, మలికిత్రకం బెడఁబనిచెన్ శ్రీహరి-మనిచెగ్ దేఁడనునిచెగ్. అని.

మోహాగ్రిణి శేషాద్రివి-భూపామణి వెలుఁగన్, దోషాధికరోషావళి- దొలఁగున్ శ్రీగలుగున్. అని. ౪

౩౫. పున్నాగరావళిరాగము- ఆదితాళము.

పల్లవి.—భజేహం భవానిహృదా - భావితం బుధసేవితమ్.

అను.—నిజాశ్రితభవదవానలవి- నిర్మలనామధేయం, ఆది జన్మహీనం నాగరాజగేయం- ప్రజామరేద్రం రామచంద్రం. భజే.

ఇందీవరదళశ్యామం- హితప్రసన్నముఖాభిరామం, బృందారకశోకవిరామం- శ్రీకాముకమకామం, వందితసనకసనందనసోమ మరిందమం శ్రీరామం. భజే. ౧

ప్రపన్నానందసందోహం - ప్రమోదావహ మమేయదేహం, తపోయోగసమాధివిమృగ్యం- తపనజాపూర్వభాగ్యం సుపర్వభావ్యం కృపణాభావ్యం కృపావినిద్రం రామభద్రం. భజేహం. ౨

విదేహాత్మజానందరూపం- విభీషణాదికృతసల్లాపం, చిదా
నందమూలాయుత మ-శేషయోగసమన్వితం, త్వదాప్తినిర
తస్సదాస్థిరతర- ప్రదుష్టమతిమాన్ ప్రసంగవాన్. భజే. ౩
స్ఫురద్రత్న కేయూరకాంతం- కిరీటకుండలభానుమంతం,
పురారాతిలోభ- శ్రీ-పురందరమణిమితాభం, స్మరాతికాం
తం సహానుమంతం- స్థిరం శాంతం శ్రీకాంతం. భజే. ౪
జ్వలచ్చంద్రకాంతాపనీవం క్షమాసుతయా సుఖాసీనం,
దళత్పంకజదళాయతాక్షం దయాకటాక్షవీక్షం, ఖలారినా
శం కైవల్యశోకం విలాస శేషాచలాధీశమ్. భజే. ౫

౩౬. యదుకులకాంభోజి- ఆదితాళము.

పల్లవి.—వింటివా మర్గా స్వర్గాపవర్గ విభురామేంద్రునిస్తో
త్రము.

అను.—తెలు, గంటిరాజగు వేగంటతో నాతవిస్మ కంటికత
లు విచిత్రము, ఇరువది, కంటిదోర జగడమునఁ జచ్చిన
కపుల నమృతపు జడిని నలజడి, గెంటించి బ్రతికింపు మ
న హరి-తోంటియటుల నోనర్చె వానరుల॥వింటి॥
జంట బాయక నే నంటి నంజలిచేసి ము-క్కంటిని సీతా
రామా మనఁ, గంటిని నినుఁ బాడ-గంటిని ప్రజ నోము,
పంట దశరథుఁడదె శ్రీరామా చూడుమ,టంటినతండ రా
ము,డభినవ-హర్షమున జనకునకు మ్రొక్కెను, అంటి కౌఁగి
ట నిడి సుతుని ము-ద్దాడి కొనియాడి చనె దశరథుఁడు॥విం॥
సీతాలక్ష్మణులతోఁ జెలఁగి సన్మాగళ-స్నాతకులరై కై

చేసి చనినఁ, జేతోముద మనిన శ్రీరాముఁడు సఖుని-చేపట్టి
భరతు నెడఁబాసి తోడవుల, నేతెఱంగునఁ బోడుగ నగు ర-
వి-జాతాదికపుల బహుమతి మ,త్ప్రీతి యగు ననిలఁ బతినుడి
మణి-జాతి నలరించె నతఁ డందఱిని॥వింటి॥ ౨

అంబరయానత్ర్యంబకసఖువిమా-నంబున రాఘవుఁ డుం
డి తమ్ముని, బింబోష్ఠి సీతం బుష్పకంబు నె-క్కం బంచి
సెలవు గొనుండి సిరులఁ ది,రంబుగా రాజ్య మేలుఁడు మహా-
రాజులై యనిన నతి స్వామీ, యంబ కౌసల్య కెరఁగి-య
యోధ్యాపురిని మిముఁ గనఁగ నిడు మనిరి॥వింటి॥ ౩

హనుమంతుని సకలవనచరుల సుగ్రీ-వుని విభీషణుని మం
త్రు, లను గూడి రమ్మని ధనదుయాన-మున నిడికొని రఘు
వంశమణి దానిఁ, ఘనపథంబునఁ జనం బనిగొని-జనకజం
గనుఁగొని త్రికూటం,బున లంకసొగసు గను మిది-రణభువి
రావణాదు లీల్గినచో టనెను॥వింటి॥ ౪

ఇది సేతువు కడలి కీవల రా-మేశ్వరు నొదవించినా నబ
లామాతో,నదే రావణానుజుఁ డితవైనచో ట-ల్లదె కిష్కిం
ధ యబలా వాలి, న్విదళించినాను జేకొనుము-విపినచరుల
సతుల నని కదలి, యిది పంచవటి చిత్రకూటం-బిది భర
ద్వాజాశ్రమం బనెను॥వింటి॥ ౫

వరవిమాన మందఱితో డిగ్గి సో-దరసీతాసహితుఁడయి
యేఁగి, పరమతపోనిధి భరద్వాజుని దివ్య-చరణములకు న
తుఁడై మ్రొక్కుచు, భరతుఁడును బినతమ్ముఁడును సుఖ-భ

రితులే కౌసల్య కుశలియే, గురువర్య యనిన శేషాచలశౌరి
యం-దఱికి నీదయను గుశల మనె॥వింటి॥ ౬

౩౭. ఘరజూరాగము-ఆదితాళము.

పల్లవి.—సేవకజీవమణీ వినవే నిజ-సేవకభావమణీ రమణీ॥
అను.—సేవకసారమణి దేవుని-జితదశగ్రీవుని మహాను, భా
వుని భరద్వాజుఁడు గని-భానుతేజుఁ, డీవు వనికిఁ జని
యేమి చేసితి వ-దెల్ల నీదయవల్లను దెలియునని॥సేవ॥
ఆదిమధ్యాంతములు లే-వద్వయబ్రహ్మమా లే, వాదివి
లాసలీల మాయ నీమాయ-పాదు నీవే పొందమ్మి పాపనికి
యా నెమ్మి, ఆదినారాయణస్వామీ అంతర్యామి-నాదబ్రి
హ్మానందరసికవర-నందితాత్మ పరమాత్మ యనెను ముని॥సే॥
నీవు విష్ణుఁడవు దేవి సీత లక్ష్మణ-దేవుఁడు శేషుఁడు తె
లియ నీమాయ, నీవు నీయందె నీచే విశ్వము సృజియించి-
నావు నభమువలె నీవు నంటకున్నావు, నీవు సాక్షివి నిఖిల
భూతముల-లో వెలి పూర్ణుఁడవై వెలయుదు॥సేవ॥ ౨
వెఱ్ఱివానికి నీవు-వేత్రై తోఁచినావు, కుఱ్ఱలఁ బ్రిజలఁబ్రో
వ- గోవిందుఁడవు, యెఱ్ఱనై నల్లనై-యేమేమి గన్పట్ట నేమి
గట్టిన వినఁబడునని యెల్ల నీవే జగము నీవల్ల, మఱ్ఱాకునఁబ
వళించినయ్య యొక-మహిమ గలదె నీకన్య మనెను.మునికి
మాయాజడమైన నీచే-మఱి చూడఁబడినందుచే,మాయ
గుణములతోడను-జేయును జగములను, రాయి సూదంటు
లో హత్తి కరిగినట్టు హా-జేయువారికి నివి నీయం దుపచార,

మాయెను మాయురె దేహరహితు-డగునీ కిమ్మహి స్థూల
సూక్ష్మ మనం గలిగె ననె. సేవ. ౪

స్థూలము వైరాజము సూక్ష్మము హైరణ్యము-లీలను మే
నులు వేలకొలందులు, హేల చాలించితేను ఎనయు విరా
ట్టును-మూలమైన నీయవతా రానుసారసార, శ్రీల నెసఁగి
పొసఁగు నీకథాసుధ-గ్రోలువారలకె ముక్తి యనెను ముని
సేవ. ౫

నలువమాటలు పట్టియిన-కులమణివై పుట్టి, జలధిఁగట్టి
యరిఁగొట్టి, యిలబరువుదట్టి భళిర కౌసల్యపట్టివి-బలుఁ డ
నుపద్దుపట్టి-వెలయు వేంకటరామ శ్రీసీతారామా; తెలిసి నీవు
కావలసి సేయుపని యలవియే యొరులకని పలికెను ముని. సే

శరణు సుజీవనునిగాఁ బరమపావనునిగాఁ, గరుణయుంచి
నాయిల్లు సిరి వెలయించి, విరులపూజ వరించి విందారగించి
మించిఁ పురము పాలింపుమీా రే పు నీవె మాప్రాపు, హరి
శేషాచలనృహరి యనిన గురు నాజ్ఞ నుండె హరి యలరి
రందఱును. సేవ. ౭

౩౮. పూరిరాగము-అటతాళము.

పల్లవి.—మానినీ పరాకు మాని నీవు వినవే.

అను.—శ్రీనివాసుఁ డీలీల భరద్వాజు చే నన్నిటఁ బూజితు
డై హితుఁడై, ధ్యానించి మది భరతునిగుఱించి హను
మంతుఁ గాంచి యనూనకరుణారసము నించి, నేను వని
వని మొన నొనర్చిన నెఱపనులు కుశలము మునివిందు-

వానరాసురులలో మా రాక దెల్పు మనె. మాని.
మే మిదె వత్తు మయోధ్య కని తెల్పుమాగుహో-త్తము
న కౌసతి నల్పుమా న, చిత్తత్వమూల్యసౌశీల్య కౌసల్యకు-
బత్తిమ్రొక్కితి ననుమా తల్లులఁ గనుమా, యిత్తతి నతిత్వ
రితగతిఁ జనుమా శృంగిబేరమున నృపసత్తముని గుహునిఁ
గనుఁగొనుమా, హా నందిగ్రామునను మదనుజు ననుజ
సహితుభరతుని గుణోత్తరుని నేను మారసి రమ్మా య
నెను హరి. మాని. ౧

మా॥ రుతి నతి చేసి పనివినెను ఖగ పతిగతి శృంగిబేరము
జేరెను సానుజుఁడై రాముఁడు, సీతాలక్ష్మణసేనా, యుతుఁ
డై వచ్చుట గుహునికిఁ దెలియఁ బలికి, అతులసుందరమను
జతను వంది నందిగ్రామ స్థితు భరతు శ్రీవిరతుఁ జెంది, నతి
చేసి కుశలమే సుమిత్రానందన సతీసమేతముగ రఘుపతి భ
రద్వాజుకడ నున్నాఁడు సుఖ యనెను. మాని. ౨

మా॥ రెవ్వరికై నారచీరలు నిలఁ - పవ్వళించి జడదారు
లునై, గువ్వమేఁత కాయగూరల మెసఁగెదరు - నొవ్వనిపని
యేమి యూదైవరాయఁ, డవ్విరాధఖరాసురుల నోర్చి వాలి
ని తెగటార్చి-యతనితమ్ముని సిరులఁగూర్చి, మొవ్వముగఁ
జేకొని కడలి గ, ట్టవ్వలను రావణునిఁ బోరిగొని-చివ్వను
సీతచెలి యుడిపికొని వచ్చె ననె. మాని. ౩

అ,కై కకొడుకు హర్షపరవశుఁడై దయ- చేకౌఁగిటనుంచి
గుహుయశుఁడై యా,మాకృతి నెనసినయా దేవుఁడవో నీవు-

కాకుత్స్థకులచంద్రుని రామేంద్రుని, రాక మాకెఱఁగించి సుధనించి మము మనిచితి వనియు, నేకబహుమతుల ; నలరి రాకొమరుకీర్తి యనిలజుచేఁ సాకల్యముగ విను మని సుమి-త్రాకుమారక రాఘవులఁ గనఁగాఁబోదమనెను. మాని. ౪

ఆ, పౌరమంత్రి బుధగురుజనులు జయ భేరులు వారసుందరులు రా,శ్రీరామపాదు కాంచితమ స్తకులై మ-హారాజసన్నిధిని పెన్నిధిని, జేరినటువలె భరతశత్రుఘ్నుల్, శరణు శరణు నమస్కార శతమనిరిజితవిఘ్నుల్ సారకరుణామృతాసారలసద్విలోకనము తమ్ములపైఁ- బూరించిన శేషగిరినృహరి మన్నించె. మాని. ౫

౩౯. ముఖారిరాగము- ఝంపాతాళము.

పల్లవి.—వినుతశీలా దానవిజితసుర సాల వినవే హిమశైల
బాల.

అను.—ఘనుఁడు రాముఁడు పుష్పకము డిగ్గి తనతమ్ములను
కౌఁగిలించి తోడం నిడె వారల, వ్వనజాతు చరణమ్ముల
లకు మ్రొక్కి-వందనము జనకనందన కొనర్చిరి. విను.

తాలత్ముణుని భరతుఁ డాలింగన మొనర్చె, నాలీలసౌమిత్రి-యనుజన్ముని నెనసె, న్వాలితమ్ముఁడు కొడుకు-చాల కపులుమనుజు లయి, లాలించిరి కౌఁగిళుల రాఘవులఁజాలాజయమాల మయ్యెను నీసహాయము లక్ష్మ్ముఁడా యనెఁ భరతుఁ డక్కసుతు. విను. ౧

గురుభక్తిఁ గౌసల్య కెరఁగితల్లులకెల్లఁ, గరమర్థి మ్రొక్క-

చును నరవిమానమున, భరతాదుల నిడికొని భానుకులమణి చేరెఁ, బురమునందిగ్రామ మును సత్వరము, సురవిమానవర మా పొగడఁదరమా 'సుఖం భవతు శివసఖం వహ' యనఁ బనివిని నదియ. విను. ౨

రామచంద్ర నరేంద్ర రానిరి యీపాదుకల, నేమించిధనమణులు సామజాశ్వములు, స్వామిసచివాప్తాది సప్తాంగములనెల్ల, నీమహిమచే నధికము దశగుణము స్వామీ యామెనని, శ్రీమీఁబాదుకల రాముని యడుగు లానుకొనన్ దొడిగె భరతుఁడు. విను. ౩

పదునాలుగేండ్లాయె భవదంఘ్రియుగళిగని, సదయాత్మ గురువర్య సత్కార్యధుర్య, యిదెనమస్కారశత మిదె ప్రదక్షిణము లని, ఒదవించెను వశిష్ఠుని అనుమతిని, తదుపాంతమునఁ గృపాంబునిధి శేష ధరవిభుఁడు చరాచర గురుఁడు రాముఁ డుండె. విను. ౪

౪౦. కన్నడరాగము- అటతాళము.

పల్లవి.—ఆయత జగత్కార్యాభూ షాయిత చంద్ర సూర్య ఆర్యవిన.

అను.—ఆమెడఁ గౌసలేయుఁ గాంచి కై - కేయికొడుకువిధేయుఁడై సామీ జా గేమీ, యీయఖిల రాజ్యము భరింపు మీపట్టభద్రుఁడవై, హాయిగా మముఁబ్రజల నేలు- మా నాఁడు దశరథుచే, మాయమ్మ చేకొనినసిరి నే-మముఁజేసినాఁడు నాకొసంగిన, చాయ నేనివ్వుడు నీకొసఁగితిఁసా

ష్టాంగవినతి చేకొనుమనె రాఘవుని. ఆయ.

అత్తఱి వసిష్ఠుఁడు తథాస్తనెను చిత్తము రాబినతల్లి భావించెను, ఉత్తముఁడౌ రఘుసత్తముఁడు భరతోక్తిసిరిఁ జేకొనెను, హాత్తసమాయపోత్తున మనుజతను వెత్తుటను సుఖచిత్తారక రూపమై స్వానుభవమై సత్తయిన పరమాత్మకువింతా సర్వభువనస్రష్ట యగునీశ్వరున కిది యెంత జింత శ్రీకాంత, విత్తమగు నెవ్వనిబొమముడిని విశ్వము నశించు నెవ్వనిదయను, క్రొత్తగాజగము విలసించును కొన్ని లీలలను వర్తించు నటంచు నతఁ. డాయ. ౧

ఆవల శత్రుఘ్నుని యానతిన్ కేవలభక్తిఁ బనివారలుని యతిన్, శ్రీవరదునివిూసమును జికిలిఁజేయ శృంగారాకృతిన్ శుచిస్నాతు,లై విభాకరవంశాగ్రిణులు శోధిత జటావశులై శోభనస్నానమునఁ, బావనులునై చతురలంకృతు లయి శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నులు సారమతు లయి అలరిరిసుమంత్రుఁడు, సావధానమునఁ గై సేసి స్యందనము దెచ్చివిూరెక్కుడి, దేవయని విన్నప మొనర్చిన దివ్యమగు తేరెక్కెఁ. జక్కని రామవిభుఁ. డాయత. ౨

తెల్లనిగొడుగును బట్టె శత్రుఘ్నుఁడు మెల్లఁగ విసరెఁజామరము లక్ష్మణుఁడు, వల్లభరథ్యములకందములు దట్టివాగె లందె భరతుఁడు, బల్లిదులై కపులెల్ల గుఱ్ఱములనెక్కి సుందర మనుజావృతు లయి రాఁగాను మోదముతోను, మొల్లముగ మంత్రివరసరసయు పీతాంబరమణి భూషణ ప్రభలచేను

జ్వాలులయి ప్లవగదానవకుల తల్లజులు తపనజవిభీషణు లుల్ల
సద్వీపముల నెక్కి విలసిల్లిరి యయోధ్యఁ జేరం జని రల్లిబి
ల్లిగ ప్రజలుగనుఁగొని రాహరిని. నాయత. ౩

నాతులు సీతను శృంగారించి నూతనరత్నాందోళికమున
నుంచి, ఖ్యాతిగను సుగ్రీవునిపత్ను లందలముల నారోహిం
చి, చాతురి రాఁగా తౌర్యత్రికనినాదము మధుర మైతోడ్తో
నెసఁగ నింపౌసఁగ ద్విజాతిముఖ్యులు నైగమోక్తులను నా
శీర్వదింపఁ బ్రశస్తముగ సకలవైభవములను ప్రవేశమైరిపు
రి, జాతకౌతూహలమున రామ చంద్రోదయము గని యు
వ్వొంగి, స్త్రీతరుణబాలవృద్ధాఖిల చేతనాంబుధి మించి కాం
చి వరించినది. ఆయత. ౪

రాముని దూర్వాదళశ్యాముని హైమమణికిరీటాభిరాము
ని, కామకోటిశృంగారధాముని కల్పకదాముని సామి నరుణ
తామరస నేత్రాంచలములవాని శ్రీమణిమయాంగద హారక
లనూపుర, శ్రీమహితనవరత్నకటిసూత్రాంచనస్త్రద్యుఁ గాం
చన చేలుని చలత్కుండలశోత్రద్వయు సరసకస్తూ, రీమల
యజవిలిప్తగాత్రుని శ్రితహితుని శేషాచలపతిని, భామిను
లు మేడలనొసరఁగని రామహిమ యేమందు ముందు నేనెం
దుఁగన. నాయత. ౫

౪౧. భైరవిరాగము- ఆదితాళము,

పల్లవి.—మహనీయగుణవివర్ధనీ ఉ-మా పర్వతవర్ధనీ వినవే.
అను.—మహిమతో రామప్రభు మణిరామల్లిక ల్పరిమళహి

మాంబువు, ల్ప్రిహర్షమునను జల్లి రాపురంబు ప్రజల్ తమ
భాగ్య మిదే యటన్నమదిని. మహా.

భూరిభేరీనాదములు దెసలఁ- బొసఁగి మెసఁగ జాదురత్న
కిరీటాదిభూ-షణద్యుతులు వెలుఁగ, వారకామినులు తాహా
తరఘుంతరి-తారితకుంద యని దరువుల్ శృం, గారాభిన
యంబులు చెలంగఁగ-ఘనంబగు తండ్రిగృహంబుఁ జేరెను
హరి॥మహా॥ ౮

రామదేవుఁడు కౌసల్యాచరణయుగలికి-రామితో సతుఁడై
పినతల్లు లలరఁగా మ్రొక్కి- పలికెఁ, బ్రేమచే సుగ్రీవుని ని
జమణి-ధామమునను విడియింపఁ బంచెను, సామీరి విభీష
ణాదుల సకల- సమృద్ధనివేశనములఁ నిల సెల వొసగె॥మ॥

సీతాపతియభిషేకార్థము చతు-స్సింధుజలముల, ఖ్యాతి
గాఁ దేఁ బంపుమని భరతు-జానతీయ ననముల, భ్రాతృసూ
నుసమీరాత్మజాంగ - దనుషేణుల సుగ్రీవుఁడు పంచెను,
జాత ప్రీతిఁ జని వారలబ్ధి-జలంబులు దెచ్చిరి శేషగిరివరు
దయ॥మహా॥

౪౭. ఆనందభైరవిరాగము-రూపకతాళము.

పల్లవి.—పట్టాభిషేకము వినవే శాంకరి నీజన్మ-పావనము
సేవింపుము కోరి॥

అను.—పట్టుగొమ్మ భక్తులకన- బాలవెల్లి దయామృతము
న, కిట్టితపము లెవరు చేసిరి-యు త్తలి మది నలరి శ్రీ
హరి ॥ప॥

శ్రేష్ఠులై వశిష్ఠ మొదలుగాఁ బురోహితవ-రిష్ఠు లఖిల నిగమవిదులుగా సుకృత నైష్ఠికులై నగరుఁ జేరి-నవరసాలంకారయుతుల, నిష్ఠ రత్న సింహాసమున - నెలకొలిపిరి సీతారాములఁ॥ బట్టా॥ ౧

హొన్నువన్నె చిన్న కన్నెలు జేజేల- మన్నీలు మంత్రులు ధన్యులు పసిడి, వన్నెయోషధిరసముల నన్ని గూర్చి వసువు లిందుఁ నిని, బన్ని శ్రీమంతుఁ జేయు-పగిది నభిషేకించిరి రాముని ॥పట్టా॥ ౨

వామదేవజాబాలిగౌతములు- వాల్మీకాదిమౌనిపాళి ఋగ్యజు, స్సామవేదమంత్రములఁగు - శాగ్రితులసీపుష్పగంధ, సాముద్రోదకసంపూర్ణ- హైమకలశముల నొనర్చిరి ॥పట్టా॥

గొడుగు శత్రుఘ్నుఁడు ధరించెను , శ్రీసుగ్రీ - వుఁడు విభీషణుఁ డిరుగడలను చెలువు, దొడరి శ్వేతచామరముల-నిడిరి వాయుదేవునిచే, నిడుదబంగారుసరిపెన-నిలింపరాజు పంపె హరికిఁ ॥బట్టా ౪

రామనామాంకములు పాడిరి గంధర్వులు-పేర్మి నచ్చరవెలఁదు లాడిరి అపుడు, వేమఱు జయదుందుభులు- వేలుపులు మ్రోయించి రామ, స్వామిపై మందారకుసుమ-వర్షములు గురిసిరి ॥పట్టా॥ ౫

కోటిసూర్యేందుమండలాకారమణికి- రీటాంగదమకరకుండలద్యుతుల, తోటి కౌస్తుభాదికముల మొలనూలునందియల- కోటిమదనసుందరుని కోదండవిద్యాగురుని రాముని ॥ప

నవదూర్వాదళశ్యాముని పద్మపత్రనయనుని స్వర్ణాంబరుని రుచిర, దివిజమాల్యశోభితుని దివ్యచందనాలంకృతుని, నవమణివలయాంగుళీయ - కవిలసద్భుజుని రాముని .పట్టా.

మించుపసిఁడి మించుతనువునఁ దొడవులు గీలించి యెలమి కలిమి చనువున హే, మించి రామునిడాతొడవసించి కెంగేలఁ గౌఁగిలించి సీతాసమాఖ్యఁగాంచి చెలఁగుసిరికి హారికి .బట్టా. ౪

వరదుఁడై సుబ్రహ్మణ్యుని నేలిన-నెఱసరసుని నానతశరణ్యుని, గుఱుతెఱిఁగి వర్ణింప నెవరి తరముమనోవాగగో,చరుఁడగు శ్రీశేషాచల-సార్వభౌముని వేంకటరాముని .పట్టా.

౪౩. ఘంటారాగము-రూపకతాళము.

పల్లవి.—నమోస్తు శ్రీరామాయ నారాయణాయ॥

అను.—నమఃపద్మమిత్రవంశాయరఘు నాథాయసీతాసమేతాయ తే .నమో.

రామచంద్రాయ నీలోత్పలదళ శ్యామకోమలాంగాయ, తామరసలోచనాయ కిరీటకుండలాంకితాయ హారయే సింహాసనస్థాయ తే .నమో. ౧

ఆదిమధ్యాంతరహిత స్త్వం జగ దాది రేవ సృజసీదం, ఆదావవ స్యత్తిస్వమాయయా సురాసుర భేదతో వినివేశ్యసి .నమో. ౨

లీలాం విధత్తే గుణై ర్యుతః శ్రితహితార్థదానాయ, శ్రీలసన్నానావతారేస్త్వం శ్రీమద్భిర్భృశ్యసే .నమో. ౩

కృతవానసి లోకం స్వాన్నేన ధృతవాన్ శేషాకృతినా,
ప్రతిభాసి శశిసూర్యాగ్నిభేదేన పర్జన్యౌషధిభిర్బహురూ
పోసి .నమో. ౪

ప్రాణినాం భుక్తి మనలరూపేణ పచసి చాన్న మజస్రం
ప్రాణపంచకసహాయో దేహినాం ప్రాభవాదికం తవ స
త్త్వమేవ .నమో. ౫

బ్రహ్మవిష్ణురుద్రాదిభేదాత్త్వం ప్రత్యేక ఇవ దృశ్యసే,
బ్రహ్మనానాత్వవాదిభి రనన్యం బ్రహ్మనిశ్చిత మఖండం
సుఖరూపం .నమో. ౬

మత్స్యకూర్మవరాహనృసింహవామనభృగురామశరీరో,
వత్స్యసే శ్రీమహారామో భూత్వా వాసుదేవబౌద్ధకల్కిభిః
క్రీడసే .నమో. ౭

చతురమనాది మథైక స్తథా సదసదాత్మకం భువ
నం, కృతినో భవతో నాన్యం లోకే శ్రుతౌ ప్రసీద త్వం
శ్రీకృష్ణాయ తే .నమో. ౮

ఏతచ్చరాచరే యద్యత్తన్న దృశ్యతే త్వయా వినా,
భూతభవిష్యవతామీశ్వరస్త్వం హేతూం తేతద్భవపరాపరత
త్త్వమసి .నమో. ౯

పరాత్మన స్తే రూపం నవిదుః ప్రాకృతా జనా భవ,
చ్చరణాంబుజసేవామలమతీనాం పర మైశ మేకం విభాం
తత్త్వం .నమో. ౧౦

సరసిజాసనాదయో బర్హిర్ముఖా స్సచ్చిదానందఘనం,

పరమాత్మానం నజానంతి త్వాం భక్త్యా భజనే సుధీర్ముక్తి ముపైతి .నమో. ౧౧

ఇమం స్తవం నిత్యం సుశీలేన శృణ్వన్ వదన్ లిఖన్ యః, సముక్తి సౌఖ్యం భవత్పదం యాతి చాదరాత్తే శ్రీ శేషాచలపతే .న. ౧౨

౪౪. సైంధవిరాగము-అటతాళము.

పల్లవి.—వందనము శ్రీరఘునందనా అని-రిందువదనా॥

అను.— సానందనబ్రహ్మసూర్యేందువసురుద్రాశ్వినీ-బృం
దారక ర్షిగోబృందముల్ సానందముగ॥వంద॥

రావణాసురుచే స్వరాజ్యము కోల్పడితిమి-దేవా మహాను
భావా, ఆ దేవతారి మృతిం జెందె నీ-చేవిభవము తిరుగఁ
జేకూరె ననె శచీంద్రుఁడు॥వంద॥ ౧

యాగభాగములు మాచేఁ గొనిత్రా హరించు-బాగా రా
వణుఁడు పోఁగా న,.రాగమున మాభాగములు తిరు-గాఁ
గైకొంటి మని క్రతుభుజులు పల్కె॥వంద॥ ౨

మచ్చికమాపుత్రవర్గ-మిచ్చినపిండము లెడఁ, జొచ్చి తా
నే కొనఁ-హెచ్చినేఁ, డచ్చలుఁడు నీచేఁ-జచ్చినందున,వచ్చె
సామ్మని: పితృదే-వతలు విన్నవించి. వంద. ౩

శ్రీహరి మాచేఁ దన-వాహనము మోయించె దు, ర్మో
హి యయి జగ-ద్ద్రోహిమ, హాహావోర్వ నీ-చే హతుఁ డ
య్యె నః, త్సాహము గల్గె నీ-సత్కృప నని యక్షులు.వంద.

గీతము పాడెదము సం-గీతకీర్తి నతపారిజాతా సీతాసమే

తాను, జాతోల్లసత్కౌతూహలుల-మైతి మని గంధర్వు ల
లరి మనవిచేసి. వంద. ౫

కిన్నరవిద్యాధరమ-రున్నాగగరుడులు, మున్నగు నప్సర
స్త్రీ-లును ప్రపన్నాననాబ్జాత మధువువన్నె గని-భక్తిపార
వశ్యమునఁ గొనియాడి. వంద. ౬

ఆడి పాడి మెచ్చి స - ర్వామరుల్ మందారదృష్టితోడ
దుందుభులు గూడ జో, డాడ సీతాలక్ష్మణాంజనేయులతో-
గ్రీడించి శేషగిరికృష్ణానుమతి నిరవొంది. వంద. ౭

౪౫. పూరిరాగము-ఆదితాళము.

పల్లవి.—కౌమారి గౌరి వినవే రఘుపతిచరిత్రము.

అను.—రాముఁడు పట్టాభిషిక్తుఁ-డై మహిప్రజల కనురక్తు
డై మనిచె సీతాయుక్తుఁడై-మనువంశజుడంత. కౌమా.

నెలమూఁడువానలు గురిసి-కలమాదిసకలసస్యములు, చె
లువొందెను వసుంధర తరువులు సుగంధసుమఫలవంత, ము
లయ్యె నెరా శ్రీరామనృప తిలకము శతసహస్రధేను, వులను
నొకలక్షవృషభ ములను ముప్పదికోట్లనిష్క, ములను వస్త్రా
భరణముల నెలమివేదశాస్త్రవిత్త, ములగు భూసురసత్త,ము
ల కొసఁగెను రఘూత్త ముని చరితము వినవినఁ గ్రొత్త. కౌ.

సవితృసూనుని మన్నించి స్వర్ణరత్నహారము నిచ్చి, రవి
వంశమణి దనుజేంద్రుని న లవిభీషణు లసన్నవరత్నహారా
న్వితుని గావించి మించి, సవరణతో నంగదునిఁ జేరఁ బిలిచి
భుజకీర్తు లిచ్చి ప్రవిమలభక్తి నంజలియుతుఁడై, కొలిచి యు

న్న హనుమంతుఁ దిలకించి యిలకుమారిక, తలఁచి యున్న
కోరికె యలర నొసఁగె ననుశౌరికి చెలికి తారహారము దొ
రకెఁ. గామా. ౨

సీత తారావళిఁ జూచుఁ జెలువునితో మోముఁ జూచు
వి,ఖ్యాతవానరులఁ జూచుచు న్నటులున్న తఱి నృహరి, సీ
త యెవనికిఁదోఁచు వాని కిమ్మనినఁ జాతురి నృపకృతి మన
మున ననుస్మరించె వైదేహి నీరే, జాతనయన చాల గార
వించి నెనరు మించి శీతాంశుకోటిరుచిరము జాతిముత్తెముల
సరము, వాతాత్మజుకంధరము వంచి యలంకరించెఁ గరమః.
కామా. ౩

మారుతి గౌరవమున మెఱుపు తారావళితోన, సొరైన
ట్లుండె నంత శ్రీరామవిభుఁ డతనిఁ, జేర రమ్మని హనుమం
తా జ్ఞానోపదేశము సారము గొను మని యొసఁగె వింటివే
మున్ను అనిలజుఁడు సమ, స్కార మొనర్చి అనుక్షణంబు నే
నిన్నుఁ గొనియాడుచుండు శ్రీరామా నీకథ యెందాఁక,
ధారుణి వెలయు నందాఁక నారూఢి జీవింతు మీాకటాక్ష
మున ననెను. కామా. ౪

కోరినట్లెల్ల నిచ్చి సామీారి కల్పాంతమున మదీయ, సా
ర సాయుజ్యము నొందెదవు అని పలికి హరి యపుడు, శ్రీర
మణి సీత నీవు నెం దుండు రచట శ్రీ రాజిలు సకలసంపద
లు సుఖమున నిత్యానందుఁడై, వారికి సతుఁడయి హిమవత్ప
ర్వతమున మహిమ,తో రామనామజప మహిమ ద్యుతితే

జుఁ డొనర్చు చుండె నుమా. కౌమా. ౫

ముకుళితకరకమలుఁ డయి ముందర నిలుచున్న గుహుని
కిఁ, గకుత్స్థవంశసార్వభౌముఁడు సర్వజ్ఞుఁ డన సుగుణుఁ డక
లంకుఁ డయిన శ్రీరాముఁడు చాలా రాజ్యము, ప్రకటముగా
నొసఁగి ప్రజల నేలుము నీవు తుద సారూప్యము కైకి కుదు
రై చదురై సదరయ్యెద వని సెలవిచ్చె, సకలేశునను జ్ఞనమ
స్కార శతము లొనర్చి సమ, స్తకపుల్ విభీషణుఁడును దమ-
తమ భూములకుఁ జనిరి భామా. కౌమా. ౬

ధరణీధరుఁడు శేషాద్రి ధరణిసీతామనోహరుఁ డా, హరి
పరమాత్ముఁడు నిష్క్రియుండు స త్యప్రకాశఘన, గురుస్వ
సుఖానుభవుఁడు రాముఁడు కర్తృత్వ విరహితుఁ డయ్యును
నుజుఁ డయి నందువలన జనోపదేశకుఁ డయి, గురుతరాశ్వ
మేధశత మొనర్చుచు ధరణీమణితో బదివేలేం, డ్లిరవొందె
రాముని సేవించె హితుఁడై యువరాజై దయ యుంచి, సర
సమతియై ప్రజల మించి సౌమిత్రి చెలఁగె శ్రీమించి. కౌ. ౭

౪౬. శంకరాభరణము-అటతాళము.

పల్లవి.—శ్రీరామునిశ్రీమచ్చరితము శ్రీజ్ఞానసూన వినవే.

అను.—వారాన్నిధిగర్వవిభంజనో దారశరలాఘవుని యీ
రాఘవుని, ధూమ్రరమావరు నతశ్రీకరుని దానవిచక్షణు
ని, సారసదళేక్షణుని సర్వవిలక్షణుని, హారనూపురకిరీ
టాంగదుని మణి సుగ్రీవుని వైరహృదయవిభీషణుని మ
ధురభాషణుని. శ్రీ.

ఆయుష్యము ఆరోగ్యప్రదము ఆమోదము, శ్రీయశోవర్ధ
నము శ్రీసీతాపతిప్రసాదము, శ్రీమోమార్గము ప్రియకుమా
రవిద్యారత్నసంధానము,హాయీపావనము జ్ఞానోదయము ని-
త్యాభ్యుదయము సధికపుణ్యా,మ్నాయము అధ్యాత్మరామా
య-ణం బెవరు విన్నను దివి నావా రనఘులై నా, రాయ
ణుని కరుణఁ ధన్యు-లనఁ దగుచు రందమున. శ్రీ. ౧

భూమిసురులు పఠించి సౌజన్య-ముఁ జెందుదు రిం, దేమి
రాజన్యాఘుము వింటే చెందు విజయసౌఖ్యము, ఈమహి
తాఖ్యాన మెవరు వినిన వారు, స్వామికి సన్మాన్యులు వర
ధన్యులు కామితార్థప్రదము జనకోటిజన్మదుష్కృతసం ఘా
తగుణ సంసృతియనెడివారాన్నిధి దాఁటి, శ్రీమహావిష్ణుసా
యుజ్యపదం బొందుదురు ముదంబు రామతారకము శాంభవీ
యోగిసుందరము. శ్రీ. ౨

శ్రీశేషాచలవేంకటాఖ్యల-క్ష్మీరమణుని పేర, నీశబ్రహ్మాది
లక్ష్మీస-ర్వేశిత్వశాలిపేరను, కోశాతీతనరీశసత్యజ్ఞాన గురుడా
విష్ణుని పేరను కృష్ణుని పేరను, ఈశుభాధ్యాత్మరామాయణము
తెనుఁగు కీర్తనలుగ నేర్పరించెఁ సగుణముక్తాముణుల పేరను
కౌశలంబునను యుద్ధకాండము యిదిష ట్కాండ మఖండ
చిదనుభవిరుచిరవి సుబ్రహ్మణ్యకవి. శ్రీరాముని. ౩

౪౭. హుసేనిరాగము- ఆదితాళము.

పల్లవి.—మంగళం శుభమంగళమ్.

అను.—సంగీతలోలునికి శృంగారశేఖరునికి, నంగజాతకోటి

రుచి రాంగునికి రామునికి- మంగ

సీతాసమేతునికి శ్రీపతికి భరత, జాతావరునికి జయమం
ళం. స-కౌతూహలసుమి త్రాతనయుని, ఖ్యాతవిక్రమాంజ
నా జాతశ్రీ రామునికి. కౌసల్యకుమారునికి కైకేయివరదునికి,
త్మానురాఘువుని కిని జయమంగళం. ౧

కోసలనగరీస్వామికిఁ గోరికలపెన్నిధికి, శ్రీసదాభ్యుదయు
నికి శ్రీనివాసమూర్తికి. మంగళం. ౨

శ్రీధరునికిజితవి రాధునికి భక్తజన, సాధారణునికి జయ
మంగళం. మూ-లాధారాదిషట్కమ లాగ్రసహస్రారదివ్య,
బోధానందఘన పూర్ణజ్యోతికి. మంగ. ౩

హరికి భవనీరధి తరికి ఖరదూషణారికి, శరణాగతశబరికి-
జయమంగళం. కూర్రహిరణ్యాక్షశి రోదగ్రకిటికి, హిరణ్యక
శిపు సంహార నరకేసరికి. మంగ. ౪

భానుసూనురాజ్యసం ధాననిపుణునికిని, జ్ఞాన మనో గ
మ్యునికి జయమంగళం. సన్మౌనార్హునికి సింధు మానాపహా
రికి సస,మానగాన ప్రవీణుఁ డైన శ్రీరఘుపతికి. మంగ. ౫

పక్షి వాహనునికి నక్షయునికి సరసి,జాక్షుని కధోక్షజునికి
జయమంగళం. అస్త్ర శిక్షితమారీచమక రాక్షకుంభ కర్ణా
ది, రక్షోహరునికి రాజపరమేశ్వరునికి. మంగ. ౬

రావణాంతకునికి దేవదేవునికి జనక, జావినోదకృతికి-
జయమంగళం. పరమ పావనునికి విభీష ణావనికి భూమి,
దేవిసాకర్యవర్ధిష్ణునికి విష్ణునికి. మంగ. ౭

శ్రీకాళహస్తినగరీశంభుమిత్రునికి, సౌకర్యశాలికి జయ
మంగళం. శ్రీకకుత్స్థాన్వయ సింహాసనస్థునికివి, వేకి కార్య
శేషగిరి వేంకటసుబ్రహ్మణ్యునికి. మంగళం. ౮

క. శ్రీనాయకుకృపచేతను
గానాధిపులకును నెల్ల । గడుహృద్యంబై
భానుశశితారకంబై
మానుగనీపుస్తకంబు । మహినెగడొందున్.

శ్రీమదధ్యాత్మరామాయణకీర్తనలు యుద్ధకాండము
సంపూర్ణము.



